

చల్లని నీళ్లకు కూజాలు

ఫొటో : నందగోపాల్ — హైదరాబాదు.




విరహనిరీక్ష

చిత్రకారుడు: జి. రామమోహన్—సికిందరాబాదు.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 36
30-4-58

**Founder : K. NAGESWARA RAO**

విలంబి వైశాఖ శు ఏకాదశి బుధవారం

## ★ విషయానుక్రమణిక ★



ముఖచిత్రం:

బి. ఏ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'చెంచులక్ష్మి'లో అంజలీదేవి.










# ★ కృష్ణాజిల్లా బస్సు రవాణా ★

అనగా అనగా ఒకసారి బందరెళ్ళాలని విజయవాడ 'సంధి'లో ఒక రైలెక్కాను. రైలు తప్పకుండా ఆరు ఘంటలకల్లా బయలుదేరి రాత్రి తొమ్మిది ఘంటల ప్రాంతానికి బందరు చేరుకుంటుందని రైల్వే గైడు చెప్పింది. కాబోలనుకుని సూర్యుడింకా వుండగానే రైలెక్కి కూచున్నాను. కునుకు పట్టింది. కొంతసేపు తర్వాత మెలకువ వచ్చి చూస్తే బాగా చీకటిపడివుంది. రైలు ఒక స్టేషనులో ఆగివుంది. దీపాలు తళతళ మెరిసిపోతున్నాయి. చేతివాచీ 7-25 చూపించింది. గుడివాడ వచ్చేసింది, ఇహ బందరు మరో ఘంటలో చేరిపోతాం—అనుకుంటూ మెడ బయటకు పెట్టాను.

కానీ—కనపడింది విజయవాడ ప్లాటు ఫార రాజం!

పుట్టినింటిని వదిలివెడుతున్న వధువులా, ఆ రైలు 7-40 కి బయలుదేరి, బాధలో నడిచి, నిశరాత్రి 1-30 కు బందరు చేరింది. అంటే మరుసటిరోజు బందరు చేరానన్నమాట!

మరోసారి—రైలుకన్న త్వరగా వెళ్ళొచ్చుకదా అన్న దురుద్దేశంతో విజయవాడలో బందరు బస్సెక్కాను. అయిదడుగులకన్న ఎక్కువ పొడుగున్న వ్యక్తులంటే ఆ బస్సుకి మహా ప్రేమ. అలాటివాడెవడయినా కాస్త పరధ్యానంగా ఎక్కాడూ అంటే వాడిని బుర్రమీద ఘాటుగా మొట్టుకోవడం ఆ బస్సు 'హాబీ.' సరే, ఆ కాస్త శిరోపసేవా అయింతర్వాత బస్సులో కూలబడ్డాను, అయిదుగురికని నిర్దేశించబడిన సీటులో అయిదుగురమే కూర్చున్నాం. ఖర్మకాలి మా మధ్యను ఘనకాయుడొకడూ! బస్సు కదిలింది. కంకిపాడొచ్చింది.

“అయిదుగురంటే—అయిదుగురేనా? కాస్త జరగండి...మరి కాస్త...ఇంకొక్కరే...” కండక్టరు మహాశయుడి కళ్ళకు ఆ బస్సు పుష్పకవిమానంలా అగుపించి వుంటుంది. ఎటకేలకు ఏడుమంది సీటులో ఎనిమిదిమంది 'కూర్చు'న్నాము.

బందరు చేరేసరికి దేహం, బాగా గంజిలో ముంచి ఇస్త్రీ చేయబడిన కాకీ పంట్లాంలా అయిపోయిందంటే నమ్మండి.

మరోసారి ప్రయాణంలో బందరు బస్సు దారిలో ఓ చోట ఆగిపోయింది. ఘంటసేపయినా కదల్లేదు. అడిగితే కండక్ట

## 'యాత్రిక్'

రంటాడూ—“ఖాళీ సీట్లతో కలుండిటండీ బస్సు”—అలా వెళ్ళాలంటే బస్సేదో కంటికి మంటికి ధారగా ఏడ్చిపోతూన్నట్లు. గంటన్నర తర్వాత దండలో పూసలు గుచ్చినట్లు కుక్కిన పేనుల్లా, ఒకరిలో ఒకరు అతుక్కుపోయేలా “పాసింజర్లు” ఎక్కిన తర్వాత కదిలిందా జగన్నాథరథం.

బంద రెళ్ళడమంటే భయం వేసేది. రైలయితే నుయ్యి, బస్సయితే గొయ్యి.

కాని ప్రస్తుతం—మొన్న ఏప్రిలు మొదటి తారీఖునుండీ పై బాధలన్నీ ఒక్కసారే ఎగిరిపోయాయి. ఆ రోజునుంచీ కృష్ణా జిల్లాలో గుంటూరు - విజయవాడ, విజయవాడ - బందరు మార్గాల్లో బస్సులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నడపడం ప్రారంభించింది.

(1) త్వరగా (2) సుఖంగా-బందరు చేరుకోవడమన్న కలను నిజంచేసిన శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వం ప్రశంసాపాత్రం. విశాలంగా వుండి, కూచోవడానికి మంచి సీట్లూ, చీకటి వేళలలో కావలసిన దీపాలూ కలిగి వున్న ఈ బస్సులలో రద్దీ ఇబ్బంది లేకుండా నిర్ణీతమయిన వేళలకు ప్రయాణం చేయగల్గడం ఎంత హాయిగా వుందో, ఎంత ఆనందంగా వుందో—ఇంతకు ముందు ఆ తిప్పలుపడ్డ వారికిగాని తెలియవు.

ప్రభుత్వం చేత బూనింది చాలా మంచి పని. సోషలిస్టు సామాజికవ్యవస్థా రామదండ్రా అని రాత్రింబవళ్ళు పత్రికలలోనూ ప్రసంగాలలోనూ అదే పనిగా దండడం మానేసి, సామాన్యుడి జీవితంలో ఇటువంటి సౌకర్యాలు కల్పించడంలాటి కార్యాచరణ వాంఛనీయం. ముఖ్యంగా ఈ జిల్లాలో పై రెండు మార్గాలనూ ప్రభుత్వం తన చేతిలోకి తీసుకోవడం ముదావహం.

గుంటూరు - విజయవాడ, విజయవాడ-బందరు మధ్య బస్సు మార్గాలు జాతీయం కావించబడిన మొట్టమొదటి వారంలో నే పై రెండు మార్గాలలోనూ ప్రయాణం చేసే మహాద్భాగ్యం నాకు కల్గింది. ఆ సందర్భంలో, ఇంతటి మహత్తర కార్యక్రమంలోనూ—ఇంకొ మార్పులు రావాలి అనిపించిన అంశాలు కొన్ని గోచరించాయి. వాటి నిక్కడ పొందుపరుస్తున్నాము. ఇది కేవలం ప్రభుత్వం మీద విమర్శ కాదనీ, సామాన్యుడి స్వీయానుభవం, లేక, న్యకరం క్రింద జమకట్టుకోమని మనవి. వినదగినవి వుంటే, అధికారంలో వున్నవారు గమనించి తగిన చర్యలు తీసుకోగలరని ఆశ.

జాతీయం చేయబడిన ఈ మార్గాల్లో మొత్తం 25 బస్సుల్ని నడుపుతున్నారు. వీటిలో 17 బస్సులు విజయవాడ—బందర్ల మధ్య, మిగత 8 బస్సులు గుంటూరు - విజయవాడలమధ్య నడుస్తాయి. విజయవాడ—బదరుమార్గంలో ప్రతీ 20 నిముషాలకు ఒక ట్రిప్ చొప్పున రోజుకు 42 ట్రిప్పులు, గుంటూరు--విజయవాడ మార్గంలో 39 ట్రిప్పులు...పొద్దున నాలుగు ఘంటలనుండి



# క్రిష్ణాజిల్లా బస్సురవాణా



రాత్రి దాదాపు తొమ్మిదింటిదాకా ఈ బస్సులు నడుస్తాయి. వీటిలో విజయవాడ—బందరుమధ్య కొన్ని ఎక్స్‌ప్రెస్ బస్సులున్నాయి. (వీటిఛార్జీ మామూలు బస్సుల్లోలాగే). ఈ ఎక్స్‌ప్రెస్‌బస్ విజయవాడనుంచి బందరుకు 1 గంట 45 నిముషాల్లో వెడతుందంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఇదిగాక బందరు-హైదరాబాద్‌ల మధ్య నడిచే ఎక్స్‌ప్రెస్‌బస్ ఒకటుంది. అది హైదరాబాదు చేరడానికి బందరునుండి రమారమి 11 గంటల కాలమూ విజయవాడనుంచి 9 గంటలకాలమూ తీసుకుంటుంది.

'ఓవర్ లోడింగ్'లో కండక్టర్ల ఇష్టానుసారం వస్తూ పోతూండిన బస్సులతో విసిగివేసారిన ఆ ప్రాంతపు ప్రజలకు ఈ సౌకర్యాలు కేవలం దేవుడిచ్చిన వరాల్లా వున్నాయి.

ఈ మార్గాల్లో వాడుతున్న బస్సులన్నీ హైదరాబాద్ ప్రాంతంలోని ప్రభుత్వ పరమయిన రవాణామార్గాలనుండి మళ్ళించబడిన 'లీలండ్' డీసెల్ బస్సులు. ఈబస్సులు విశాలంగా, ఎత్తుగా, ఎంతో సౌకర్యంగా వున్నాయి. కావలసినంత వెలుతురూ గాలీ రావడానికి సదుపాయంవుంది. మెత్తటిసీట్లున్నాయి. సాధారణంగా కండక్టరుకాకుండా 44 మంది కూచుని ప్రయాణంచేయడానికి వీలుంది. ఈబస్సులు వస్తూపోతూంటే ఆ ప్రాంతంలోని గ్రామవాసులు బస్సుస్టాండ్‌కువచ్చి స్వామివారి రథంవచ్చినట్లు చూచి విస్తుపోతున్నారు. వారికి బస్సుల్లో ప్రయాణంఅంటే విమానంలో వెళ్ళినట్లుందన్నమాట.

ఈ బస్సుల్లో ఒకటిరెండు చిన్నమార్పులవసరం అనిపిస్తుంది. వీటిలో ఎక్కడానికి దిగడానికీ ఒక్కటేదారివుంది. అలాకాకుండా వేర్వేరుదారులు ఏర్పరిస్తే ప్రయాణీకులకు ఇబ్బందివుండదు; బస్సులు ఇంకాస్త తొందరగా వెళ్ళిరావచ్చు.కనీసం మున్ముందు వచ్చేబస్సుల్లో ఈ సౌకర్యంవుంటే బాగుంటుందని అభిప్రాయం. ఆడవాళ్ళకు ప్రత్యేకంగా ఆరుసీట్లు కేటాయించారు. నేను ప్రయాణంచేసిన మూడు సందర్భాలలోనూ ఆరుకన్న ఎక్కువమంది స్త్రీలు ప్రయాణించారు. కనుక స్త్రీలకు మరో మూడో, ఐదో సీట్లు ఎక్కువకేటాయించి, వారు రాని పక్షంలో పురుషులు కూచోవడానికి అనుమతిస్తే బాగుండుననిపించింది. మరో ఇబ్బంది ఏవిటంటే—ఈ బస్సుల్లో సిగరెట్లు బీడీలు కాల్చడం నిషిద్ధమయినట్లు కనిపించదు. బస్సుల్లో పొగత్రాగడాన్ని నిషేధించాలన్న నాబోటి పొగతాగనివారికోరిక మిగతావారికి చాల అసమంజసంగా అవుపిస్తుందేమో. కనీసం పొగత్రాగేవారికి ఓమూల సీట్లు కేటాయించాలని మా మిత్రుడు—సిగరెట్టు భక్తుడి—ప్రార్థన.

ఇహ చాల ఘోరంగా వున్నది—ఈ బస్సుల్లో టిక్కెట్లు ఇచ్చే పద్ధతి. ఈ టిక్కెట్లు—అటు మదరాసులో వున్నట్లు ముద్రింపబడినవీ కావు. ఇటు హైదరాబాదులోలా అప్పటికప్పుడు 'సైక్లోస్టయిల్' (దీన్ని 'టమ్' అంటారట) చేయబడడమూ లేదు. కండక్టరు ప్రతివాడికీ ఎక్కడినుంచి ఎక్కడకు, ఎంతచార్జి, లగేజివుంటే దాని బరువెంత, ఛార్జి ఎంత వగైరా వివరాలను కార్బను పేపరు అడుగునవుంచి ఒక బిల్ బుక్‌లాటి దానిమీద రాసి చింపి ఇస్తాడన్నమాట. 44 మందికీ ఇలా ఇవ్వాలంటే కనీసం గంటపడుతుంది. ఇదిగాక మధ్యలో కొందరు దిగిపోగా ఎక్కిన క్రొత్తవారికీ టిక్కట్లు ఇవ్వాలి.

ఈ పొరుపడలేక కండక్టర్లు—విజయవాడనుంచి ఫలానా వూరికి ఎంతమంది వెడుతున్నారో కనుక్కొని, మొత్తం ఏ ఎనిమిది మందికో పదిమందికో కలిపి ఒకటిక్కట్టు రాసి ఇస్తున్నారు. బస్సులు సకాలంలో బయలుదేరాలంటే గత్యంతరంలేదు మరి. కానీ, మధ్య చెకింగ్ వచ్చిన ఇన్‌స్పెక్టర్లు (వీరిలో ఆరుగురు అనుభవం గడించిన వారిని హైదరాబాదు ప్రాంతంనుంచి తెప్పించారుట) మాత్రం ఇలా ఎనిమిదేసి

మందికీ పదేసిమందికీ కలిపి టిక్కెట్లురాయడం రూల్సుకు వ్యతిరేకమని కండక్టర్లను విమర్శిస్తున్నారు.

ఇంత అయోమయంలోనూ బస్సు తలుపు లోపలి భాగంమీద మాత్రం అచ్చు తెనుగులో "దయచేసి టిక్కెట్టు కొనుక్కుని బస్సెక్కండి" అని రాసివుంటుంది. కాని బస్సెక్కిన తర్వాతగాని ఈ వాక్యం కంట పడదు. పడేన్బో బస్సెక్కక ముందు టిక్కెట్టు ఇచ్చే సాధుడుండుగా!

సరే, కండక్టరు ఇంతమందికీ పెన్సిలు చెక్కుకుని, కార్బను సర్దుకొని, టిక్కెట్లు రాసిచ్చిన తర్వాత ఈ టిక్కెట్ల వివరాలను ఓ షీటుమీద రాయడం అన్న పెద్దయాగం వుంది. ఆ షీటు మీద (1) టిక్కెట్టు నంబరు. (2) ప్రయాణం ఎక్కడనుంచి (3) ఎక్కడకు (4) ఎంతమంది (5) మనిషికి ఛార్జి ఎంత (6) మొత్తం ప్రయాణం ఛార్జీ ఎంత (7) లగేజి ఎంత (8) లగేజి ఛార్జి ఎంత (9) మొత్తం వసూలయిన సొమ్మెంత—ప్రతి టిక్కెట్టుకూ ఈ 'కాలమ్స్' పూర్తిచేయాలి. ఈవిధంగా 44 టిక్కెట్లకూ రాస్తూ, మధ్య మధ్య ఎక్కే దిగే వాళ్లని గమనించుకుంటూ, సకాలంలో బస్సులు నడిపించాలంటే కండక్టర్ల ప్రాణం పోతూంది.

అధికార దండం చేతబూనిన పెద్దలు మొట్టమొదట ఈ టిక్కెట్ల పద్ధతిని మార్చివేయాలి. ఐదారు 'డినామినేషన్'ల (వేర్వేరు ఛార్జీలుకల) టిక్కెట్లను వేర్వేరు రంగాలలో, స్టేజీల నంబర్లతో ముద్రించి ఇస్తే, కండక్టర్లు ఆయా స్టేజీ దగ్గర చింపి ప్రయాణీకుల చేతికిస్తారు. లగేజికి వేరే టిక్కెట్లు ఇవ్వవచ్చు. ఇందు మూలముగా ప్రస్తుతం టిక్కెట్లు ఇవ్వడానికి పుచ్చుకునే కాలంలో సగంకన్న ఎక్కువ మిగులుతుంది. కండక్టర్లు ట్రిప్పు మొదట వున్న టిక్కెట్టు నెంబరు గుర్తించుకుని, ట్రిప్పు ఆఖరుని వున్న టిక్కెట్టు నెంబరుని గుర్తించుకుంటే రంగుకెన్ని టిక్కెట్లు అమ్ముడుపోయాయో అని సులభంగా తేల్చుకోవడానికి వీలు ఉంటుంది. ఈ కార్బన్లూ, పెన్సిళ్ళూ, తొమ్మిది 'కాలమ్స్' షీట్లలో వివరాలు రాసుకోవడమూ వుండవు. ఈ వివిధ డినామినేషన్ల టిక్కెట్ల ముద్రణకు ముందు తదనుగుణంగా ఛార్జీలలో కొన్ని చిన్న చిన్న మార్పులు చేయవలసి వుంటుందేమో. దాదాపు ఆరు నెలల క్రితం ఈ బస్సుమార్గాల జాతీయాకరణను నిశ్చయించిన రాష్ట్ర ప్రభుత్వం ఇంత చిన్న విషయాన్ని ఎందుకు గమనించలేక పోయిందా అనిపించక మానదు.

ఈ టిక్కెట్ల హడావిడిలో కండక్టర దగ్గర బొత్తిగా చిల్లర లేకపోవడం ఒకటి దారుణం. నేనెక్కిన ప్రతి బస్సులోనూ రూపాయి నోటిచ్చినా చిల్లర ఇచ్చిన కండక్టరు లేడు. కారణం ఏమిటంటే ప్రభుత్వము వారికి ప్రతిరోజూ మొదట కొంత చిల్లరైనా ఇవ్వడం లేదుట. ఈ చిల్లర వెతుక్కుని, డబ్బులన్నీ సరుకుని బస్సు బయలుదేరడానికి అదనంగా మరో పదిహేను, ఇరవై నిముషాలు ఆలస్యం. ఎటూ ప్రతీ కండక్టరునుంచి ప్రభుత్వము వంద రూపాయల చొప్పున సెక్యూరిటీ పుచ్చుకుందిగనుక రోజూ మొదట ఓ పదిరూపాయల చిల్లర ఇవ్వడంలో గల ప్రమాదమేమిటో బోధపడ్డం లేదు.

ఇలా చిల్లరలేదే అన్న ఘోష ఓప్రక్క వుండగా, (ప్రతీ ప్రయాణీకుడికీ ఉచితంగా అనుమతించే 20 పౌన్లకు మించిన) ప్రతీ మణుగుకూ లగేజీ ఛార్జీ అరణాలుక్కాణీ అనేసరికి నవ్వొస్తుంది. చిల్లరలో చిల్లర! అల్లరిలో అల్లరి! ఆ లగేజి ఛార్జీ ఏ అరణాలో లేక ఎనిమిదణాలో వుండకూడదా అని తోస్తుంది.

ఇహ తర్వాత వచ్చేదో, అతి ముఖ్యమయిందీ—ఈ రవాణాశాఖలోని ఉద్యోగుల పరిస్థితి. ఆరునెలల క్రిందే ఈ బస్సు మార్గాలను తమ చేతిలోనికి తీసుకోవాలని అనుకున్న ప్రభుత్వం—ఇందుకొఱకు ప్రభుత్వం చేయవలసిన రీతిలో కట్టుదిట్టమయిన ఏర్పాటూ నిర్ణయాలూ చేయలేదు అని యీ క్రింది విషయంలో స్పష్టమౌతుంది. లక్షరూపాయలతో హఠాత్తుగా ఏ బొంబాయి లాంటి నగరంలో విసిరివేయబడ్డ గ్రామస్థుడిలా, ఇదమిత్థం అని తేల్చకుండా, ఏదో జరుగుతూంది అంటే జరుగుతూంది అన్నట్లుంది గానీ, ప్రభుత్వం అనగానే ప్రజ ఎదురుచూచే స్పష్టమయిన, వివరమైన దిట్టమయిన పద్ధతులూ అవీ కన్పించవు.

ఈ కండక్టర్లకు ప్రస్తుతజీతం 30 రు. లు, బత్తెం 29 రూ॥ లు, ఇంటద్దెక్రింద 7 రూ॥ ఇస్తున్నారట; ఇస్తామన్నారట. పైగా ఇది తాత్కాలికం అన్నారట. ఈ వేతనం మదరాసు రాష్ట్రప్రభుత్వ రోడ్డు రవాణాసంస్థ ఇస్తున్న వేతనాలకు సమానమని రాష్ట్ర రవాణాసంస్థ కార్యదర్శి శ్రీ పాయ్ తెలిపారు. కాని ఈ కండక్టర్లే జాతీయాకరణకు పూర్వం నెలకి మొత్తం వందరూపాయలకు తక్కువగాకుండా "సంపాదించే" వారట. ఇదిగాక ఏ ట్రిప్పులోనయినా వందరూపాయలకన్న ఎక్కువ 'కలక్షను' వస్తే ఆ ట్రిప్పుకి బస్సు యజమాని డ్రైవరు, కండక్టరు, క్లీనరుకు 2 రూపాయలు బోనసుక్రింద ఇచ్చేవాడుట.

మరొక శోచనీయాంశమేమిటంటే కండక్టర్లకుగాని, డ్రైవర్లకుగాని, మిగతా అన్ని చోట్ల ప్రైవేటుబస్సుల్లోగాని ప్రభుత్వపు బస్సుల్లోగాని ఇచ్చేటువంటి 'డెయిలీ బేటా' (దినబత్తెం) ఇవ్వడంలేదుట; (ఇది తాత్కాలికమేనని అనుకుందాం.) సాధారణంగా ఈ బత్తెంక్రింద రూపాయిన్నరదాకా ఇస్తాడు. బస్సుల్లో ఇటూ అటూ పనిచేస్తూ రోజుకు ఏ రెండువందలమైళ్ళో ప్రయాణం చేయడమంటే మాటలు కాదు. ప్రతి గంటకోసారి, టీ, సోడా, కిళ్లీ, సిగరెట్లు వగైరా ఖర్చులవుతాయి. ప్రస్తుతం జాతీయం చేయబడిన ఈమార్గాలలోని బస్సు డ్రైవర్లు, కండక్టర్లు, ఇన్స్పెక్టర్లు పైఖర్చులన్నీ తమ స్వంత డబ్బునుంచి పెట్టుకుంటున్నారు. ఇలా వారికి రోజుకు ఏరూపాయో, రూపాయిన్నరో అయిపోతే వారి నెలజీతం 66రూపాయలలో మిగిలేది ఎంతో!

వీటన్నిటినీ తలదన్నిన విషయం: కండక్టర్లూ, డ్రైవర్లూ రోజుకు 16 నుండి 20 గంటలదాకా పనిచేయవలసిరావడం. నేను బందరునుండి విజయవాడకు వచ్చిన బస్సు కండక్టరు కథనం ప్రకారం అతడి డ్యూటీ రోజూ ప్రొద్దున్న 4-30 ప్రాంతంలో ప్రారంభమయి రాత్రి 10, 11 దాకా వుంటుందిట. ఇంతక్రితం రోజుకి 100 మైళ్ళు తిరిగేవాళ్ళిప్పుడు 140, 160 మైళ్ళు ప్రయాణం చేస్తున్నారు. మరి వీళ్ళకి 'ఓవర్ టైమ్' అలవెన్సులు ఇస్తారో ఇవ్వరో!— ఇదిగనుక నిజమే అయితే మన రాష్ట్రీయ సోషలిస్టు సామాజికవ్యవస్థ పునాదుల్లో ఏదో తీరనిలోపం వున్నట్లు గోచరిస్తుంది.

అలవాటులేని కొత్తపద్ధతులు, టిక్కెట్లు ఇవ్వడం ఒక అగ్నిపరీక్ష, లగేజితూచడం, టిక్కెట్టుకు తొమ్మిది 'కాలమ్స్' చొప్పున వివరాలు రాసుకోవడం, ఎక్కడ ఎవరు చేతులెత్తినా బస్సాపి వాళ్ళనెక్కించుకుని మళ్ళా వాళ్ళడిగినచోట దింపడం, టైంటేబుల్ ప్రకారం బస్సు నడవకపోతే ప్రయాణీకులడిగే సవాలక్ష ప్రశ్నలు, పరివానితాలు, దినబత్తెం లేకపోవడం, ప్రయాణీకులకివ్వడానికి చిల్లర వెతుక్కోవడం, మితిగతి లేని పనివేళలు—వీటితో ఆ కండక్టర్లు, డ్రైవర్లూ పడుతున్న బాధలూ చూస్తుంటే ప్రభుత్వం ఇంత అవకతవకగా పనిచేస్తుందా అన్పిస్తూంది. ఈ బాధలన్నీ పడలేక ఏప్రెలు మొదటి తారీఖున పనిలో చేరిన 61 మందిలో 16 మంది

చిరంజీవి తిమ్మరాజు లీలా ఉమా మహేశ్వర రావు (లేక చోడవరపు సూర్యనారాయణ వరప్రసాదు) కి

లీలా (ప్రసాదీ):

నువ్వు ఏ కారణం చేత ఇల్లు విడిచి వెళ్లావో తెలియదు. నీ ఆశయాలు ఇంట్లో వుండి సాధించుకోవచ్చు. చెప్పకుండా వెళ్లిపోయి, ఎక్కడవున్నదీ మాకు తెలుపకుండా వుండడం వల్ల ప్రయోజనం లేదు. నీకు డబ్బు అవసరమైతే, ఉత్తరం వ్రాస్తే, డబ్బు మనీఆర్డరు చేస్తాము. నీఎడ్రసు ఏమిటో తెలుపుతూ వెంటనే ఉత్తరం వ్రాయి. మీ అమ్మ.



తల్లీ పిల్లలు
చిత్రకారుడు: వీరిశెట్టి అచ్యుతరావు - పుల్లేటికుర్రు.

# ★ కృష్ణా జిల్లా బస్సు రవాణా ★

ఏప్రిలు నాలుగ తారీఖుకల్లా ఏవో కారణాల మీద శెలవుపెటి వెళ్ళిపోయారుట! ఫలితం మిగిలినవారిమీద పని ఒత్తిడి ఎక్కువయింది.

నేనెక్కిన ఒకబస్సులో కండక్టరు చాలా మంచివాడే. కాని..."బస్సు ప్రకటించబడిన వేళకన్న గంటసేపు ఆలస్యంగా వెడుతూందేం?" అని అడిగితే "రైళ్ళు రోజులు రోజులు ఆలస్యమైతే కిక్కురుమనకుండా వూరుకుంటారు గాని, బస్సు గంటాలస్యమయితే అడుగుతారేం?" అని విసుక్కున్నాడు. నిజమే మరి. అతడి బాధకు మన సానుభూతి వుండనే వుంది కాని - జాతీయమైన బస్సులు కూడా, రైళ్ళను పెద్దన్నయ్యలుగా పరిగణించకూడదుగా మరి.

మరో అంశం: బస్సుకండక్టర్ల చేతిలో వున్న రూల్సుపట్టీలో "ఎక్కడ ఎవరాపినా బస్సాపి వారి నెక్కించుకోవాలి" అని ఒక రూలుంది. నా మిత్రుడొకడు నిడుమోలు అన్న వూరుకు 6 ఫర్లాంగుల అవతల దిగవలసి వస్తే కండక్టరు బస్సునక్కడ ఆపనన్నాడు. "మరి ఆ రూలు వుందిగా" అని చూపెడితే "ఇలా ప్రతీ ఫర్లాంగుకూ ఆపుతూంటే మనం విజయవాడ వెళ్లేది రేపే" అన్నాడు. నిజమే: ఆమాట ఆరూలు పెట్టినవారికి తెలిసేవుంటుంది కానీ, బహుశ ఎక్కడపడితే అక్కడ బస్సుల్ని ఇదివరకు ఆపేవారనీ, హఠాత్తుగా ప్రయాణీకులకు ఒక నిర్ణీత స్థలంలో వచ్చి ఎక్కడం దిగడం అలవాటు కష్టమనీ అనుకుని వుంటారేమో. ఏది ఏమయినా ఈ రెండు వైరుధ్యాలకూ సమన్వయం కుదర్చాలి మరి!

ఈ బస్సులు సక్రమంగా నడవకపోవడానికి మరో చిన్న కారణంవుంది. కొన్ని సంవత్సరాలతరబడి గుంటూరు-విజయవాడలమధ్య బస్సులు నడిపిన డ్రైవర్లను, విజయవాడ - బందరు మార్గంమీద బస్సులు నడపడానికి, ఇక్కడివారిని అక్కడికి వేశారు. ఇది పొరపాటో, బుద్ధిపూర్వకమో గాని ఇటు డ్రైవర్లకూ, అటు టైంటేబిళ్ళకూ కాస్త తలనొప్పిగా వుంది.

ఇహరోడ్డు: గుంటూరు-విజయవాడ రోడ్డు బాగుంది. కాని విజయవాడ- బందరు రోడ్డు మీద కంకిపాడు - వుయ్యూరు - పామర్రుల మధ్య రోడ్డంతా ఎత్తు పల్లాలే. ఆరోడ్డు రిపేరయి ఎన్ని ఏండ్లయిందో? అసలే వెడల్పు ఆటేలేనిరోడ్డు. దాని ప్రక్కల్లో గాలికి వాలిపోయిన చెట్లు, తిప్పలూ, గడ్డివాములూ ఇవన్నీ చాలవన్నట్లు ఠీవిగా రాజకుమార్తెల్లా నడుస్తున్న (చెరుకు) ఎడ్లబండ్లు — ఒకటి కాదు, పదికాదు. వందలు వందలు - ఎంత సమర్థుడయిన డ్రైవరయినా వాటి నన్నింటినీ తప్పించుకుని పోవాలంటే మామూలుకాలంకన్నా కనీసం ఏఅరఘంటో ఎక్కువ పట్టకతప్పదు. ఈగతుకుల రోడ్డు మీద ఎక్స్‌ప్రెస్ బస్సుమీద వెళ్తుంటే, గుండెకాయా చిన్నప్రేవులూ కలిసి ముద్ద క్రింద తయారయి పోతాయేమో అని భయమేసింది. ఆబస్సులో నాతోబాటుప్రయాణం చేసిన ఐదేళ్ళలోపు పిల్లలు ముగురూ కూడా విజయవాడ నుండి బందరెళ్ళే లోపుగా— కనీసం నాలుగయిదుసార్లు దోక్కున్నారు. నెమ్మదిగా బస్సువెడితే మరిఆలస్యమయి పోతుంది. ప్రభుత్వం వారిందుకేం చేస్తారో చూడాలి.

ఈ జాతీయం చేయడమూ ఎక్కువ ట్రిప్పులూ, వాటిలో మధ్య ఎక్స్‌ప్రెస్ బస్సులూ ఏర్పాటు చేయడమూ వగైరా ఒకవిధంగా విప్లవాత్మకమైన మార్పులు. అటువంటప్పుడు మూడునెలల క్రింద ఏర్పడిన రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ వారు ఈమార్పులకి పత్రికలలో ప్రకటనల మూలంగాగాని, పోస్టర్ల మూలంగాగాని ఎటువంటి ప్రచారమూ ఇవ్వలేదన్న యథార్థం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఇందుకు ఇపుడయినా అదనుమించి పోలేదేమో.

పోతే-'ఎంక్వైరీ' ఆఫీసులవిషయం బహుతమాషాగా వుంది. విజయవాడలోని

(47-వ పేజీ చూడండి]

# న్యూఢిల్లీ లేఖ

## ప్రజలలో [illegible]

ఇటీవల కొన్నిరోజులపాటు నాయకుల ఉపన్యాసాలతో వాతావరణమంతా మారుమ్రోగింది. దరిద్రనారాయణులకు దానం చేసేందుకుగాను పిల్లలు ప్రతిరోజూ అన్నం తినేముందు ఒక గుప్పెడు గింజలు ఒక పాత్రలో పోగుచేసి ఉంచాలనే ఉద్యమానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రపతి సర్వోదయ కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతూ, తమంతట తాము పనులు చెయ్యటానికి బదులు, ప్రతిదానికీ ప్రభుత్వం సహాయం చెయ్యాలని కూర్చునే అలవాటు ఎక్కువైపోతోందని విమర్శించారు.

ప్రతిదానికీ ప్రభుత్వ సహాయాన్ని అర్థించే అలవాటును ప్రధానమంత్రికూడా విమర్శించారు. ప్రతివారూ తమంతట తాము పనులు చేయటం నేర్చుకోవాలనీ, భారత దేశానికి ప్రస్తుతం ఇది చాలా అవసరమనీ ఆయన అన్నారు. పెట్రోలియమ్ శాఖా మంత్రి పండిట్ కేశవ్ దేవ్ మాలవీయ అధ్యక్షతను జరిగిన అఖిలభారత సహకార సమావేశాన్ని ప్రారంభిస్తూ ప్రధానమంత్రి ఉపన్యసించారు. ఈ సమావేశంలో పండిట్ పంత్, ఆహార, వ్యవసాయమంత్రి శ్రీ ఎ. పి. జైన్‌కూడా ఉపన్యసించారు. ప్రధాన మంత్రి తమ ప్రారంభోపన్యాసంలో ప్రభుత్వం సహకారోద్యమ విషయాల్లో ఎక్కువగా కలగజేసుకోవటం మంచిదికాదని, సహకారోద్యమంతో ప్రభుత్వం ఎక్కువ సంబంధం పెట్టుకోవాలని గ్రామ పరపతి పరిశీలనసంఘం చేసిన సూచనలను ప్రభుత్వం అంగీకరించటం తప్పేననీ అంగీకరించారు.

సహకారశాఖ మంత్రి డా॥ పంజాబ్ రావు దేశ్‌ముఖ్ పార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ, ప్రధానమంత్రి ఉపన్యాసంలో నిజంగా ఉన్నదానికంటే ఎక్కువగా సభ్యులు ఊహించుకుంటున్నారని అన్నారు. శ్రీ అశోక మెహతా పార్లమెంటులో మాట్లాడుతూ, గ్రామ పరపతి పరిశీలనసంఘం సూచనలను ఆధారంగా చేసుకుని ప్రభుత్వం రెండేళ్ళపాటు పని చేసిందనీ, ఇప్పుడు హఠాత్తుగా ఆ సంఘం నివేదిక ఏమీ బాగాలేదని అభిప్రాయపడటంలో అర్థంలేదనీ అన్నారు. ఒకసారి ఒప్పుకున్నదాన్ని ఉన్నట్టుండి బాగాలేదని తోసివేసేటంత స్వేచ్ఛాభావాలు తనకు లేవని ఆయన వ్యంగ్యంగా అన్నారు.

ప్రధానమంత్రి మరో మూడు సమావేశాల్లోకూడా ప్రసంగించారు. భారత సేవకసమాజ్ ప్రచారశాఖ ఏర్పాటుచేసిన

---

**శ్రీ కృష్ణ**

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

---

అఖిలభారత గ్రామప్రచారక శిక్షణాశిబిరం అంతిమ సమావేశంలో ఉపన్యసిస్తూ, సోషలిస్టువ్యవస్థను సాధించటానికి జరిగే కృషిని తీవ్రం చేయాలని ఆయన కోరారు. న్యూఢిల్లీ శివార్లలోని ఓఖ్లావద్ద దేశంలో కల్లా పెద్దదైన ఒక పారిశ్రామిక సంస్థకు ప్రారంభోత్సవం చేస్తూ, అణుశక్తికీ, తకిలీ, చర్ఖా, ఎడ్లబండికీ మధ్య సహజీవనం సాధ్యమనటానికి తననుతానే తార్కాణం చేసుకున్నారు. ఆయన మీరట్‌లో ఒక యుద్ధ స్మారకచిహ్నానికి కూడా ప్రారంభోత్సవం చేశారు.

రాష్ట్రపతి ఉత్తమ చలనచిత్రాలకు బహుమతులిస్తూ మాట్లాడారు.

శ్రీమతి జగ్జీవన్‌రాం ప్రారంభించిన రైల్వే వారోత్సవాలు శ్రీయుత జగ్జీవన్‌రాం 16 గురు రైల్వే కార్మికులకు వెండి, బంగారుపతకాలు బహూకరించి, వారితో కలిసి ఫొటో తీయించుకోవటంతో సమాప్తమైనాయి.

ప్రజలు తమకుతామే సహాయం చేసుకోవాలని రాష్ట్రపతి, ప్రధానమంత్రి ఉద్బోధించటం చాలా ప్రశంసనీయంగా ఉన్నమాట నిజమే. కాని ప్రజలు అలా తమకు తాము సహాయం చేసుకునే అవకాశాన్ని మంత్రులెన్నడైనా ఇచ్చారా అని ప్రశ్న. అసలు పెట్రోలుకూ, సహకారోద్యమానికీ సంబంధమేమిటి? పెట్రోలు మంత్రి పండిట్ మాలవీయ అఖిలభారత సహకార మండలికి అధ్యక్షుడుగా ఉండటానికి ఎందుకు అంగీకరించారు? ప్రధానమంత్రికి నోరుతిరగని పెద్ద బిరుదం ఇవ్వాల్సిన అగత్యం ఏమివచ్చింది? రాజకీయంగా, సాంఘికంగా పైకిపొదల్చుకున్న మహాశయులకి ప్రజలు ఇష్టంవచ్చినట్లు ఆడించటానికి వీలున్న చదరంగపు పావుల్లాగ కనబడతారు. ఒక్కొక్క మెట్టే ఎక్కి ఉన్నత పదవులను చేరుకోటానికి ఎప్పటికప్పుడు కొత్తపద్ధతులను కనిపెట్టేందుకు జాగ్రత్తగా ఎడతెగని పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. సభజరపటానికి కొస్తసందు దొరికితే చాలు సభజరిపి ఏ మంత్రినో బ్రహ్మరథ మెక్కిస్తారు. మంత్రులు నోరుతెరిచినా, కాలుకదిపినా ఇంత వివరంగా వార్తాపత్రికల్లో వార్తలు ప్రకటించే దేశం భారతదేశం ఒక్కటే. ఆఖరికి రష్యా, చైనాల్లోకూడా ఇంత 'ఇది' లేదు. సభలు సమాప్తంకాగానే, ఏదోవంకమీద గోష్ఠులు (సెమినార్స్) జరుపుతారు. అసలు కొన్ని సంస్థలు లేవటం, కొన్ని ఉద్యమాలు బయలుదేరటం ప్రజాశ్రేయస్సుకోసం కానే కాదు, కేవలం మంత్రిసత్తములను భజన చేయటానికే. రామలీలా ఉత్సవాలవంటి మతోత్సవాలు కూడా ఈమధ్య మంత్రుల అధ్వర్యాన జరుగుతున్నాయి.

ప్రజల్ని ఇలా వాడుకుంటూంటే వారిలో స్వయం సహాయభావం కలగాలంటే ఎలా కలుగుతుంది?

సహకారోద్యమం కానివ్వండి, మరో ఉద్యమం కానివ్వండి - అందులో ప్రభుత్వ

(56-వ పేజీ చూడండి)



# పకపకలు

"ప్రతిరోజూ రాత్రి నిద్రపోయే ముందు, ఆ రోజున నేను చేసిన చెడ్డ పనులను గురించి ఆలోచిస్తాను" అన్నాడొకడు.

"అయితే మరి రోజూ నీకు నిద్ర సరిపోతుందా?" సందేహం వెలిబుచ్చాడు మరొకడు.

* * *

ఒక ట్రాఫిక్ సెంటర్లో పోలీసు కానిస్టేబులు ఎంతసేపటికి దారి ఇవ్వకపోవడంతో విసిగి బయటకు దిగాడు డ్రైవర్. ఆ రోడ్డు రెండవ ప్రక్క మరి ఒక కారుడ్రైవరు నిలబడ్డాడు.

మొదటివాడు: అరే! అవతలి ప్రక్కకు ఎలా వెళ్ళగలిగావు?

రెండవవాడు: నేను పుట్టింది ఇక్కడే గదా!

* * *

మేష్టారు: గద్యానికి పద్యానికి భేదం చెప్పు శేఖర్.

శేఖర్: వెంకయ్య అనే రైతు ఉండేవాడు. అతడు ఒక రోజున నదికి స్నానము చేయుటకై వెళ్లెను; ఇది గద్యం మేష్టారూ! అతను ఇంకా కొద్దిగా లోతుకు వెళ్ళి నీరు అతని మీదుగా ప్రవహించినట్లయితే అది పద్యం అవుతుంది.

* * *

"నువ్వు గడియారం దొంగిలించానని అంగీకరించావు. నీవింకా చెప్పాల్సిన దేమైనా వుందా?" ప్రశ్నించాడు ముద్దాయిని జడ్జి.

"ఆ గడియారానికి 40 రు. ఖర్చుపెట్టి బంగారపు గొలుసు వేయించాను" అని వాపోయాడు ముద్దాయి.

* * *

భార్య దహనసంస్కారం చేసి ఇంటికి తిరిగి వచ్చాడు ఒక పెద్దమనిషి. ఇంటి మీద పెంకు ఒకటిజారి ఆయనతలను దూసుకుపోయింది. "ఇంతలోనే యీమె స్వర్గానికి చేరిందా?" ఆశ్చర్యంగా అనుకున్నాడు ఇంట్లోకి వెళుతూ.

* * *

మేష్టారు: నువ్వు సైన్సులో చాలా వెనుకబడివున్నావు. ఇంపోజిషను 10 సార్లు వ్రాయమంటే 7 సార్లే వ్రాశావు?"

కుర్రవాడు: లెక్కలలో కూడా నండి.

* * *

మేష్టారు సృష్టిని గురించి పాఠం చెబుతున్నారు. మధ్యలో ఒక కుర్రవాడు లేచి అన్నాడు: "మనమంతా కోతులకు పుట్టామని మా నాన్నగారు చెప్పారు."

"నేను మీ ఇంటి విషయాలను గురించికాదు చెప్పేది" జవాబిచ్చాడు మాష్టారు.

* * *

నర్సు: డాక్టర్! నేను ఎప్పుడు ఈ రోగి నాడి చూసినా నార్మల్‌కన్నా చాలా ఎక్కువ కొట్టుకొంటోంది."

డాక్టర్. కళ్ళకు గంతలు కట్టి మరీ నాడి పరీక్షించండి."

—కె. సుభాస్‌చంద్రబోస్

# భలే మేళం

భీమయ్యను గురించి వ్రాయటం మొదలెడితే ఒక్క ఉపోద్ఘాతమే బంగాళాఖాతమంత అవుతుంది. అతడు చిన్నతనంలో కొన్నాళ్ళు నిరుద్యోగశాఖలో హెడ్ గుమాస్తాగా ఉండేవాడు. కాని తరువాత మెల్లగా చెట్టుకింద ప్లీడరైనాడు. తినేవాళ్ల అదృష్టం బాగుండటంచేత, అతనికి బాగా రోజులు కలిసొచ్చాయి. దానితో క్రమంగా యిల్లువాకిలి పొలము పాత్ర పుష్కలంగా సంపాయించుకున్నాడు. ఆయనకు ముగ్గురు ఆడబొమ్మలు కలిగారు. తరచుగా యేకాదశి చేసేరోజులో తనకు తల్లిదండ్రులు భీమయ్య అనిపేరు పెటారు. కాని నాలుగు రాళ్ళుచేరినతరువాత తానే తన పేరును భీమేశ్వరరావుగా ఫిరాయించుకున్నాడు. అటువంటివాడు తన బొమ్మక్కలకు యెటువంటిపేరు పెడతాడు? సినిమా పిక్చర్ల పుస్తకాలన్నీ తెప్పించి అందులో ఉండేతారల పేర్లన్నీ యెడాపెడా తిరగేసి బోరేసి విరిచేశాడు. చిట్టచివరకు తన స్నేహితుల సలహా మీద మొదటి కూతురికి రాజ్యం అని నామకరణం చేశాడు. తరువాత రెండవది కలిగింది. సరే, దాని పేరు స్వరాజ్యం అన్నాడు. కొన్నాళ్ళకుమళ్ళా ఆడపిల్లే కలిగింది. సామాన్యుడికి తేగా ఆడబొమ్మల భయం? లక్ష్మి తాండవమాడుతోందాయెను తనయింటో! అందువల్ల మహానందంతో ఆ అమ్మాయిని సామ్రాజ్యం అని పిలిచాడు. రాజ్యం, స్వరాజ్యం, సామ్రాజ్యం! బాగానే కుదిరాయి అనుకున్నాడు. ముగురికి కాలక్రమేణా మూడు ముళ్లుపడే ఉపాయం చూసి, వాళ్లను ఒక యింటివాళ్ళనుచేశాడు.

అయితే అతన్ని పున్నామ నరకంలో పడకుండా చేసేమహానుభావు లెవరు లేరా! లేకేం? ఉన్నారు యిద్దరు మొగరాయుళ్లు, తరువాత కలిగినవారు. వారిలో మొదటి వాడి పేరు ప్రతాప్. కాని నామకరణం రోజున అమ్మమ్మలు, నాయనమ్మలుచేరి రెండవవాడి పేరె కొండవీటి చేంతాడంతసాగలాగేశారు. అందువల్ల వాడిపేరు పెరిగి పెరిగి చివరకు సీతారామాంజనేయ వేంకటగోపాల వీర వరజయప్రసాదతిలక్ అయింది. అందులో చివరి ముచ్చు భీమేశ్వరరావుగారు తమ దేశభక్తికి చిహ్నంగా చేర్చిందీ! కాలచక్రం దిపావళిలో విష్ణుచక్రంలాగా గిరగిరతిరగసాగింది. మొత్తంమీద యేవో కొద్ది దండయాత్రలతోనే ప్రతాప్ మెల్లమెల్లగా వచ్చి బి. ఎ. లో పడ్డాడు. వాడు త్వరగా చేతికొస్తాడని, తనకేదో త్రవ్వి తలకెత్తుతాడని భీమయ్య యెన్నో కలలు గంటూఉండేవాడు. వాని మీద తన ప్రేమంతా గుమ్మరిస్తూఉండేవాడు.

ఇక రెండవవాడే తనకు పచ్చి వెలక్కాయ అనిపించాడు. వాడు మొదటిఫారము యెల్లాగో మొదటి సంవత్సరమే దాటాడు. కాని అక్కడినుంచి కనిపట్టింది. రెండవ ఫారము రెండేండ్లు చదివాడు. మూడవ ఫారము మూడేండ్లయింది. అప్పుడు వాడు నాలుగవఫారం రెండవ యుద్ధంలో ఉన్నాడు. పైలెక్క ప్రకారం భూమి సూర్యుడి చుట్టు నాలుగుసారు ప్రదక్షిణం చేస్తేనే గాని, వాడు ఆ యింట్లోంచి కదిలేటట్లు లేదు. వాడి పేరెత్తితే సరిచిట్టుబుస్సులాడుతూ ఉండేవాడు పట్టరాని ఉద్రేకంతో భీమయ్య. వాడు చదువుకంటే మొద్దు కాని

## చిట్టా రామకృష్ణరావు

ఇంటిపనులకంటే ముందడుగు వేసేవాడు. ఒళ్ళు దాచుకోకుండా, యీవేళ ఆవేళ అని లేకుండా, యీపని ఆపని అనుకోకుండా, తల్లికి అన్నిపనులు చేసిపెట్టేవాడు. అందువల సహజంగా తల్లి కాంతమ్మకు వానిపైన మమకారం యెక్కువగాఉండేది. భీమయ్యకు యేసుడివల్లనో సిరిబాగా వంటపట్టిందేగాని సంస్కారమనేది యేకోశాన కలగలేదు. అందువల్ల అతనికి ఆ రెండవ వాని పనులేమీ నచ్చేవికావు. చవటపెద్దమ్మని మొద్దుదద్దమ్మని వాడికి బిరుదులు ప్రసాదించాడు.

ఎన్నో రాయబారాలమీద యెటకేలకు అమాంబాపతు అయిదువేలు దాకా దక్షిణ లాగి భీమయ్య మొదటివానికి వివాహం చేసేశాడు. పోతే, ఆ రెండవ ఘటం యెల్లాగైనా ఆ స్కూలుఫైనలులోనన్నా కాలు పెడతాడేమో మరొక పెద్ద పద్దుకొట్టవచ్చునని లాటలు వేస్తున్నాడు. కాని యేం లాభం? ముందువాడు ఆ నాలుగుగోడలగదిలో నుంచి కదిలితేగా! అయినా భీమయ్య ఆస్తి అట్టహాసము చూచి కొన్ని సంబంధాలు వస్తూ ఉండేవి. కాని విఘ్నేశ్వరుడి పెళ్ళికి అన్ని విఘ్నాలే అన్నట్లు, భీమయ్య రెండవ అమ్మాయి ఉండే స్వరాజ్యం, ఆమె చేరి సమయానికి పాకంచెడకొడుతూ ఉండేది. వచ్చిన పిల్లవల్లా కల్యపరీక్ష చేసి, కొట్టిపారేసేది. పోనీ యింతగా విమర్శించే తానేమైనా మహా అందాల రాణి అనుకుంటారేమో! సాధారణంగా కొందరు పగలుచూస్తే రాత్రి కలలోకి వస్తారు. కాని ఆమె మాత్రం రాత్రిమాస్తే పగలే కలలోకి వస్తుంది! ఆమెకు "పెండ్లికూతురు అంత పొడుగు ఉండకూడదు, అంత పొట్టి ఉండకూడదు. ముఖం అంత గుండ్రంగాను ఉండకూడదు, అంత కోలగాను ఉండకూడదు. జడ అంత బారుగాను ఉండకూడదు, అంత కురచగాను ఉండకూడదు. నడుము అంతలావు ఉండకూడదు, అంతసన్నము ఉండకూడదు. పెదవులు నవ్వినట్లూ ఉండకూడదు, యేడ్చినట్లూ ఉండకూడదు!" ఈ విధంగా ఆమె షరతులు సవరణలు రోజురోజుకి ద్వంద్వయుద్ధం చేస్తుంటే యెటువంటి అప్సరసలూ ఆమె దగ్గర నిలవలేక ఉఫ్ అని యెగిరిపోయేవాళ్లు! ఒక అమ్మాయి ఆపాదమస్తకము సాక్షాత్తు పోతపోసిన బంగారపు బొమ్మ. ఆ అమ్మాయి చిరునవ్వు నవ్వి నప్పుడట యెడమబుగ్గ కింద చిన్నసొట్ట ఉన్నట్టు కొద్దిగా అనుమానం కలిగిందట! టట్, ఆపిల్ల తనకు నచ్చలేదు తెమ్మంది. మరొక అమ్మాయి తనతమ్ముడేదో అడగటంతోటే వెంటనే చలాకీగా జవాబు చెప్పలేదట! మనకు పనికిరాదు పొమ్మంది! ఒక విధంగా ఆ మహాతల్లికి పోలినవాడే భీమయ్యగారు కూడ. ఆయనకు మొదట్లో నోటిదురద యేదోకొద్దిగా అవగింజంతమాత్రమే ఉండేదికాని, క్రమక్రమంగా సంపద పెరిగినకొద్దీ అదికూడ పెరిగిపెరిగి పెద్ద గుమ్మడికాయంత అయి ఊరుకుంది!

ఒక రోజున భీమయ్య నోరు పారేసుకుంటూ తిలక్ మీద నిప్పులుతొక్కిన కోతిలాగా తెగ యెగురుతున్నాడు. అంతేకాక ఆ ఉద్రేకంలో తిలక్‌ను విసురుగా ఒక్క తన్ను తన్నాడు. మోకాలికి బలంగా దెబ్బ

## ★ భలే మేళం ★

తగలటంచేత కింద పడిపోయాడు తిలక్. తెలివచ్చి లేచితే యెంతో కష్టంమీద లేచి కుడికాలు కుంటుతూ వంటింట్లోకి వెళ్లాడు. నిజానికి తాను తనయెడమచెయ్యి కొంచెం విసిరితే చాలు, భీమయ్య మూడుపార్లు పడి లేస్తాడు. కాని తిలక్ పల్లెత్తుమాట కూడ అనకుండా వెళ్లిపోయాడు. ఈ గొడవ విని రోడ్డుమీద వెడుతున్న ఒక సాహెబ్ గారు ఆగి, "ఏమిటండీ! భీమయ్ గారూ! ఇంట్లో ఏదో గడిబిడీలో వున్నారు!" అని అడిగాడు. ఉన్న సంగతి చెపితే తనపెనిమిటికే మర్యాద భంగమని కాంతమ్మగారు వెంటనే వసారాలోకి వచ్చి, "ఏంలేదు సాయిబు గారూ, వారికి కొంచెం సుస్తీగా ఉండటం చేత, సైత్యపుమాటలు మాట్లాడుతున్నారు" అని సమాధానం చెప్పి ఆయన్ని పంపించేసింది. ఆమె సమయస్ఫూర్తికి మెచ్చుకోలేదు సరికదా, భీమయ్య "ఏమే! నాకు జ్వరం రావాలని కోరుతున్నావ్!...... ఛీ, నిన్ను పెండ్లిచేసుకోవటమే అసలు పొరపాటైందే! నీ వసలు మా వంశానికే తగవే!" అంటూ, యింకా యేమేమో నోటికొచ్చినదల్లా వాగుతూ పిచ్చెత్తినట్లు మొరగటం మొదలెట్టాడు! ఆయన వంటయింటి యుగంధర వేషం చూసి యింట్లో అందరు నోటికి తాళాలేసుకుని ముక్కుమీద వేలేసుకున్నారు!

○ ఒకనాడు భీమయ్య యేదో తొందర పని మీద యీదుకుపోయించిన వేగంతో బజారుగుండా సైకిలు తొక్కుతున్నాడు. ఒక మలుపు దగ్గిర అకస్మాత్తుగ ఒక ఒంటెద్దు బండి అతన్ని ఢీకొన్నది. సైకిలు కేమీ ముప్పం కలగలేదుగాని, అతను మాత్రం పోయి ప్రక్కనున్న మురుగుకాలువలో అమాంతంగా ఒక మొగ్గేశాడు. దానికి ఫలితంగా తన కుడిమోకాలు చిప్ప పక్కకు తొలిగింది! తక్షణం ఆబండిమీదనే అతన్ని ఆసుపత్రికి తీసికెళ్ళారు. కనీసం ఒకవారం రోజులైనా ఆసుపత్రిలో ఉండక తప్పదన్నాడు డాక్టరు. ఈవారంలోను పెద్దకొడుకు ప్రతాప్ ఆసుపత్రికి యే రెండు మూడు సార్లో చుట్టం చూపుగా వచ్చిపోయాడు. కాని తిలక్ మాత్రము తన ప్రక్కనే కూర్చుని రాత్రింబగళ్ళు ఆసుపత్రి వదలకుండా ఉండేవాడు. వీరిద్దరి ప్రవర్తన చూస్తే భీమయ్యకు చాలా ఆశ్చర్యం వేసింది. తాను కన్ను మూసుకుంటే సరి, తిలక్ మారుమాటాడకుండా కుంటుతూ వంటింట్లోకి వెళ్ళినదృశ్యం ప్రత్యక్షమయ్యేది! ఇదంతా అతని హృదయక్షేత్రంలో ఒక వింతైన సంక్షోభాన్ని కలిగింపసాగింది. అనుకున్న ప్రకారం ఆసుపత్రివారు వారం కాగానే భీమయ్యను విడుదలచేశారు. కాని అతనింకా బాగాలేచి నడిచే స్థితిలో లేడు. ఇంటిదగ్గర కూడ భీమయ్యకు ప్రతాప్ దర్శనం అరుదైపోయింది! ఎప్పుడు అతనికి తన పుస్తకాలేమో! తనచదువేమో! అంతే కాని తనకు తండ్రి విషయమేమీ పట్టినట్టే కనబడలేదు! ఎందుకు పనికిమాలిన వాడని తాను యెవడిని యింత కాలంనుంచి ద్వేషిస్తున్నాడో ఆ తిలక్ యింటిదగ్గర కూడ యిరవై నాలుగు గంటలు తనను అంటిపెట్టుకొని ఉండి తనకు మలమూత్రాల దగ్గరనుంచి యెత్తివేస్తూ అద్భుతమైన ఉపచారం చేస్తున్నాడు! భీమయ్యకిదంతా చాలా ఆశ్చర్యకరంగా కనపడింది.

ఇంతలో తనను చూడటానికి తన ముగ్గురు కూతుళ్ళు అల్లుళ్ళు వచ్చారు. తన అల్లుళ్ళేనా యెక్కడో దూరపువాళ్ళు కాక దగ్గిర బంధువర్గంలో వాళ్ళే. వాళ్ళు యేవేవో మంచి ఉద్యోగాలలోనే ఉన్నారు. ఒకనాడు భోజనాలదగర భీమయ్య తన పెద్దకొడుకు ప్రతాప్ చదువులో చాలా తెలివైనవాడనీ, మంచిగుండె నిబ్బరము ధైర్య సాహసాలు కలవాడని తన అల్లుళ్ళ హోదాకుతగినట్లుగా బడాయి చెప్పసాగాడు. అప్పుడు ప్రతాప్ కూడ ఆమాటలకింకా ఊతయిస్తూ, తాను బి.ఎ. కాగానే పోలీసుడిపార్టుమెంటులో చేరదలుచుకున్నాననీ, దొంగలన్నా దొంగలను పట్టటమన్నా తనకు మంచిసిళ్ళప్రాయమని అల్లాచేరితే కనీసం పోలీసు సూపర్నెంటుగా

మైనా రిటైరు కావచ్చునని కోతలు కోశాడు. అల్లుళ్ళు ముగ్గురు ముసిముసినవ్వులు విసురుతు మామగారి మాటలకి, బావగారి బడాయిలకి చాలా సంతోషించినట్లు నటించారు.

ఆ రాత్రి భీమయ్య మామూలు ప్రకారమే వసారాలో మంచంమీద పడుకు వాల్చాడు. అతని ప్రక్కనే కింద పక్క వేసుకుని దగ్గరగా పడుకున్నాడు తిలక్. ప్రతాప్ కొంచెం సేపు పుస్తకాల ముందుగొణిగి మరొక మంచం మీద శయనించాడు. తనకొయ్య నలంకరిస్తూ, "ఒరేయ్ అంజాయ్, మధ్యమధ్య నాన్నను పట్టుకుని లేపటానికి నీవు తంటాలు పడాలిసిందే సుమా. నన్ను మాత్రం నిద్రలేపావంటే ఊరుకోను జాగ్రత్త!" అంటూ హెచ్చరించాడు పట్టభద్రుడు కాబోయే అన్నగారు! ప్రతాప్ మహాశయుడు! ఆ మాటలకు లోలోన ఆశ్చర్యపోతూ నిద్రపోయాడు భీమయ్యకూడ. తక్కిన వాళ్ళంతా యింట్లో పడుకుని గుఱ్ఱులు కొడుతున్నారు.

గడియారం అప్పుడే పన్నెండు కొట్టింది. ఎటుచూచినా చిమ్మచీకటి. కట్టెదుట నున్న ముఖమైనా కనబడటంలేదు! గాఢనిద్రలో ఉన్న ప్రతాప్‌కి యెవరో హఠాత్తుగ తోసినట్లైంది. ప్రతాప్ కళ్ళు తెరిచి చూచాడు. అతనిగుండె ఝల్లుమన్నది. ఎవడో వ్యక్తి తనకు దగ్గరగా నిలుచుని తన రొమ్ముకు రివాల్వర్ గురిపెట్టాడు. నోరుమూసుకుని ముందు ఆ ఉంగరం యిలాయియ్యి! లేకపోతే నీప్రాణం దక్కదు! తెలిసిందా!' అని సైగలలో తనను బెదిరిస్తున్నాడు! అతనికి పై ప్రాణాలు పైననే పోయాయి! నోట మాటరాలేదు. నఖశిఖ పర్యంతం తాను గడగడ వణకసాగాడు. తన వేలికున్న ఉంగరం కాస్తా చకచకా తీసి వానిచేతిలో పెట్టాడు. 'ఇకనోరెత్తకుండా, దుప్పటి కప్పుకునిపడుకో. కదిలావా, దెబ్బకు చంపేస్తాను జాగ్రత్త' అని మళ్లా బెదిరించాడు. ఆదొంగ ప్రతాప్ తూచా తప్పకుండా అతను చెప్పినట్లు చేశాడు. ఆనల్లని ముఖము, ఆ కోరమీసాలు, ఆ పత్తికాయ వంటికళ్లు, అన్నిటినీ మించిన ఆ రివాల్వరు, అతనినోరు నొక్కకు పోయేటట్లు చేశాయి! ఆ దొంగ మెల్లగా భీమయ్యగొంతు మీద యెడమచేయి వేసి, పైకిలేవకుండా నొక్కిపట్టి, రివాల్వరు గొంతుకు గురిపెట్టాడు. 'ఇనప్పెట్టె తాళం చెవియిస్తావా లేదా? లేక దీన్ని పేల్చమన్నావా? చెప్పు,' అని గుద్దురిమాడు. పైకి లేవలేక, మాట అనలేక భీమయ్య మంచంలోనే గిలగిల తన్నుకుంటున్నాడు. ఇంతలో తిలక్‌కు మెలుకువవచ్చింది. తిలక్ గబాలునలేచి తండ్రి గొంతుమీదనుంచి ఆ దొంగ చేతినివిసురుగా లాగేశాడు. తన తండ్రికి యేమాత్రము దెబ్బతగలకుండా వెంటనే అడ్డంగా చేతులుచాచి నుంచున్నాడు. తిలక్‌కీ దొంగకి కాసేపు ద్వంద్వయుద్ధం జరిగింది. అడ్డంలేస్తావా? లేకపోతే కాల్చనా?' అని ఉరిమాడు దొంగ 'చేతనైతే నన్ను కాల్చు, అంతేకాని మా నాన్న మీద ఒక్క నలుసైనా పడనియ్యను' అంటూ తిలక్ దొంగతో పెనగసాగాడు. మళ్లా మరుక్షణంలోనే ఉన్నట్లుండి తటాలున యెగిరి రివాల్వరున్న దొంగచేతిని గట్టిగా పట్టుకున్నాడు. భీమయ్య నోట మాటరాక, పైకి లేవలేక, కొట్టుకుంటున్నాడు. ప్రతాప్ మెలుకువగా ఉండికూడా కదిలితే యెక్కడ యేమి ముప్పువస్తుందో అని దుప్పటి కప్పుకుని ముసుగుతన్ని పడుకున్నాడు!

ఇంతలో గస్తీ పోలీసు యీల వినబడింది. కనురెప్పపాటులోనే గస్తీ పోలీసు అక్కడికి వచ్చాడు. 'ఏమిటీ అల్లరిక్కడ?' అంటూ తనచేతిలోని లాంతరు ఎత్తి చూశాడు. 'ఎవరో దొంగండి, మమ్మల్ని చంపటానికివస్తే, మావాడు పట్టుకున్నాడు' అని జవాబిచ్చాడు భీమయ్య ధైర్యం తెచ్చుకుని. తిలక్ దొంగచేయిని మాత్రము విడువకుండా గట్టిగా పట్టుకున్నాడు. ప్రతాప్ యింకా ధైర్యంచాలక కప్పుకున్న దుప్పటి మరింత గట్టిగా బిగించుకున్నాడు. ఆ పోలీసు లాంతరెత్తి ఆ దొంగమొహం చూసి, 'ఎవడో మొఖానికి బొగ్గు దట్టంగా పట్టించాడే! ఎవడవురానీవు?' అని గది

(55-వ పేజీ చూడండి)




చెరువు వద్ద

చిత్రకారుడు: శీలావీర్రాజు - రాజమండ్రి.

"సర్పోభవ, సర్పోభవ, సర్పోభవ,"

చిత్రకారుడు: వి. వెంకటేశ్వర్లు—వేమవరం.

# శాప విమోచనం

మహాభారతంలో ఏమాత్రం పరిచయమున్నా నహుషుడి పేరు తెలిసేవుంటుంది. ఇతడు ఒకరాజు. ఊర్వశి ఇతడితల్లి; పురూరవుడు తండ్రి. ప్రియంవద నహుషుడి భార్య. ఇతడికి యతి, యయాతి, సంయాతి, యాయాతి ధ్రువుడు అనే కుమారులు కలిగారు.

నహుషుడు అనేక యజ్ఞాలుచేసి దేవత్వాన్ని సాధించాడు. ఒకానొక సందర్భంలో వృత్రుడనేవాణ్ణి చంపిన మహాపాతకం ఫలితంగా ఇంద్రుడు దేవలోకాన్ని వదలి పోవడం సంభవించింది. అప్పుడు ఇంద్రపదవి సైతం నహుషుడికి సంక్రమించిందని మన పురాణగాథ. ఇంద్రపదవి లభ్యమైనందుకు నహుషుడు మహాగర్వించాడు. ఆ గర్వాంధకారంలో అతడు దేవతలనూ, మునులనూ ఘోరంగా అనుమానించడం ప్రారంభించాడు. ఇంతటితో ఆగలేదు. ఇంద్రుడి భార్య శచీదేవిని చూసి మోహించాడు—ఆవిడను తన వద్దకు తీసుకురావలసిందని దేవతలను ఆజ్ఞాపించాడు. అంతట శచీదేవి ఒక చిన్న యుక్తి పన్నింది. మునివాహనం మీద నహుషుడు తన వద్దకు వచ్చినట్లయితే, అతడి పొత్తుకు అంగీకరిస్తానని సమాధానం చెప్పింది. అందుకు గర్వాంధుడైన నహుషుడు అగస్త్యాది మహామునులను తన అందలాన్ని మోయవలసిందని ఆజ్ఞాపించాడు. అప్పుడు విధిలేక అందలం మోయవలసివచ్చిన అగస్త్య మహాముని: గర్వాంధకారం చేత కన్నూమిన్నూ కానకుండా నీవు ఈవిధంగా అంటున్నావు కాబట్టి సర్పమై పుటవలసిందని నహుషుణ్ణి శపించాడు. సర్పమై పడివుండే నహుషుడు వేసే ప్రశ్నలకు ఎవరు ఎప్పుడైనా సరిఅయిన సమాధానాలు ఇవ్వగలిగితే ఆనాడు శాపవిమోచనం కలుగుతుందని అగస్త్య మహర్షి శాప ఉపసంహార మార్గాన్ని కూడా సూచించాడు.

నహుషుడు సర్పమై పడిపోయినప్పటికీ పూర్వజ్ఞానంమాత్రం పోలేదు. దొరికిన ప్రతివారినీ నోటకరుచుకోవడం,పలురకాల ప్రశ్నలు వేయడం ప్రారంభించాడు. ఎవ్వరూ ఆ ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వలేక పోయివారు. ఒకనాడు ఆ ప్రాంతంలోని వనంలో విహరిస్తున్న భీముడు కూడా ఈ సర్పంనోటిలో చిక్కుపడడం సంభవించింది. భీముడు తప్పించుకోవాలని ఎంత ప్రయత్నించినా సాధ్యంకాలేదు. అంతట భీముణ్ణి వెతుక్కుంటూ ధర్మరాజు ఆ పామువున్న చోటుకు వచ్చాడు. పామునోటిలో బంధింపబడివున్న సోదరుణ్ణి చూశాడు. ఈ సర్పరూపంలోవున్న నహుషుడు వేసిన చిక్కుప్రశ్నలన్నిటికీ ధర్మరాజు సరిఅయిన సమాధానాలు చెప్పి భీముణ్ణి విడిపించాడు. ధర్మరాజుమూలంగా నహుషుడికి శాపవిమోచనమైంది.



# మగువలూ - మమతలూ

కొటికెలపూడి
అప్పల నరసింహం

భోజనాల దగ్గర కదిపింది మంగమ్మగారు పరమేశాన్ని. "అమ్మాయి ఈ తిరం అందగానే మీ మామగారు యెగిరి గంతేశారోయ్. అమ్మాయిని తీసికెళ్ళడానికి ముహూర్తము పెట్టించుకొచ్చేదాకా ఆయనకి తోచలేదంటే నమ్ము."

పరధ్యానంగా భోంచేస్తున్న పరమేశం "ఆహా!" అన్నాడు. ఇంతలో ఆమె చెప్పిన విషయం గురుకురాగానే అడిగాడు: "ఐతే శారదను అప్పుడే తీసికెళతారా?" అని—గాభరాగా.

"అవునోయ్. రేపు సాయంకాలమే ప్రయాణం. అమ్మాయితో చెప్పాను. బట్టలు అవీ సర్దుకొని తయారుకమ్మని. ఏమయినా అల్లుడివి కదా. నీ అనుజ్ఞలేంది యెలాగ? మీ మామగారు తన మాటలుగా నీతో చెప్పమన్నారు—అమ్మాయిని రేపుసాయంకాలం నాతో పంపమని." అంది ఆవిడ.

"ఇప్పణ్ణించీ యెందుకండీ. ఇప్పుడింకా మూడో నెలేకదా. ఐదో నెలనో ఏడో నెలనో తీసికెళితే చాలదూ. ఇప్పణ్ణించీ పంపించేస్తే నాకు చాలా యిబ్బంది," అన్నాడు పరమేశం.

"అది కాదోయ్. ఒక్కతే ఆడపిల్ల కదా మాకు. తీసికెళ్ళి నూడిదలు అవీ చేసిపెట్టడం, ముద్దూ ముచ్చటా తీర్చుకోవడం అదీచేయాలి కదా. ఇక్కడ ఎవరుచేస్తారు చెప్పు. పైగా ఇక్కడ యుంటెడు చాకిరీ అదే చేసుకోవాలాయె. ఈ తిప్పిల్ల గవకనా." అంది ఆమె.

"మీ ముద్దు ముచ్చటే గాని నా ఇబ్బంది అక్కరలేదన్న మాట—" అన్నాడు పరమేశం.

"అలాగ అంటే యేం చెప్పేది? నీకూ పిల్లలు పుటబోతున్నారు కదా. మా సరదా యేమిటో అప్పుడు నీకు అర్థమౌతుందిలే."

పరమేశం మాటాడలేదు.

* * *

ఆ వేళ రాత్రి యిద్దరూ కీచులాడుకున్నారు.

"అప్పుడే ముంచుకుపోయినట్లు మీ అమ్మకి ఎందుకు వ్రాయాలి."

"వ్రాస్తే ఏమండీ? మా అమ్మ యెంత సంతోషించింది! ఇంత మంచివార్త ఆమెకి తెలియజేయకుండా ఎలాగ ఊరుకోనండీ?" అంది శారద.

"సంతోషించింది...అవును సంతోషించింది. నువ్వూ రేపు సాయంకాలం ఆవిడతో కలిసి మీ పుట్టింటికి వెంచేసి, నే నిక్కడ నానాపాటు పడుతూవుంటే సంతోషిద్దువు గాని," అక్కసుగా అన్నాడు పరమేశం.

"అదేమిటండీ అలా అంటారు. మా అమ్మా నాన్నా ఒకతెనేగదా అని ఎంతో సంబరపడి ముద్దూ ముచ్చటా తీర్చుకోవాలని చూడ్డంలో విడ్డూరం యేముంది?"

"అబ్బే! విడ్డూరం యేమీ లేదు. పుట్టింటి మీద, ముద్దు ముచ్చట్లమీద ఉన్న మమకా



"ముద్దుల మాంచాలి ముదమున వినుమా"

చిత్రం : ఎస్. శంకరరావు, అనకాపల్లి

# ★ మగువలూ - మమతలూ ★

రంలో అలాగే వుంటుంది. నా సంగతి ఎవరి కొక్కవాలిలే."

"పోనియ్యండీ మీకంత ఇష్టంలేకపోతే పంపడం మానెయ్యండి. మీరలా ఇది అవుతూ వుంటే నేనెలా వెళ్ళగలను? 'నేను పంపా వని" మా అమ్మతో చెప్పెయ్యండి," అన్నది శారద నిరుత్సాహంగా.

"అదికాదు శారదా! ఇంకా యిప్పుడు మూడోనెలేనా. ఇంకా ఆరునెల్లు యిటు, మరి ఐదు నెల్లు అటు వెరసి పదకొండునెలు ఒంటరిగా యీ యింట్లో యెలా గడిపేది చెప్పూ. నాకు వంటరాదు, నీకు తెలుసుగా వచ్చినా అన్నాళ్లు వండుకునే ఓపికాలేదు. చిన్నలేదు మొన్నలా ఉంది ఆ అయ్యరు సాంబారు మెతుకులు తిని, తిండికి మొగం వాచిపోయి. మళ్ళీ ఆ వైభవమూ డే ప్రాప్తమూ రండేళ్ళు తిరక్కుండానే. వారంకాదు, నెలకాదు, పదకొండునెల్లు. ఇంతకీ నేననేది అసలు వెళ్లవద్దని కాదుగా. ఏదో నెలనీసి వస్తే ఆ ముద్దూ ముచ్చటలు తీరవా అని," అన్నాడు పరమేశం, ఓరిమితో తన ఉద్దేశాన్ని వ్యక్తంచేస్తూ.

"అప్పుడు మటుకు ఇంకా యేడు నెల్లు గడపాలిగదా?" అంది శారద కొంటెగా.

"కాని యిప్పటికన్నా నాలుగు నెల్లు తక్కువగా" అన్నాడు పరమేశం.

"నాకు నిజంగా మిమ్మల్ని వదిలి వెళ్ళాలని లేదండీ కాని మా అమ్మావాళ్ళ ఉత్సాహాన్ని యెలా భంగంచేసేది చెప్పండి. పోనీ మీరు చెప్పెయ్యండి యేదో నెలని తీసికెళ్లమని," అంది శారద.

"ఇంకా రెండేళ్లైనా కాలేదు. అప్పుడే కలక్కపోతే యెవడేడిశాడు" అన్నాడు పరమేశంని అసూయగా.

"అవును నిజమే" అనుకుంది శారద. "ఇన్నాళ్ళు తనుమాత్రం అతణ్ణి వదలి యెలా ఉండడం. అయినా వంటరిగా మొగాణ్ణి అన్నాళ్లు వదిలేస్తే ఎలాటి బుద్ధులు పుడతాయో! అయినా ఆయన అలాటివారు కాదు. నేనంటే యెంతో ప్రేమ. చదువూ, సంస్కారం, సంఘంలో గౌరవం ఉన్నవారు. అలాటి పనులకు దిగజారుతారా? అనుకుంది ఆమె.

* * *

శరవేగంగా పోతున్న రైల్లో స్తబ్దంగా కూర్చున్నది శారద. వెనక్కిపోతున్న చెట్లకేసి, పొలాలకేసి, దూరాన కన్పడుతున్న రోడ్డుమీద రైలుతో పందెం వేస్తున్న మోటారుకేసి శూన్యంగా చూస్తున్నప్పటికీ ఆమె మెదడు తీవ్రంగా పనిచేస్తూంది. ఆందోళన చెందిన ఆమె మనస్సులో ఒక మహాయుగంలా గడిచిన యీ నెల్లాళ్లలో పరమేశ్వరం బాబు వ్రాయక పోవడానికి కారణం యేమీ తట్టకుండావుంది. బహుశా కాలేజీపని జోరుగా ఉంటంచేత తీరికలేదో యేమో. అయితేమాత్రం క్షేమం తెలియచేస్తూ ఒక్క కార్డుముక్క వ్రాయడానికి ఎంత తీరుబాటుకావాలి గనక. వంట్లో నలత రాలేదుగద! ఒక్కసారుగా ఆమె గుండెల్లో దడ బయలుదేరింది. తను బయలుదేరేముందు




ఆరాధన
చిత్రం: శీలా వీర్రాజు—రాజమండ్రి.

కొద్దిరోజులక్రితం పరమేశ్వరందగ్గరకి ట్యూషనుకి రావడం మొదలెట్టిన ఆ లేడికళ్ళ వల్లకిరస్తానీ అమ్మాయి చటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఆమెకి ముచ్చెమటలు పోశాయి. 'ఛీ! ఛీ!' యేమిటీ పాడుఆలోచన! పరమేశ్వరంమీదా అందులోనూ" అనుకుందామె. చెరిపేద్దామని యెంత ప్రయత్నించినా, చెరిపేసిన పలకమీద దృశ్యాదృశ్యంగా కన్పించే గీతల్లా ఆమె మస్తిష్కంలో ఆభావం నిలచిపోయింది. రైలు యింకా మరో గంటగాని విశాఖపట్నం చేరదు. కాని ఆమె మనస్సుమాత్రం గంట క్రిందటే చేరిపోయింది.

ఇంటిదగ్గర రిక్షాదిగి, రిక్షావాడికి డబ్బులిచ్చి గబగబా వీధితలుపు తట్టింది శారద. కొంచెం ఆలస్యంగా పరమేశ్వరం తలుపు తీశాడు.

"ఇదేవిటి! ఉరమని పిడుగులా ఒచ్చేశావే!" అపరాధిగొంతుకలా కంపించే స్వరంతో అన్నాడు.

"హమ్మయ్య! మిమ్మల్ని చూశాను నా మనస్సు కుదుటపడింది. మీ ఒంట్లో కులాసాగా ఉందా? హోటలులో తిండి బాగుందా? నెల్లాళ్ళయి వెళ్లానుగదా-ఒక ఉత్తరముకైనా వ్రాయలేదేమండీ? నేను యెన్ని ఉత్తరాలు వ్రాసినా గుక్కత్రిప్పకోకుండా అక్షయతూణీరంలోంచి బాణాల్లా ప్రశ్నపరంపరల్ని అతడిమీదకి ప్రయోగించింది జవాబుకి యెదురుచూడకుండానే.

"ఏంలేదు......" నీళ్ళు నమిలాడు పరమేశం. దారి కడ్డంగా తెలబోయి నిల్చున్న అతణ్ణి అంత పరీక్షగా చూడకుండా, ఉరకలు వేసే ఉత్సాహంలో ఇంట్లోకి గబగబా నడిచింది శారద. పడక గదిలోకి నిగిడ్చిన ఆమె చూపులతోపాటు, ఆమె గమనం కూడా తక్కున ఆగింది. ఒక్కమారు షాగ్ కొట్టినట్లయింది తను యింతసేపు చెరుపుకోవాలని ప్రయత్నించిన దృశ్యమే యిప్పుడు తన కళ్ళముందు కన్పించింది.

"ఏవండీ...?" దుఃఖోద్రేకంలో గొంతుక పెగలేదు. కన్నుల్లో క్రమ్మిన నీళ్ళు తను చూస్తున్న దృశ్యానికి అడ్డుగ తెరవేశాయి.

కన్నంలో తేలుకుట్టిన దొంగలా ఉక్కిరిబిక్కిరయాడు పరమేశ్వరం. అతని మూకత్వం చూస్తున్నకొద్దీ ఆమెకి ఆందోళన, శోకం అధికం కాజొచ్చాయి

"నాకు యెన్నో విధాల ప్రేమవాక్యాలు చెప్పారే! నేనే మీ సర్వస్వం అన్నారే. రాబోయే పాపాయి నేనాగుర్తులో ఉంచుకోకుండా నన్నిలా అన్యాయం చేయడం మీరు ధర్మంవేనా?" అంది ఆమె దుఃఖాన్ని అదిమిపడుతూ.

అతడు జవాబు చెప్పలేదు. అతని మూకత్వం ఆమెకి యేమీ అర్థం కాలేదు: 'ఇతనేనా తన పరమేశ్వరం. తనతోడిదే లోకంగా గడచిన రెండేళ్ళనుండి కాపరం చేస్తున్న అతడేనా యీతడు. పాపాయికి పెట్టే పేరుగురించి మూడురోజులు తనతో వాదించిన అతడేనా యీయన! ఎంతలా మారిపోయాడు?" అనుకుంది ఆమె.

"మాట్లాడరేవండీ యేమి టిలా మారిపోయారు. నెల్లాళ్ళు నేను లేకపోయేసరికల్లా యిలామారిపోతారని కలలోకూడా నేననుకోలేదు. రైలు యింజనులోంచి గుప్పుగుప్పున వచ్చే పొగలాగ దుఃఖం ఆమె హృదయంలోంచి పెల్లుబికి రాసాగింది

గబగబా గదిలోకి నడిచి, నిర్లక్ష్యంగా తమాషా తిలకిస్తున్న వల్లపిల్లని యెదిరించి అడిగింది శారద. "నువ్వు ఆడదానివేనా? నీకేమేనా హృదయం ఉందా? ఇద్దరం సాటిఆడవాళ్ళమేగదా - యెదటి ఆడదాన్ని అవమానించడానికి, ఆమె కాపురంలో నీరు పోయడానికి, ఆమె మొగుణ్ణి వలలో వేసుకునేందుకు నీ హృదయం ఎలా ఒప్పుకుంది? చదువుకుంటున్నావేమో? ఇదేనా యేం ఆ చదువు," గుక్కతిప్పకోకుండా ఆమెమీద అక్కసు వెళ్ళగక్కింది.

"నన్నేమనా అంటే జాగ్రత్త! శారదగారూ! నాకిందులో యేంబాధ్యతలేదు. మీ ఆయన్ని యేమన్నా అనుకోండి," అందామె.

"అతన్నో నిజంగా యేంతప్పలేదు. నువ్వే అతణ్ణి కరిగించి అసహాయస్థితిలో అతణ్ణి వల్లో వేసుకున్నావు. జితులమారివి. ఆ ఉద్దేశంతోనే నువ్వు చదువు మిషతో చేరావిక్కడికి. ఆయన అందం, చదువు, పలుకుబడి గౌరవం, ఉద్యోగం అంతా దోచుకోవాలని నీవు వేసినప్లాను యిది." అర్థంలేకుండా హిస్టీరియా యెత్తినదానిలా అరచింది శారద.

"చూడండి శారదగారూ! మీరు అనవసరంగా నన్నని యేం ప్రయోజనం లేదు. ఆయనే నన్ను వల్లో వేసుకున్నారు. నన్ను మళ్ళీ యేమేనాఅంటే మాటదక్కదు." బెదరించింది ఆ అమ్మాయి.

మొగుడు యింకా మాట్లాడకపోయేసరికి, ఆమె హృదయం దుఃఖపూరితమై బ్రద్దలైంది. అదిమి పట్టినదుఃఖం పెల్లుబుకి కెవ్వుమని కేక వేసి ఆమె యేడ్వసాగింది.

"శారదా! శారదా!" తట్టిలేపాడు పరమేశం. ఉలిక్కిపడి లేచిన శారద బావురుమని కౌగలించుకుంది భర్తని.

"ఏవండీ! యిప్పుడు జరిగినదంతా కలేనా? యేడుస్తూనే అడిగింది శారద.

పరమేశానికి యేమీ అర్థం కాలేదు. "యేమిటి శారదా? యెందుకలా యేడుస్తావు ఇప్పుడిక్కడ యేమీ జరగలేదే. ఓహో! అయితే అదంతా కలే. ఎందుకలా కేక వేశావు నిద్రలో? ఊరుకో! ఊరుకో!!" సముదాయించ సాగాడు పరమేశం.

"అది నిజంగా కలేనని మళ్ళీ చెప్పండీ" అందామె యింకా నమ్మకుండా.

"నిజంగా కలే!" అన్నాడు పరమేశం. "అయితే యేమిటా కల? చెప్పు."

"పోనిద్దూరూ. వెధవ కల - తల్చుకుంటే భయం వేస్తూంది. నేను చెప్పలేను బాబూ"

"పోనీలే, రేపు చెపుదువు గాని" అన్నాడు పరమేశం. "దేవుణ్ణి ప్రార్థించి పడుకో".

మర్నాడు ప్రొద్దున తల్లి యిచ్చిన కాఫీ త్రాగుతూ చెప్పింది: "నేను యిప్పణ్ణించి రానమ్మా. ఆయనకి చాలా యిబ్బంది అవుతుంది భోజనానికీ వాటికీ. ఇంకా మూడో నెలేగా- భయంలేదు. ఐదో నెలలో తీసికెళ్ళ వచ్చులే.

"అదేమో నమ్మ మీ కాలపువాళ్ళంతా అంతే. యేం ప్రేమలో యేమో. మొగుణ్ణి వదిలి మూడు రోజులుండలేరు", అందామె నిరాశగా.






[ఉద్యోగపర్వము నుండి]

సీ. కాలోచితము లగు కరణీయములు దీర్చి కమలనాభుఁడు రేపకడయ కదలి
తనుఁ గుశస్థలవాసు లనుప రా నందఱ నాదరంబున నిల్పి యరుగునపుడు
గజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు ధృతరాష్ట్రసుతుఁడు పుత్తేరఁ బ్రీతి
నడ నడఁ గొని వచ్చి యిచ్చినవాని నెల్లను వేడ్క ననుభవించిన విధంబు

తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ నెదురు, బాహ్లిక ద్రోణభీష్మాదిబంధుమిత్ర
గణము సర్వభూపాలలోకంబుఁ గురుకు, మారవర్గంబుఁ బుత్తెంచె మనుజ విభుఁడు.

## శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క నెల్లవారిం దుర్యాదిశోభనపదార్థంబులు సమకట్టి ధృతరాష్ట్రుండు వనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల నందఱ నయ్యై తెఱంగుల సంభావించి కృతవర్మ దమవాఁడు గావున నతనికి సవిశేషస్నేహంబు సేసి యతఁడు సేరువ రా సమస్తజనంబులుం బరివేష్టింపం జని తన రాకకు నలంకృతంబును బ్రమోదచాపలసుభగజనంబును నైన పురంబు సొచ్చి రాజమార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధ లలితంబులు నగు నక్షతప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొనునంగనాజనంబులు తమలోన.

సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసిచన్నుల పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యాజగజెట్టి యితఁడె
దుర్వృత్తుఁ డగు కంసుఁ దునిమి యాతనితండ్రిఁ బట్టంబు గట్టిన ప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల కోర్కి దీర్చిన రసికుం డితండె

తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును, నరసి మ్రుచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతిశిరోభగములఁ దన సుభగచరణ, సరసిజామోదమును గూర్చు చతురుఁ డితఁడె.

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధంబగు పౌరలోకం బాలోకన కౌతుకంబునఁ దనరథంబు గదిసిన నందఱి జడియు వేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని మణితోరణసుందరం బగు రాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడిచి యేనుంగు మొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మద్రోణ ప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బొదువ నతఁడుఁ బ్రత్యుత్థానంబు సేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనం జేరి.

ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చటఁ గల విదు, రాదిశిష్టజనుల నాదరార్ద్ర
బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ, నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ.

వ. వార లందఱకును సాత్యకిని దగిన సమాచారంబులు నడపం బనిచె నట మున్న ధృతరాష్ట్రువనుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్న యున్నత కనకాసనంబున నతం డునుప నాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణులగు నగరి పురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారంబు లాచరించి యతని తమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి. నరనాథుండును దొరలును నిజోచితాసనంబుల నుండిరి. కొలు వెల్లను సూర్యోదయసమయంబునఁ గమలాకరంబు విధంబున వికసించియుండె నయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందను వచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామ పరిరంభణ ప్రముఖ సముచిత సంభావనంబులు వలికి సంభాషణంబులకుం జొచ్చి.

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ దే
రోజమెయి బంధుమిత్త్రిస, మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదుర సదనంబునకుం జనియెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయివచ్చెద నని పలికి యాంబికేయు ననుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి చని మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయ భక్తి వినయస్నేహానందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేక ప్రకారంబుల నర్చన లిచ్చి కౌంతేయుల కుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ.

క. ముదమునఁ గృష్ణుఁడు కుంతీ, సదనమునకుఁ జనియె నపుడు సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరిం, చెద నని తన్నడుగ నట్ల చేయుం డనుచున్.

వ. చని కాంచిన నద్దేవియు నతనితోడునీడయుంబోని తనకొడుకులం దలంచి యడలు పుట్టిన నమ్మాధవు మెడ వట్టికొని యెలుం గెత్తి యేడ్చిన నతండు సంబోధించి యూరార్ప నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసనాద్యుపచారంబులు సేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో నిట్లనియె.

సీ. నీశిశుఁ బెరుఁగుట నీతిమంతులుఁ బుణ్యపరులు శూరులుఁ గదా పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రు సూరెలఁ గొలువ నుండెడువార లిడుమలఁ బడుచు నిర్జ
నం బైనకానలోనన యెట్లు నిలిచిరి ననుఁ బెట్టి నాయెదఁ గొనుచుఁ జనిరి
యేను వడ్డింపంగ నింపారఁ గుడిచి మెత్తనిశయ్య నిద్రించి వినుతభద్ర

తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి, వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము, లఱవ మేల్కనుచుండిరే యక్కటకట.

ఆ. తండ్రిలేని ప్రజలు దల్లిని బాసి పెద్దయునుగాల మివ్విధమునఁ బడిరి
భంగపాటు దుఃఖపాటును సంకట, పాటుఁ గలిగె విరటుపాలఁ బిదప.

వ. అని వెండియు,

ఉ. దానదయాపరుం డయిన ధర్మతనూభవుసేమ మెట్లు పం
చాననవిక్రముం డగు బకారికి భద్రమె యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా వినయాభరణుల్ గవల్ సమా
ధానసమేతులే యకట ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్.

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కట కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి పొక్కితిఁ.

తే. నాఁడు ద్రౌపది పడినబన్నములు సూడ, నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ
యంతగడచిన దుఃఖంబు లనుభవింపఁ, గలవె లోకంబువారికిఁ గమలనాభ.

వ. అట్టియెడ.

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మసంక్షయ మిది గా
డదు నార యతనిశీలము, కుదు రీలోకమున కింతకుం దలఁపంగన్.

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ గొండొక దిగంబాఱెడుచిత్తంబుతో మఱియు నిట్లనియె.

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట, యదియొకతల యయ్యొ నేమి యనఁగల దనఘా.

క. తన్నుఁ దనతమ్ములను నా, కన్న కొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామదిలేమికి, వెన్నఁడ దైవంబ సాక్షి వినుము పలికెదన్.

క. ఇది నిక్కం బగు నేనియుఁ, దుది నీవుం బాండవులును దురితరహితు లై
ముద మందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్వె యంబుజనాభా.

సీ. బావ యొప్పం డనుపలుకుల నే మగు నాతనికొడుకుఁ గీడాడ నేల
కురువృద్ధుఁ డగు బాహ్లికుని దూఱ నేటికి భీష్మునిపైఁ బ్రయి వెట్ట నగునె
యిట్టి క్రూరులయింటి కిచ్చిన మనవారి నందుఁ గా కట్లు దా ననుట మేలె
యర్జునుపుట్టినయప్పుడు వీఁడు లోకము లెల్ల గెల్చు పొగడ్త మొగులు

తే. ముట్టనట్టిద యగు రణమున జయించుఁ, గౌరవుల సోదరులుఁ దాను భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశరీరవాణి, వలికె నది దిట్టువడుఁగాక వలయునేని.

వ. ధర్మంబు గలుగునే నది నిక్కం బయ్యెడు దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు గాదె నీమన్నించు నెచ్చెలి
లకుం జెప్పెడుమాటలు గలవు విను మయ్యధిష్ఠిరుతో ని ట్లనుము.

క. వేఁడికొని కృపణు లై కను, పోఁడిమి యది యేల రాజపుత్రులు దమమై
వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే.

వ. భీమార్జునుల కి ట్లని చెప్పుము.

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచిత మైననమయ
మొదవెఁ దడయు టెంక నొప్పదు జనములు, నట్లు గాని పురుషు లనరు మిమ్ము.

క. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా, త్మజఁ గార్యం బడుగు మనము తగ నందఱతోన్.

చ. అలిగిన భీమఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు దంతలం
తలు వడి వాని నీఁగవలదా విను మాపని కెల్లఁ బాండుపు
త్రులె కలవారు నీ కెటులు దోఁచిన నట్టులు సేయువారుగా
కలఘువిచార న్యాయలఁత యోర్పుము నక్క గడతేర్పు మెమ్మెయిన్.

వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె.

## శ్రీ కృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట

చ. సుగుణవు పుట్టినింటికిని చొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచు ధన్యవు ధీరవు దేవి నీ వెఱ
న్వగ లడఁగింప కున్న భువనంబుల నిం కిట నెవ్వ రోర్చువా
రు గలఁక దక్కుమీ హృదయరోగము లన్నియుఁ బుచ్చివైచెదన్.

క. తనయులుఁ గోడలు సేమం, బున నున్నా రధికభక్తిపూర్వముగా దం
డనమస్కారంబులు నీ, కొనరించిరి కౌఁగిలించి రుల్లములఁ దగన్.

క. నీకొడుకు లొందుసుఖములు, నేకొన రవ్వీరసుఖమ చిత్తములఁ గరం
బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లలబుద్ధులె వారల్.

క. ఉత్సాహంబున శత్రుకు, లోత్సాదనవిధి యొనర్చి యున్నతసామ్రా
జ్యోత్సవము నొందుపుత్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్.

చ. అన విని మోము విచ్చుచు మురారికి ని ట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్ల చే
సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే.

క. వారలక యేల మాధవ, కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ నీవలు, కారయ వేదంబ కాదె యఖిలంబునకున్.

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు సేసి తదావాసంబు వెలువడి తన రాకకు నలంకృతంబైన దుర్యోధమ మందిరంబునకుఁ గృతవర్మ సాత్యకి సమేతుం డయి పోవు గోవిందునిం గని తదీయ ద్వారపాలకులు సంభ్రమంబునం బఱచి యతని కెఱిఁగించి తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని కక్ష్యాంతరంబుల సందడి నెడ గలుగ జడియుచు వినయంబునం దోడ్కొని చన నమ్మనుజవిభుండు గైరాసశిఖరాకారంబగు సౌధంబున భీష్మద్రోణప్రభృతులును గర్ణశకునిసైంధవాదులును దుశ్శాసనవికర్ణదుర్ముఖ ప్రముఖులును మఱియు ననేక దేశాధీశులునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుండై యున్న యెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారంబులు దానుం దమ్ముండును నాచరించి.

క. అతఁ డనుపఁగఁ గనకమయో, న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూ
ర్జితమహిమనుండి యభ్య, ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్.

## శ్రీ కృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట

వ. సాత్యకియును సముచిత ప్రకారంబునం బూజితుం డయ్యెఁ దదనంతరంబ నిజాసనాసీను లయి తన మొగంబునం జూడ్కి నిలిపియున్న దుర్యోధనాదులతో మాధవుండు మధురసంభాషణంబులు సేయుచుండె నట్టియెడ.

తే. సముచితంబుగఁ గూరలచంద మగ్గ, డించి కుడుపు తెఱంగు పుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను, గుడువనొల్లకయునికి యేర్పడఁగఁ జెప్పె.

వ. చెప్పిన విని దుర్యోధనుండు సూర్యసూనువదనంబవలోకించి యల్లన యిట్లనియె.

క. హరిపలికిన విధ మెంతయు, నెరవై యున్న యది వింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత నీపెను, పరిచందం బెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్.

వ. అని యచ్యుతున కిట్లనియె.

తే. వలయు నన్నపానంబులు పలుదెఱఁగుల, నేర్పువిధముల నేమొడఁగూర్చి వేడ్క
నున్న నీ వుపయోగింప నొల్లకునికి, బాంధవమునకు నీతికి బాహిరంబు.

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్కరూప యనదృశధర్మా
చారుండవు రాజునకుం, గూరుతు గత మేమి యిట్లగుటకుం జెపుమా.

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం, ద్రున కిట్లను దూత లెందుఁ దొలిదొలి కుడువం
గొనఁ గట్టఁ దొడఁగుదురె వ, చ్చిన కార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్.

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కిట్లనియె.

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ, దీఱకుండు దాని తెఱఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వ నేల కమలనాథ.

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుఁగాక కుడువ నొల్లననం దగునె దీనికిం గారణంబు నా యెఱింగినయది లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు మందస్మితంబుతో నందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రికరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం గేల నమర్చి యిట్టి మాటలు తేట పఱుపవలయు నేని విను మని యతని కిట్లనియె.

చ. ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడుకూ డది లెన్నకూడు ద
క్కయనయహీనతం దమకు నాపద యైనెడ నిట్టు నట్టునే
మియు నన లేనికూ డెదిరి మేవడి యై చను నీవు మాదెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతి పెంపఱ నాపద లే దొకింతయున్.

వ. అట్లుం గాక.

★



# సంసారంలో శారద

యద్దనపూడి సులోచనారాణి



"ప్రత్యేకం స్కూలుకు వెళ్ళి అభ్యసించే విద్య స్త్రీలకు పూర్తిగా అనవసరం. స్త్రీలు నేర్చుకోవాల్సిన కళలు వేరే ప్రత్యేకంగా వున్నాయి. అవి ఒకటీ రెండూ గాదు అనేకం. పురుషుడు తన స్వార్థంతో స్త్రీకి చదువొద్దు అనటం లేదు. ఉదాహరణకి వీణ ముందు పెట్టుకుని హాయిగా కమనీయంగా గానంచేసే స్త్రీకి, బండెడు పుస్తకాలు మోయలేక మోస్తూ మైలుదూరం నడిచివెళ్ళి యేవో రెండు ముక్కలు అసంపూర్తిగా నేర్చుకుని వుసూరుమంటూ యింటికి వచ్చే స్త్రీకి చాలా తేడా వుంది. మొదటి స్త్రీ కావాలంటే తను నేర్చిన విద్యలో లోతులు తెలుసుకుని అవి యితరులకు గూడా తెలిపి అందరినీ ఆనందపరచగలదు. రెండోయువతికి ఆ అవకాశం తక్కువ. చదువుకూడా ఒక విధమైన మోటుపనే. జీవితాన్ని గంగిరెద్దు భారం మోసినట్లు మోయటానికి పురుషుడే సరిపోతాడు. ఆ భారాన్ని కొంచం సులభం చేసుకోవటానికిగాను యీ చదువు ఆధారం చేసుకుంటాడు. పైపెచ్చు యేమిటంటే సహజంగా స్త్రీ అసలు శక్తి స్వరూపిణి. పుట్టుకలోనే ఆమెలో కొన్ని శక్తులుద్భవించి వుంటాయి. దానికి తోడు యీ అనక తవక—"

ఆపైన చదవలేక శారద పత్రికను విసిరి పుచ్చుకుని గిరాటుకొట్టింది విసుగుతో. ఒక చెంపను స్త్రీలు సమస్తరంగాల్లో అభివృద్ధిలోకి వస్తున్నా యీపాతపురాణం విన్పిస్తూనే వుంది. అవును మరి. యుగయుగాల నుంచి నరనరాల్లో జీర్ణించుకుపోయిన బూజుపటిన భావం ఒక్కసారి పోతుందా? ఇంతకీ వ్యాసం వ్రాసిన రచయిత యువకుడా, వృద్ధుడా అన్న అనుమానంతో శారద వంగి పత్రిక తీసి పేరు చూసింది. రచయిత అసలు పేరు లేదు. యేవో పొడిఅక్షరాలు ఆడపిల్ల పేరును సూచించేటట్లుగా వున్నాయి. ఇప్పటి మగవాళ్ళకి యిదో ఫాషనయిపోయింది. పేరు ఆడపిల్లదయినా వ్యాసం వ్రాసినది మగవాడే నన్న సంగతి స్పష్టంగానే తెలుస్తోంది. శారదదృష్టి ఒక వాక్యం మీద పడింది. పత్రికను మళ్ళా టేబిల్ మీద పడేసింది. వ్యాసరచయితకి యేమీ బొత్తిగా పనీపాటా లేదల్లేవుంది. తీరుబడిగా కూర్చుని పాపం స్త్రీలమీద మొదలు పెట్టాడు. బహుశా అతనికి బయట ప్రపంచంలో యేం జరుగుతుందో తెలియదు గాబోలు. యేదో ఒక మారుమూల ఒక గుహలాంటి చీకటి గదిలో కూర్చుని సిగరెట్ మీద సిగరెట్ కాల్చుకుంటూ యేం తోచక మొదలుపెట్టి వుంటాడు. తన గది తప్ప అతనికి మరో ప్రపంచం తెలియదుగాబోలు. ఒక వేళ తెలిసినా ఊహలోకాల్లో విహరించే వ్యక్తి సహజంగా యెలా అర్థం చేసుకో గలుగుతాడు? బయట ప్రపంచంలో మామూలుగా తిరుగుతూ నేటి సమాజంలో స్త్రీ స్థానాన్ని గుర్తించ గలిగిన వాడయితే ఈ విధంగా వ్రాయటానికి సాహసించి వుండేవాడు గాదు. యేమీ తోచని శారద వ్యాసం వ్రాసిన రచయితను తన వూహలో చిత్రించుకుని చూడటం మొదలు పెట్టింది. చదువుకున్న స్త్రీ కంటె వీణ వాయిస్తున్న స్త్రీ అందంగా కన్పించింది గాబోలు మహానుభావుడికి. కవిగా-బాహ్య సౌందర్యం చూడగలిగాడు కాని ఆత్మ సౌందర్యం అక్కర్లేక పోయింది గాబోలు.

బద్ధకంగా ఆవలించి ఒళ్ళు గట్టిగా విరుచుకుని సోఫాలో వెనక్కు జారగిలబడింది శారద. యేమీ తోచటం లేదు. తను బి. ఎ. పాసయింది. ఎమ్. ఎ. చదువుతానంటె అత్తయ్య వద్దంది. అత్తయ్య పిచ్చిగాని తనకు చదివినంత కట్నంయిచ్చి వైభవంగా పెళ్లిచేసి వృథాగా ఖర్చుపెట్టేకంటే తనకు చదువు చెప్పిస్తే పోదూ? ఇదే అత్తయ్య దగ్గరంటే "చాల్లే నోర్ముయ్. ఈ ఆస్థంతా తగలేసినువ్వు చదివి వెలగబెట్టేది మటుకు యేమిటి? నెలకు మూడొందలు కాదంటే నాలుగొందలు రూపాయల వుద్యోగమే కదా! అంత ఖర్మ నీకేం పట్టింది. నీ వుద్యోగం తన వుద్యోగం కలిపి తనే చెయ్యగల మొగుడిని తీసుకొస్తా నీకు. యేదో సరదాకి నాలుగేళ్ళు చదివావు బాగుంది. అంతేగాని." అంటుంది అత్తయ్య. అత్తయ్య దృష్టిలో చదువు సరదాపని. ఇది విడమర్చి మరో విధంగా చెప్పినా ఆవిడకర్థం గాదు. అందుకనే తను మెదలకుండా వూరుకుంది. తను ఎమ్. ఎ లో చేరివుంటే యిలా బద్ధకంగా ఆవలిస్తూ గడిపేదా? అప్పుడెంత బిజీగా వుండేది! శారదకు మళ్ళా ఆవులింత వచ్చింది. ఈ సారి ఆవలింతకు కళ్లలో నీళ్ళు కమ్మినాయి. లేచి బద్ధకంగా చీర అంచుతో కళ్లు తుడుచుకుని వచ్చి కిటికీవద్దనిలబడి వీధిలో వచ్చేపోయే జనాన్ని చూడసాగింది. నాలుగు దాటినట్లుంది. సూర్యుడు ఆవలిస్తూ పశ్చిమానికి దిగటం ప్రారంభిస్తున్నాడు. స్కూలునుంచి పిల్లలు నెమ్మదిగా యింటికి వస్తున్నారు. వాళ్ల అలసటంతా వాళ్ల మొహాల్లోనే కనిపిస్తోంది. వాళ్ళకి యీరోజు యే విధంగా గడపాలా అన్న చింతే వుండదు. తనలాగే ప్రకృతి గూడా బద్ధకంగా, యేమీ తోచక విసుక్కుంటున్నట్లుగా కన్పించింది శారదకి. తిరిగొచ్చి సోఫాలో కూలబడింది. ఉన్నపళంగా యీ పట్టున ఈ మేడ కూలిపోతే యేమవుతుంది? తను సోఫాతో సహా,



తిరుచిరాపల్లి కోట

ఫొటో: వి. కేశవశర్మ.

కుర్చీలు బల్లలు, యెదురుగుండా వున్న నిలువుటద్దం, ప్రక్కనున్న పుస్తకాల బీరువా ఒక్కసారి అన్నీ కలిసి అడుక్కుపోతాయి. తనప్పుడు ప్రాణభీతితో కేకలు పెట్టినా యెవరికీ వినిపించదు గాబోలు. ఆ దృశ్యం ఊహించుకునే సరికి శారదవళ్ళు ఝల్లుమంది. నరాలు తెలియని బాధతో విలవిలలాడినాయి. కాని మరుక్షణంలో శారద తన పిచ్చితనానికి తనే నవ్వుకుంది. ఇదంతా తనకు తోచకపోవటంవల్ల వచ్చే వికృతాలోచనలు అనుకుంది. ఇంతలో సీత పైకి వచ్చి "అమ్మాయిగారూ! బూబమ్మగారొచ్చారు." అంది. బూబమ్మగారంటే శారద అత్యంత ప్రియమైన ప్రాణస్నేహితురాలు మెహరున్నీసా. ఆ ముస్లిం పేరు నోరు తిరగక సీత క్లుప్తంగా తన భాషలో బూబమ్మ అంటుంది. శారద బద్ధకమంతా క్షణంలో వదలిపోయింది. లేచి క్రిందికి రాబోతుండగా ఇంతలో మెహరున్నీసాయే పైకి వచ్చింది. యెదురు వచ్చిన శారద స్నేహితురాలి చేతుల్లో తన చేతులు కలిపి తన్మయత్వంగా మొహంలోకి చూస్తూ.

"అబ్బ. ఇవాళెంత బాగున్నావ్. మా హిందూ యువకులెవరయినా చూస్తే నువ్వు గూడా మా వాళ్ళమ్మాయివే ననుకుని అమాంతం ప్రేమిస్తారు గూడాను. నిజంగా మెహర్. ఇవాళ మరీనూ అచ్చు మా హిందువులమ్మాయిలానే వున్నావు అంది. మెహరున్నీసా యెప్పుడు శారదా వాళ్ళ యింటికి వచ్చినా హిందువుల పద్ధతిలోనే డ్రెస్ చేసుకుని వస్తుంది. అందుకే శారదా వాళ్ళ యింట్లో వారికి తెలియకుండానే మెహర్‌కు చనువిచ్చారు. శారద మేనత్త పంకజమ్మ అప్పుడప్పుడూ మెహర్‌ని చూసి యిలా అంటూ వుంటుంది. "చూడు వదినా. మెహర్ అసలు న్యాయంగా మన వాళ్ళలో పుట్టవలసిన పిల్ల సుమా. దేవుడు యేదో పరధ్యాసగా ముస్లిం పిల్లగా పుట్టించాడుగాని" అంటుంది. ఆవిడ దేవుడి పరధ్యాసకు చాలాసార్లు విచారించటం గూడాకద్దు.

"అబ్బ. సాటిలేని యిప్పటి నీ సౌందర్యానికి బొట్టు లేకపోవటం కొంచం కొరతగా వుంది. బొట్టు పెట్టుకోరాదూ? యేమవుతుంది యింతలో? మీ అల్లా వచ్చి నీ గొంతు పిసుకుతాడని భయమా?" స్నేహితురాలిని సోఫాలో ప్రక్కన కూర్చోబెట్టుకుంటూ అంది శారద.

"అది మా సాంప్రదాయానికి విరుద్ధమని నీకన్నిసార్లు చెప్పాలి?"

"మరి యీ వేషం?" శారద యెదురు ప్రశ్న వేసింది.

"డ్రెస్ చేసుకోవటమనేది నేను ఒక కళగా భావిస్తాను. బొట్టు పెట్టుకోవటమనేదికూడ ఒక కళే నన్న అభిప్రాయం నాలో నాటుకున్నప్పుడు తప్పకుండా అలాగే పెట్టుకుంటాను. సరేనా?"

అని జవాబిచ్చింది మొహార్. శారదకు మరో ప్రశ్న వెయ్యటానికి అవకాశం దొరకలేదు. మాట్లాడకుండా చూస్తున్న శారదతో "యేం! అలావున్నావేం? నిద్రపోయి లేచావేమిటి?" అంది ప్రసంగం మారుస్తూ.

"ఊఁ! అవే. లేచి చాలాసేపయింది. యేంతోచటంలేదు." అంది శారద తనకున్న బద్ధకమంతా కంఠస్వరంలో చూపిస్తూ.

"యెందుకు వుదయం మాయింటికి ఖబురు పంపావు?"

"ఊరికేనే. నువ్వు మా యింటికివచ్చి 15 రోజులయింది."

"నువ్వు మా యింటికివచ్చి?" యెదురు ప్రశ్న వేసింది మొహార్.

"నన్ను చూడకపోతే నువ్వు వుండగలవు. నిన్ను చూడకపోతే నేనుండలేను." అంది నవ్వుతూ శారద.

"సర్లె. నేర్చావు బాగా మాటలు. ఇంతకీ యెందుకు ఖబురుపంపావో చెప్పనేలేదు." మొహార్ సూటిగా శారద కళ్ళలోకి చూసింది. ప్రశ్న తొలూహా ఛాయలు యెక్కడయినా లీలగానన్నా కన్పిస్తాయేమోనని. శారదగూడా మొహార్ కళ్ళలోకి చూచింది. ఇద్దరూ ఒకళ్ళ కళ్ళలోకి ఒకరు సూటిగా చూసుకుని ఇద్దరూ ఒక్కసారి ఫక్కుమని నవ్వుకున్నారు. యేదో హుషారయిన విషయమే అనుకుంది మొహార్.

"నీతో కొంచం పనుంది. అందుకని అది చెబ్దామని పిలిచాను."

"యేమిటా పని?" నవ్వుతున్న శారద కళ్ళల్లోకి సందేహంగా చూస్తూ అంది మొహార్.

"వూహించు మరి" శారద కళు చిలిపిగా నవ్వాయి.

"బేగంగారికి రాజాసాబ్ గాదుకదా!" మొహార్ అప్రయత్నంగా అంది.

శారద నవ్వి మొహార్ బుగ్గమీద చిన్న దెబ్బకొట్టి లేచివెళ్ళి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకుంటూ "అవును మొహార్. అందులో నీ పరీక్షకు నిలవగలిగి అందులో మంచిమార్కులు తెచ్చుకుంటేనే—" ఆ తర్వాతి మాటలు అనకుండా శారద చక్రాల్లాంటి తన కళ్ళని వయ్యారంగా త్రిప్పింది.

"వివరాలు?" మొహార్ ప్రశ్న వేసింది.

"వివరములకు శేరాఫ్ పంకజమ్మగారు."

"సర్లెగాని. పరీక్ష అంటున్నావు. నాకు పరీక్షా గిరీక్షా యేమీ తెలియదు బాబూ, తర్వాత యేదయినా అయితే నన్ను వేపుకు తింటావు"అంది మొహార్ బుడిమంతు రాళ్లాగా వచ్చేనవ్వును పెదవులు బిగించి ఆపుకుంటూ "శారదా! మీ నాన్నగారు పిలుస్తున్నారే." క్రిందనుంచి తల్లి కేక విన్పించింది.

ఇద్దరూ కలిసి క్రిందకు దిగివచ్చారు. పడక్కుర్చీలో శారద తండ్రి పడుకుని చుట్టకాల్చుకుంటున్నారు. ఆయనకు కుడి చేతిప్రక్కనున్న సోఫాలో శారదా, మొహార్ కూర్చున్నారు.

"యేమ్మా! మొహార్ నీకింకో కబురు పంపిద్దామనుకుంటున్నాను"గురువారం వాడు శారదని చూడటానికి వస్తారు. ఆరోజు నువ్విక్కడే వుండాలి. కావాలంటే మీ పెద్ద నాన్నకు కబురు పంపుతాను." అన్నారు. మొహార్ తండ్రి చిన్నప్పుడే చనిపోవటం మూలాన పెత్తండ్రిదగ్గర పెరుగుతోంది. మొహారున్నసాకు శారద తండ్రిదగ్గర బాగా చనువుంది. వినయభూషణ అయిన మొహారీని చూస్తే ఆయనకు వల్లమాలిన ఆపేక్ష. "యే వూరునుంచండి; యేం చదివాడు." వివరాలు తెలుసుకోవాలనే ఆసక్తితో అడిగింది మొహార్. ఇంతలో పంకజమ్మగారు యెందుకో ఆహాలులోకివచ్చింది. ఆవిడలేనిదే ఆ యింట్లో యే సంభాషణ, యేపనీ జరగదు. ఇది మొహార్‌కి గూడా తెలుసు.

"రండత్తయ్యా" అని పిల్చింది. పంకజమ్మగారు లోపలవేపుచూసి "ఇదుగో వదినా మన మొహార్ గూడా వచ్చింది కాఫీ పంపవమ్మా" అని తనువచ్చి శారద ప్రక్కన కూర్చుంది.

"అమ్మాయి పిల్లవాడినిగురించి అడుగుతోంది." అన్నారు శారద తండ్రి. అంతా చెల్లెలికి తప్ప తనకు యేమీ తెలీనట్లు. కారణం పెళ్ళికొడుకు పంకజమ్మగారికి అత్తవారివేపు దూరపు బంధువు.

"కుర్రాడినిగురించి యేముంది. ఎమ్. ఏ. గాబోలు పాసయాడు. తల్లితండ్రీ యెవరూ లేరు. చిన్నప్పటినుంచీ మేనత్తే పెంచుతోంది. ఆ మేనత్తకీ యెవరూ లేరుగాబట్టి ఆవిడ తదనంతరం ఆస్తంతా యీ కుర్రాడికే వస్తుంది. తెలివితేటమాట లెలావున్నా కుర్రాడు మంచిరూపసి. వాళ్ళు మా మామగారికి దగ్గరచుట్టాలు. ఈ పెళ్ళితో మళ్ళా యెదో కొత్త సంబంధమన్నా కలుస్తుందేమోనని ఆశిస్తున్నాను. అదీగాకుండా పిల్లవాడు యేమో కథలూ అవీ గూడా వ్రాస్తాడని విన్నాను." అంది పంకజమ్మ వంచుకు వున్న మేనగోడలి మొహం చూస్తూ.

"అయితే జోడా సమానంగా వుంటుంది లెండి" అంది మొహార్.

"నవ్వుతూ. శారదగూడా అప్పుడప్పుడూ యేవో వ్రాస్తూనే వుంటుంది."

"ఇంతకి పిల్లవాడు ఎక్లాస్ అంటారు. అంతేనా?" అంది మొహార్. "కాకపోతే అసలు నేను కన్నెత్తి అటు చూస్తావా?" పంకజమ్మ ఠీవిగాఅంది. ఇంతలో శారదతల్లి కాఫీలు పంపించింది.

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకూ మొహారున్నీసా ఇక్కడే వుండిపోయింది. స్నేహితురాండ్రిద్దరూ పెళ్లికొడుకుని యేవిధంగా పరీక్ష చెయ్యాల్సింది నిర్ణయించుకుని రిహార్సల్సు చేసుకున్నారు.

అనుకున్నరోజుకు పెళ్ళివారు రానే వచ్చారు. పెళ్ళివారంటే యెవరోగాదు స్వయంగా పెళ్ళికుమారుడు, సాక్షాతూ అతని మేనత్త. యెరిగివున్న సంబంధమే కావటంవల్ల మధ్యవర్తుల ప్రసంగమే లేదు. ముందు వధూవరులమాట యేవిధంగావున్నా పిల్లాడి మేనత్తా, పిల్ల మేనత్త యెందులోనూ తీసిపోనట్లు సమవుజ్జీలుగా వున్నారు. శారద తల్లి యెందులోనూ యేమీ కల్పించుకోవటం ఆవిడకు అలవాటులేదు. ఆడబడుచు చెప్పిన పనిని మౌనంగా నిర్వర్తించటం ఆవిడ క్రొత్తగా కాపురానికి వచ్చినప్పుడే అభ్యాసం చేసుకుంది. ఆవిడ ప్రస్తుత వుద్దేశం యేవోవిధంగా శారదను సలక్షణంగా అత్తవారింటికి పంపటమే. "మావాడికి ఎమ్. ఎ. లో క్లాసువచ్చింది. అదేదో ఫస్ గూడ వచ్చాడుట. మెడల్ గూడా యిచ్చారు." అంది పిల్లాడి మేనత్త.

"మా అమ్మాయి బి. ఎ. లో క్లాస్ తెచ్చుకుంది. ఎమ్. ఎ. చదవాలని ఉబలాటపడింది గాని మేమేవద్దని మాన్పించివేసాం. అదిగాకుండా మా శారద కథలు, వ్యాసాలు గూడా వ్రాస్తుంది." అంది పంకజమ్మగారు పెళ్ళికుమారునికంటె తన కోడలు మరో ఆకు ఎక్కువ చదివేవుందని నిరూపిస్తూ. పెళ్ళికూతురు కథలు వ్రాస్తుందనేసరికి పెళ్లికొడుకు తలెత్తిచూడబోయాడు కాని ప్రక్కనున్న మొహార్ తన్ని తీవ్రంగా పరీక్షచేస్తుండటం మూలాన యెత్తిన కళ్ళు సగంలోనే దించేసుకున్నాడు.

ఇదంతా ఆడవాళ్ల వ్యవహారంగావటం వల్ల శారద తండ్రి పెళ్ళికొడుకుతోనే యేవో రెండు మూడు మాట్లాడి వూరుకున్నాడు.

"మాకు పిల్లనచ్చిందండి. ఇంక పై వ్యవహారాలు మాట్లాడుకుంటే నయం. పొద్దుపోతోంది. మళ్లా మేము ట్రెయిన్‌కు అందుకోవాలి." అంది పిల్లాడి మేనత్త

"అలాగే. పిల్లవాడి విషయంలో మాకూ యే అభ్యంతరంలేదు." అంటూ ఆవిడ అన్నగారివంక చూచింది. ఆ మానవమూర్తి గంగి

గోవులాగ అంగీకారంగా తలాడించి తన అభిప్రాయం తెలిపాడు. శారదకు తిన పిడుగు పడ్డట్లయింది. మొహార్ గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది. ఇద్దరూ వేసుకున్న ప్లానంతా పంకజమ్మ సర్వనాశనం చేసింది. శారద, మొహార్ ఒకళ్ల కళ్లలోకి ఒకళ్లు నిస్సహాయంగా చూసుకోవటం పెళ్లికొడుకు దృష్టిని దాటిపోలేదు.

మొహార్ తన మేనల్లుడిని పరీక్షగా చూడడం గమనించి అతని మేనత్త పంకజమ్మతో "ఈ పిల్ల యెవరూ? మొహాన బొట్టు లేదే?" అంది. ఇవాళ మొహార్ అలంకరణ మరీ యిదిగావుంది. శారదది మైసూర్ క్రేప్ సిల్కు చీర లేతనీలం వల్లని బార్డరుకలది కట్టుకుని తెలుపుసిల్కు జాకెట్ వేసుకుంది. శారద బలవంతంమీద మొహార్ అవిఘంగా తయారు కావల్సి వచ్చింది మొహార్ నలా అడగటంతోనే పంకజమ్మ గారి కేం చెప్పాలో తెలియలేదు. ఈ పిల్ల ముస్లింపిల్లని చెప్పటానికి సంకోచించింది. నిజంగా అవాళ మొహార్ ప్రవర్తన వాళ్ళింట్లో పిలవ మల్లే నేవుంది.

"మా మేనత్త కూతురండి." శారద తను కలుగచేసుకుని చెప్పింది.

"మీ అమ్మాయా?" సరుకుని మొహార్ ని చూస్తూ అంది ఆవిడ. పంకజమ్మగారు ఉరిమినట్లుగా ఒక్కసారి శారద కళ్లలోకి చూసి మళ్లా వెంటనే సర్దుకుని "అవ్వే మా చెల్లెలి కూతురండీ. తల్లిపోతే నాలుగు రోజులుంచుకుని పంపిద్దామనుకుని తీసుకొచ్చాం."

"మరి బొట్టు లేకే మొహానా?"

అత్తియ్య యింకా యేం అవకతవక జవాబు చెప్తుందోనన్న భయంతో శారద తనే ముందుగా "ఇషం లేదు. చిన్నప్పటి నుంచీ తలితండ్రులు అలా అలవాటు చేశారండి."

మొహారున్నీ సామనస్సు చివుక్కుమంది. తన తల్లి సలక్షణంగా యింటివదివుంటే తన కిదేం ఖర్మ! అందుకనే యెవరిహద్దులు వారు దాటకూడదంటారు. పోనీ తన చెల్లెలి కూతురని చెప్పి వూరుకోగూడదు. ఇంకెప్పుడు యిలా చెయ్యను బుద్ధివచ్చింది అనుకుని మనసులో గట్టిగా లెంపలు వేసుకుంది.

పావుగంటలో యిచ్చి పుచ్చుకోవటాలు కుదిరిపోయినాయి. ఎమ్. ఎ. పాసయినా, నేటిసమాజంలో తిరుగుతున్నా మేనత్త పది వేలు కట్నం అడుగుతుంటే కనీసం మాటకూడా మాట్లాడలేదు మహానుభావుడు అనుకుంది శారద. మూగవాడేమో అన్న అనుమానంగూడా వేసింది. మొహార్ కి వేమీ పట్టలేదు.

యెప్పుడు యీ తతంగమంతా అవుతుందా పీడ వదిలించుకుని బయటకుపోదామా అని బిగపట్టుకుని కూర్చుంది. పెళ్లికొడుకు మేనత్త వూరుకోకుండా మొహార్ మొహాన బొట్టు గూడా పెట్టించింది. అత్యంతప్రియమైన ప్రాణస్నేహితురాలు శారదకళ్లల్లో దీనత్వం చూసి మొహార్ బలవంతాన కోపం ఆపుకుంది. అద్దంలో చూచుకున్నప్పుడు కోపంతోనూ. అసహ్యంతోనూ యెంత జేవురించిందో చూసుకున్న మొహార్, బొట్టు పెట్టటంమూలానా మొహం ఎంత అందంగా తయారయిందో చూసుకోలేకపోయింది అనుకుంది శారద.

పంకజమ్మ పది వేలు తనకు పదికాసులన్నట్లుగా మాట్లాడింది. అత్తియ్యలోవచ్చిన ఈ ఆవేశం శారదకేగాదు ఆమె తండ్రికికూడా అర్థంగాలేదు. ఇద్దరూ మేనత్తిలూ వచ్చిన పని మర్చి యిద్దరి గొప్పలూ చెప్పుకో నారంభించారు. శారదకు విసుగెత్తింది. "మొహార్ పైకిపోదాంరా" అంది లేచి నిలబడి. మొహార్ అనగానే పెళ్లికొడుకు వులిక్కిపడి తలెత్తి శారదవైపు చూచాడు. అతను చూడటంతోనే శారద నాలిక కరచుకుని తన మేనత్తవైపు చూచింది. తమ ఆస్తిపాసులను గురించి చెప్పుకుంటున్న వారిదరూ యీలోకంలో లేరు. శారదభారం తీసినట్లు వూపిరివిడుస్తూమళ్ళా 'పైకిపోదాంరా' అంది.

"యేంశారదా పైకి వెళ్తున్నారా? వెళ్లండి" అంది పంకజమ్మ శారదమీద తనకెంత అధికారంవుందో చూపిస్తూ. అర్థంలేని హుందాతనం అత్తియ్య అనవసరంగా చూపించడం శారదకు మరింత మంటెత్తించింది. మెదలకుండా సహించి మొహార్ తో పైకి వెళ్ళిపోయింది.

ఆరాత్రి యింటికి వెళ్లిపోతున్న మొహార్ ని మేనత్తతరపున, తన తరపున శారద తనే క్షమాపణ వేడింది. మొహార్ జవాబేమీ ఇవ్వకుండానే వెళ్ళిపోయింది. ఆరోజు తన అత్తియ్యమీద శారదకు అంతులేని ఆగ్రహం వచ్చింది. అయితే మటుకు యేంలాభం? పేదవానికోపం పెదవికి చేటు. యేనాడో అత్తియ్య ఆస్థి ఆవిడ తదనంతరం తనకు వస్తుందని ఈనాడు తనకీబంధన. శారదకు అప్రయత్నంగా దీనికంతకూ కారణమైన తన తలిదండ్రులమీద ఆగ్రహం వచ్చింది. అయినా చేసేదేమీ లేక వుస్సురంటూ కుర్చీలో కూలబడింది.

అనుకున్న లగ్నానికి శారదకు చంద్రశేఖరానికి పెళ్ళయిపోయింది. చిన్న చిన్న కలతలు వచ్చినా అవేమీ లెక్కలేనట్లు సలక్షణంగానే అయిందీ అనిపించారు. పెళ్ళిలో పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కంటె, వారిద్దరి మేనత్తల్ని గురించి, వారి ప్రతిభలనుగురించి అందరూ కథలూ గాథలుగా చెప్పుకోవటం ప్రారంభించారు. ఇద్దరి గొప్పల ఫలితంగా ముఖ్యంగా శారదకూ, చంద్రశేఖరానికి తమ మేనత్తల తదనంతరం యేనాడో రావలసిన ఆస్తులు పెళ్ళిపీటల మీదనే వచ్చాయి. వీళ్ళిద్దరి తంతు చూస్తుంటే శారదకు శివమెత్తుతోంది. కాని చంద్రశేఖరంలో మటుకు ఏచలనమూలేదు. అందరితోపాటు అతనూ తమాషా చూస్తున్నట్లుగా వూరుకున్నాడు.

విడిదిలో బంతులాట అంది శేఖరం మేనత్త. ఇదేం ఖర్మంరాబాబూ. తనెంత ఆదర్శప్రాయంగా నాగరికతగా చేసుకోవాలని వుబలాటపడిందో అంత పురాతన పద్ధతుల్లోకి దింపుతున్నారు అనుకుంది శారద.

"విడిదిలోవల్లగాదు. ఇక్కడే." పంకజమ్మ పట్టుబట్టింది.

"కాదు. అలా జరగటానికి వీలులేదు." శేఖరం మేనత్త మొండికెత్తింది. చిన్న చిన్న మాటలతో ప్రారంభమై చివరకు తీర్పులేని పెద్ద కలహంలోకి దిగింది. ఇదరూ చెరోవైపూ నుంచుని గర్జిస్తున్నారు. వారి దగ్గరకు వెళ్ళి నచ్చచెప్పేదమ్మలు వచ్చిన చుట్టాల్లో యెవరికీ లేవు.

"మా యిషం వచ్చినట్లుగా చెయ్యకపోతే పిల్లను వదిలేసిపోతాం. అంతటితో రోగం వదులుతుంది." శేఖరం మేనత్త ఆఖరి అస్త్రం తీసి ప్రయోగించింది. ఈ అస్త్రంతో పంకజమ్మ కాళ్ళబేరానికి వస్తుందని ఆవిడ అభిప్రాయపడింది. కాని త్వరలోనే ఆ అభిప్రాయం వదిలేసుకోవాల్సి వచ్చింది. శేఖరం మేనత్త మాట్లాడినమాటలు వింటూనే పంకజమ్మ భగుమంది.

(మిగతా కథ పైవారం)




## 25

నాలుగురోజులు గడిచాయి. ఆదెమ్మప్ప యింటిచుట్టూ జనం మూగిపోయారు. మనిషోమాట సాలేనారాదని కడుపు నొప్పితో బాధపడుతున్న ఆదెమ్మప్ప యేడుస్తోంది. మనిషో సలహా చెపుంటే అల్లుడు విసుక్కుంటున్నాడు. పీస కూడా మధ్యను దూరాడు. జబ్బుతోనున్న కోడి పెట్టలా గిజగిజగింజుకుంటున్న ఆదెమ్మప్పను చూసిచూడటంతోనే "ఏమే! అల్లుడ్ని యిల్లరికం తెచ్చుకున్నావు! నీకు కష్టం వచ్చింది కదా డబ్బుకు చూసుకుంటే యేలాగనే! నీకు నోరులేదు ముండవి!"

"అరగని తిండి జరగని మాటా అయిపోయింది నారాత నారాత!" అని బాధతో తలబాదుకుంది ఆదెమ్మప్ప.

"రాతలేదూ గీతా నేదు పట్టుకో నాలుగు వందలు మూడురోజుల్లో మామోళ్లు దానవు అయిపోతావు. నీకు యెలాంటోడి నంటే అలాంటోడిని తోడిస్తాను. ఆ పుల్లిగాడున్నాడే—ఆడిముకం సూడగానే ఆ డాక్టరు ఆసుపత్రిలో చేర్పిస్తాడు. ఇంతకి ఆలస్యం సేసినావా సావే! ఒక్కకోతతో బాధనయం!"

"అమ్మోకోతే!"

"యెఱ్ఱిదానా! నీకు కోస్తన్నారని తెలుస్తాదా? బాదుంటాదా? ఢిల్లికి పేరు పడ్డాది పెద్దాసుపత్రి! డబ్బుయిస్తేగానీ తలుపులు కూడా తెరవ్వట అందులో డాక్టర్లే—యెముకలు యిరిగిపోతే అతికేస్తారు మెదడు యెగిరిపోతే మేక మెదడు పెట్టి మనిషిసేస్తారు. యిశాపట్నం—యిశాపట్నం అంటే యేమిటనుకున్నావు? అక్కడటా....మీరందరూ యినే ఉంటారు ఆరుబారు—సిండియాకుంపినీ—పిచ్చాసుపత్రి—యింక ఆకాశానికి అంటుకుంటాయట మేడలు! సస్తే ఆకళ్ళ వైబోగం సూస్తావే రేపేయెళ్ళు—బాదానయం అయిపోతాది పట్నమూ సూస్తావు!"

ఆదెమ్మ అల్లునిచూసింది. అల్లుడు ముకం ప్రక్కకు తిప్పేసాడు. పీసమరింత గట్టిగా అభినయంతో అదిగో గార నాయుడు సుట్టుపట్ల వైద్యుగుల్ని సూసి యిసిగిపోనాడా? యిశాపట్నం యెల్లిన పది రోజులకి ముఖండీలాగ అయి యెలిపొచ్చాడు ఇప్పుడు ముదర గొఱ్ఱెపోతుమాంసం యియ్. ఈ కెడు రెండు పూటలు సేసితిన్నా కడుపులో నొప్పి నేదు. దేనికైనా తెగింపులేని బతుకేం బతుకు? సూస్తూ సూస్తూ డబ్బుకి ఆశపడి నిన్ను ఆగన్నెమ్మ మొగిడ్ని పంపినట్లు పంపేస్తాడు నీ అలుడు!"

ఈచివరిమాట అంత మందిలో అనటంతో అల్లుడి పౌరుషం వచ్చింది. ఓరి పీసా నోరు జారేసుకోకరా! నాలు గొందలు కాదు యైదొందలుతీసికెళ్ళును. ఇప్పుడికియెన్నొందలు కాలేదు యెల్లనీ."

"అదిగోయే ఆదెమ్మా! అల్లుడొప్పుకున్నాడు. రేపే ప్రయాణంకట్టు. పుల్లిగాడు నివ్వు బతిమాలితే కాదనడు. కేవు నివ్వేకట్టావు తిండిపెట్టావు. సత్రవులో దిగుతారు. పెల్లిగిల్లీ సేసినావుకదా. ఆమాత్రంనీకింతసేయడా? తిరగవచ్చినప్పుడు సింహాదిర పృన్నకి ఒక మొక్కు మొక్కి యెలిపోరాండి."

పీస మరికాస్త పొరుగా మాటాడి పుల్లయ్య యింటికి వచ్చాడు. ప్రయాణం విషయం చెప్పాడు. మల్లు యెలా ఉంటాడనే బాధ. మల్లుకి యిరాసను రోజుల్లో అక్కడికి తీసుకెళ్లడానికి ఆదెమ్మప్ప అల్లుడు ఒప్పుకోడే. "అయ్యో యెల్లినోడివి యెల్తావు పట్నం అన్ని మూలలు బాగా సూసీ! సిండియా కుంపునీ—ఆరుబారు...ఎన్నో కుంపునీలు వున్నాయట—నెలజీతం వచ్చిన నౌకరీ సూసుకోని మరీరా! నివ్వెల్లి అక్కడ వున్నావంటే నీపక్కన నానూయేదో సిన్న పని సేస్తాను."

"బాగా సెప్పినావ"న్నాడు పుల్లయ్య

మనసు చాలా హుషారుగా ఉంది. నీలి పెరటునుంచి వచ్చి పలకరించగానే పట్నం ప్రయాణం చెప్పాడు. ఒక్షణం ఆయ్యాక నీస అన్నాడు "అమ్మా! నీ మాటలు యిన్నాను గాదే. నీమాటే యినుంటే ఆ ఆకలిదయ్యం నాకు పట్టి ఆడించేదా? అలనాడు ధర్మరాజా అబద్ధం ఆడినట్టు నాను యీనాటికి దొంగతనం సేసాను! నిన్నొక్కదాన్నీ పసులు కాయడానికి యిడిసేసాను. పెద్దోడ్ని పట్నం తీసెళ్ళి బతిమాలి ఆ లింటదగ్గర పనికెట్టాను. ఆడు అలాగ అలింటి నౌకరీ సేసి సదివితే నా గవుర్మెంటోడు పెద్దోడైతే ఆడికి నెలజీతం వచ్చిన పని యియ్యడా?"

నీలి నీసమాటలకు సంతోషంగా "మంచి పని సేసావయ్యా! కష్టపడ్తారు. తెచ్చుకుంటారు తింటారు. దానికి సిగ్గెందుకు పడాలి? బారుసాలు పెట్టుకుంటే బతకగలమా? అయ్యా! పౌరుషంతో నీటిమీద యెన్నతీస్తామంటే అవుతాదా? గవుర్మెంటోడు ఒళ్ళు ఒంగనోలకి యేంయిస్తే యేంలాభం? పనిసేస్తేనే పేణం వుందంటారా? కూకుంటే పేణం వుండదంటారా? పేణంవున్నోలం బతకలేమా?"

పుల్లయ్య యింతసేపూ మిటుకు మిటుకుమని నీలివేపు చూసున్నాడు. నీసచిన్న నవ్వుతో "అమ్మా! ఆముసలి బాగా నూరిపోసేసింది! ఎంతైనా కుఱ్ఱంకడుపులో గాడిదపిల్ల పుట్టాదా? కడుపుమాడితే ఆ పౌరుషాలన్నీ ఆ అగ్గిలోపడి బుగ్గయిపోతాయే! అనుభవంతో సెప్తన్నాను. నీమంచే నీకెక్కడికెళ్ళినా కాసాది. ఈ పదిగేమాల్లోనూ నీపేరెత్తితే సెడ్డోలే మంచయిపోతారే!" అంటూ లేచిపోయాడు.

పుల్లయ్య ప్రయాణం సిదమయ్యింది. కాని మల్లువస్తానని యేడుస్తున్నాడు. తీసుకపోదామంటే డబ్బా లేదు. "తరొంగుకు అక్కడ రాసను కట్టుదిట్టంగా ఉన్నాదని" ఆదెమ్మప్ప అల్లుడు ససేమిరా వద్దన్నాడు. నీలి పెద్దరైతు యింటికి వెళ్ళి యేతోపనిపాట్లు చేయటం, తీరికసమయాల్లో నూలువడకటం చేస్తోంది. ఒకపూటకు ఉంటే యింకోపూటకు లేనట్లు బ్రతుకు సాగుతోంది. మల్లుని మెల్లగా బోధపరిచాడు. మళ్ళీ యీరోజుసరికి వస్తానని చెప్పాడు. అక్కడనుంచి బొమ్మలూ, బట్టలూ తెస్తానన్నాడు. చివరకు తల్లి దినకండా నానొచ్చి మీ అందరికీ తీసుకపోతామన్నాడు. అందరం పట్నంలో పనిసేసుకొని హాయిగా ఉందామన్నాడు.

పట్నం వెళ్ళాక మల్లుకు రోజంతా అయ్యతలపే. ఇంట్లో ఒకమూల కూర్చునేవాడు. భోజనం సమయానికైనా లేచేవాడు కాదు. ఆకలేస్తే తంటయింటికి వెళ్ళి ఉన్న గంజి సిలవరి గిన్నెలోనికి ఒంపుకొని గడగడ త్రాగేవాడు, వారం దాటిపోయింది. అయ్యరాలేదు. ప్రతిక్షణం అయ్యగురించి తలుచుకుంటూ ఒకోసారి "ఆయ్యా" అని యేడ్చేవాడు. వారం అంతా పదిహేను రోజులయ్యింది. నిద్దట్లోనూ అయ్యనుగురించి పలవరింపే. ఏడుపురానురాను హెచ్చయిపోయింది. వెళ్ళి రోడ్డుమీద కాసుక కూర్చునేవాడు. ఎంతసేపు చూసినా అయ్య జాడ కనపడేది కాదు. చీకటిపడినా కదలకపోతే తల్లి యెత్తుకొని తీసుకవచ్చేది. తల్లి భుజం మీద కళ్ళునలుపుకొని అయ్యా అని గోల పెట్టి యేడ్చేవాడు. ఇలా మల్లు చీపురుపుల్లలా బెంగతో అయిపోయాడు.

ఒకనాటి సాయంత్రం పుల్లయ్య ఆదెమ్మప్ప తిరిగివచ్చారు. అపరేషను లేకండా యేవో మందులిచ్చారు. నీసచాలా నొచ్చుకున్నాడు. "కోసిస్తే మళ్ళా దానిసేవం వుండకపోను. మళ్ళా యెప్పుడో అగుపిసాది. అయ్యా! పులిగా నీ సొమ్మెంపోనాదిరా ఒక సంచీ అడాకేసుకి తోసేసల్సింది. వెండి సెప్పు దెబ్బతిగిలేగానీ యీ రోజుల్లో యెవుడు సూస్తాడు?"

పుల్లయ్య ఇంటికి వచ్చాడు. మల్లు తండ్రిని చూసి పెరటకు వెళ్ళిపోయాడు. కొడుకు ముఖం చూడానికి సిగ్గువేసింది. తినకు తెస్తానన్నవేవీ తీసుక రాకుండా వుత్తిచేతులతోనే వచ్చాడు. ఐనా దప్పున వెళ్ళి యెత్తుకోగానే కొడుకు అయ్యను పట్టుకొని గట్టిగా యేడుస్తున్నాడు. ఒక్షణం మాటరాలేదు. ఆయేడుస్తునే "అయ్యా ఉండిపోనావూ - వూ..." అంటున్నాడు.

"ఏడుస్తావా? అందరు యీ తొలిరోజుకి అక్కడే ఉందాం!"

"హూ" అన్నాడొక్కసారి!

"మనవూరుపట్నం—మనం పట్టుపోలం అక్కడ రైళ్ళూ—"

"పట్నం...పట్నం...అయ్యా రైలా... రైలా..." ఏడుపంతాపోయి తండ్రి కేసి చూసాడు.

"కుప్పుకుప్పుమని అంటాంది—మనం ఆ పెట్టెలోని కూకుంటే...పట్నం యెలిపోతాం"

"అయ్యా! బస్సునాగ ఉంటాదా?"

"బస్సుకంటా సాలా పెద్దది! నిల్చి యేడిస్తే అగపడదు!" "ఓ ఓ—యేడను......"

చంకదిగి గబగబ "మాంపట్నంపోతాం... పట్నం పట్నం..." అంటూ నులకమంచం మీదనున్న చెల్లెలి దగ్గర గెంతుతున్నాడు.

ఆ రాత్రి నీసతో తను చెయ్యదలచినదంతా చెప్పాడు. "పట్నంలో అంతమంది ప్రజలున్నారు. అన్ని కంపెనీలున్నాయ్. ఎక్కడైనా నెలజీతం పని దొరక్కపోదు. కొడుకూ బాగుపడ్తాడు. ఇక్కడ కొన్నాళ్ళుంటే ఆకలితో సచ్చిపోవడమేకదా?" అన్నాడు.

నీస 'మంచిదేనాయనా ఎల్లు' అన్నాడు. మనిషి చాలా అతృతిగావుండి చిక్కిపోయినట్టున్నాడు. ఆ రోజుల్లో పుల్లయ్యకు ఈనాటి పుల్లయ్యకు యెంతతేడా! ఆ గేరా గిద్దాలంలేకపోతే పుల్లయ్య అని పోల్చుకోవటమే కష్టమయ్యేదేమో!

తెల్లవారేక వూరంతా ప్రాకిపోయింది. పుల్లయ్య కుటుంబం అంతా యెత్తుకొని

# ★ దగాపడిన తమ్ముడు ★

పట్నం పోతాడని. నలుగురూ నాలు విధాల అనుకున్నారు. ఏందయిరం నేకపోతే యెలిపోతాడని కొందరూ, ఒళ్ళుబంగనోలకి వూరచ్చెదని మరికొందరూ, తలోలా అనుకుంటూ కొందరు నీలిని పలుకరించడానికి వచ్చారు. నీలిసహజశాంతం కనపరచింది. అంతేకాని యెటువంటి వ్యాఖ్యానాలూ చెయ్యలేదు.

మధ్యాహ్నం సరికి కొడుకుతో సహా యింటికి వచ్చాడు. నీలి మెల్లగా అడిగింది. "ఊరంతా తెలిసిందిగానీ నాకు తెలియ నేదని!"

దినికి జబాబు చెప్పలేదు. మళ్ళీ ప్రశాంతంగా ఏ ఆదరువూ నేకండా వున్నారు వదిలేటం మంచిదికాదు. పుట్టిపెరిగినవూరు. అందరూ తెలిసినోలు. ఆపదకి ఒకరు కాకపోతే యింకొకరైనా ఆదుకుంటారు. పట్నంలో యెవురికి యెవురు దిక్కు. నాకేం అని పదికాసు లున్నాయి గనకనా! నా మాటిను..."

చప్పున పుల్లయ్య విసుగ్గాటుతో "అందుకే నీకు సెప్పనేదని" లేచి వెళ్ళిపోయాడు.

వీథిలో పీస యింటిదగర పదిమందికూడి పుల్లయ్యకు ప్రశ్నలవర్షం కురిపించారు. వీరందరికీ ఒకటె సమాధానం. "నాయిష్టం" అని పుల్లయ్య చెప్పగానే పీస నిల్చొని నలుగుర్ని ఉద్దేశించి "ఓరయ్యలూ! మీరంతా మన వూరోడొకడు ఢిల్లీకి పేరుపడ్డ ఆ పెద్ద పట్నాన ఉంటాడని ముచ్చట పడకండా యిదంతా దేనికర్రా! మీకు తెలీదు. పట్నాల్లో యేం జరుగుతున్నాయో మనం అంతా నూతిలో కప్పలం! అమెరికనోడట పెద్దయిమానం సుక్కల్లో సెందురుడి దగ్గరికి యెల్తాదట! అక్కడికి నువ్వూ నేనూ ముందెళ్తామా? పట్నంలో వున్న పుల్లయ్య ముందెళ్తాడు." పుల్లయ్య రేపు తిరిగి "ఓరయ్యా పుల్లిగా! అక్కడ ఈ యెళ్ళినోలందరూ యిక్కడలాగ యెవుడిబాగు వాడిబాగు అనుకోకూడదు సుమా? ఇప్పుడు సిక్కిపోయినా ఒకనాడు కండగలవోడివి. మనిషివి కావా? అక్కడ ఆ సెందురిడిలోను యిల్లూ వూళ్లూ కట్తరుకాదా? అక్కడ నీకష్టం అందరికష్టం, నీ సుఖం అందరి సుఖం—నాపిల్లలూ, నీ పిలలూ, వాడి పిల్లలూ—అంతా అందరి పిల్లలే! ఆసి అంటావా కొందరిది కాదు. అందరిదీనూ! మనిషి జాతంతా ఒకటే జాతి! అలాంటిగవుర్నమెంటోడు అక్కడవచ్చినట్లు సెయ్యాలి."

మల్లు యెంతో తెలిసినటుగా "తాతా! తాతా!" అని గంతాడు నవ్వుతూ.

"మామూ పట్నం పోతాం!"

ఆ సాయంత్రం వెళ్ళి నీలమ్మగుడి దగ్గర ఒంటిగా కూర్చున్నాడు. కొడుకు వీధిలో పిలలతో ఆడుకుంటున్నాడు. "దాసుడు వుంటె యేం చెప్పేవాడో! తల్లి దీవనలు యిచ్చి పంపించేది. మాతల్లికి ఆలనాపాలనా లేదే! అయ్యో! గేమం అంతా యిలాగే దేముడు దెయ్యం అన్న భయం నేకండా పోయిందే! ఎవుడు సేతికందింది వాడిదే! పొరుగున ఒకడు కడుపు మాడి సస్తన్నాడనే కనికరం లేదు. నీతినిజాయితీ యెక్కడికి ఎగిరిపోయిందో! నాయంగలవోడు పెద్ద కాదు. డబ్బునోడు పెద్ద. ఆడికే నలుగురూ కొలుస్తున్నారు. యీలాంటి వూరు యెంత తనూరైనా యెందుకు తనుండాల? ఇక్కడ నాకు పాయసం దొరికినా వుండను. నాయం వున్న స్థలాన బుక్కెడు మంచినీరుమీద బతికితేం?"

"పట్నంపోతాను. మళ్ళీ మొదటపుల్లయ్యనైపోతాను. నాయం నీతికి కట్టుబడి మలునాయుడి కొడుకుగాను మల్లు అయ్యగాను గంజి తాగి హాయిగా ఇంటా బయటా మెప్పుతో బతుకుతాను. పట్నంలో తన ఉద్యోగం" అక్కడ బ్రతుకు గురించి ముచ్చటగా తలచుకున్నాడు. సంతోషంతో మనసు నింపుకున్నాడు. నీలమ్మతల్లి దాసుడి గురించి తలుచుకున్నాడు. తల్లిని యిక్కడెందుకు. పట్నంలో పెద్దసంబరం అవునే! మాయమ్మ నివ్వెంత సల్లని తల్లివే! యిలా చీకటి పడిపోయింది. నీలమ్మతల్లికి మొక్కి మొక్కుదామని లేచాడు. తలుపు సందులోనించి చూశాడు. దీపాలు వెలిగినట్లున్నాయ్ దాసుడు ఆ లేత దీపపు కాంతిలో కూర్చొని మౌనంగా ఊగుతున్నట్లనిపించింది. దాసయ్యసచ్చిపోయినా తల్లిని ఒదల్లేదా?" ఒళ్ళు పులకరించింది. మనసులో "అయ్యా! దాసయ్యా! పట్నంపోతాను. దీవించరా?" అని అడుగుతున్నాడు. వెంటనే సమాధానం "నాయనా!" అన్నపిలుపు తనలో మారుమ్రోగింది. అలా కూర్చుండిపోయాడు. తన వునికి మరచిపోయాడు. తనకంటికి నీలమ్మతల్లి...దాసుడు...దీపాలు అంతా అగుపిస్తున్నాయ్. దాసుడు మా నాన్ని వదలినరుడా! "అన్న కేక వేసినట్లు వినిపించింది. సాష్టాంగపడిపోయాడు పులయ్య! "వెళ్ళరా వెళు! పిచ్చివాడా! నేను యీవూళ్లో యీ గుడిలోనే వున్నాననుకుంటున్నావా? నీలో లేనూ? ఇప్పుడు తిట్టినవాళ్ళందరిలో లేనూ—యెక్కడ లేనురా? యెళ్ళరా యెళ్ళు - మానిందే మంగు బతికిందే వూరు"

ఇంతలో 'అయ్యా' అన్న కేకలు వినుపించసాగినయ్. తలుపు సందులో నుంచి చూసాడు. ఏ దిపాలూ లేవు - చీకటిగా వుంది. విగ్రహాలైనా అగపడలేదు. అంతా ఒక కలలా వుంది. ఆ చీకటిలో భయంభీతి లేకుండా ఒంటిగా ఆయ్యా అనుకుంటూ గుడిదగ్గరకు వచ్చినా కొడుకును చూసాడు. సంతోషంతోనూ అభిమానంతోనూ ఒళ్ళు పులకరించసాగింది. కొడుకునుగట్టిగా హత్తుకొని ముద్దులాడాడు.

## 26

పట్నంలో ఇల్లూ వాకిలీ వుద్యోగం సద్యోగం చూడకండా అంతా లేచి వెళ్ళిపోవటం నీలికి నచ్చలేదు. మొదట పుల్లయ్య వెళ్ళి కొన్నాళ్ళుండి పనిపాటు చూసుకొని వస్తె అంతా వెళ్లిపోతే బాగుండేదని నీలి అభిప్రాయం యిచ్చింది. మల్లు అయ్యను వదిలి వుండలేడు. ఒంటిగా పుల్లయ్యపోతే వేళకు తిండివుండదు. అదీ కాకుండా ముసలమ్మ కళ్ళుమూస్తూ అన్నమాటలు జ్ఞప్తికి రావటం వల్ల నీలి ఖరారుగా యేమాటా చెప్పలేకపోయింది.

చీకటిపడి చాలాసేపయ్యింది. ఒంటిగా వీధి అరుగుమీద నీలి కూర్చుంది. ఆమె ఆలోచనలో పడేదేకానీ గుడి వెంకన్న గన్నెమ్మ కలసివచ్చి వాకిట కూర్చొని మాటలు కలిపారు. ఇంతలో పుల్లయ్య కొడుకుతో సహా వచ్చాడు. మల్లు అయ్యచేసిన గొప్పతనాన్ని

తల్లితో చెప్పడానికి అభినయంతో వుపక్రమించాడు. నీలి గతుక్కుమని "నవ్వుతిన్నావా? ఆలగోయిరోదం యెందుకు తెచ్చుకున్నావు!"

"తెచ్చుకోనూ? ఆడిరక్తం తాగుతాను."

"అవేంమాటలు? ఎందుకు పులి లాగ అయిపోతావు. ఆ రాజిగాడు మనకేం పెద్ద అన్నాయం సేసినాడు?"

"సెయ్యలేదా? సగానికి సగం యిచ్చి అంత పొలం పాటలో పెట్టుకుంటానంటాడు ఆ పేకులు లాగి తీసుకోను నా పొలాన్ని?"

"సెబాష్‌రా అయ్యా" గుడ్డి యెంకన్న అందుకున్నాడు. నీలి దీనంగా "అయ్యా! నివ్వూ అలాగే అంటావా? ఆడిపెళ్లం అడక్కండావచ్చి డబ్బిచ్చి కైదునుంచి యిడిపించింది. మామ్మ సచ్చిపోతే ఆ రాజిగాడు వచ్చేనా అంతా సేసినాడు. ఆడు మనకేం దగ్గిరోడు సెయటానికి? ఆమాత్రం మనవు యిస్వాసం నేకపోతే మనుసులం అని యెలాగ అనుకుంటాం?"

"అమ్మో అందర్నీ మంచంటావే నివ్వు. పెపంచకంలో అంతా మీలాంటి అమాయకమైనోలు ఉండరే! ఆడా! కక్కులకలెం... యీదంటయెల్లేవాళ్ళగుండార్లులాగుతాడు."

నీలిఅరుగుమీదనించిలేచి "మీతల్లీతండ్రికి దండమెడాను. మన కెందుకు కోసం? పెదాలకిసేటు. అంతా నాకొదిలెయ్యండి. అడిగినట్లు అడిగితే యేమంటాడు?"

"మూతిమీద కొడ్తాడే!" పుల్లయ్య అందుకున్నాడు. "ఒళ్లింతా వుండగా మూతిమీదేకొడాడా? అయినా ఆడదాన్ని - కొటడానికి ఆడిసేతులు రావులే!" అంటూ నీలి పెరటకు వెళ్ళిపోయింది.

అంతా ఆక్షణంవూరుకున్నారు. వెంకన్న గన్నెమ్మ చాలసేపటివరకు అక్కడే కూర్చున్నారు. చీకటిరాత్రి గిన్నెలోని మెతుకులు గంజీ వెంకన్న ముటుకోలేదు: గన్నెమ్మ లేచి వెంకన్నను పటుకొని భజనమందిరం దగ్గరకు తీసుకవెళ్లింది. ఆదగ్గరగానే రాజిగాడి యిల్లు. వెంకన్నకు నిద్రపట్టలేదు. గోడకు చారబడి యేదో ఆలోచిస్తున్నాడు.

చీకటి! వూరంతా యీచీకటిలో ముసుగు వేసుకుంది. గన్నెమ్మ వెంకన్న గిన్నెలోని అన్నం దొంగతినంగా తిడిమి ముద్దకుముద్ద నోటిలో కుక్కుకుంటోంది. అన్నంనమిలితే చప్పుడౌతుందని మింగేస్తోంది. కానీ చిన్న చప్పుడౌతోంది. ఈ చిన్నశబ్దానికి చెవులు రిక్కించగలిగిన వెంకన్నకు యిప్పుడీచప్పుడు వినపడలేదు. మనస్సంతా పుల్లయ్యరాజిగాడి తగువుమీద కేంద్రీకరించుకపోయింది.

అర్ధరాత్రి. అంతివరకూ మనసు పరిపరి విధాలపోయింది. పొరపాటునైనా కునుకు పడలేదు. ఎందరినో తలుచుకున్నాడు. ఎన్నో అనుకున్నాడు. ఎంతో జ్ఞాపకంవచ్చింది. నీలమ్మతల్లీ అని మొక్కుకున్నాడు. దానయ్యని తలచుకున్నాడు. "నాకొకసెలక ళ్ళుకనిపించనీ తల్లీ" అన్నాడు. రాను రాను ఆకోరిక ప్రబలమైపోయింది. ఉద్రేకంతో. "ఒక సెల కాదే ఒక వారమే...వారంకాదే...ఒక రోజే నా యీయవాతల్లీ? నిద్దరపోతున్న వూరిని లేపేద్దునే! ఈ గొల్లలని పులుల్ని సేస్తాను తల్లీ? ఒక్కరోజూ కళ్ళు కనిపించనీ తల్లీ!...ఒక రోజు కాదే...ఒకగంట యియితల్లీ...ఒక గంటనైనా యీయవా? ఈ అన్నాయాన్ని తుడుస్తాను...ఒక గంటమ్మా...ఒక సెణం తల్లీ!"

లేదు నేత్రదృష్టి రాలేదు. ఆ వేళంతో వెంకన్న కళ్ళు నీటితో నిండిపోయాయి. జలజల నీరు కారసాగింది. ఎగ వూపిరి తీశాడు. ఒంటిమీదనున్న ఒకే గుడ్డపీలికతో మెలగా కళ్ళుతుడుచుకొని నవ్వుకున్నాడు.

చీకటి—కటిక చీకటి—ప్రకృతి గాఢంగా నిద్రపోతోంది. మెల్లగా తడిమాడు. చేతికర్ర దొరికింది. లేచాడు. ఉజాకొద్దీ రాజిగాడి యింటివేపు రెండడుగులు వేశాడు. ఏదో దప్పుడైనట్లుంది. ఎవరదని అడగాలనుకున్నాడు. కానీ మెల్లగా వెనక్కి తిరిగి భజనమందిరం అరుగుమీద కూర్చున్నాడు. ఓక్షణం కూర్చున్నాడు చప్పుడు లేదు. తడుముకుంటూ గన్నెమ్మను లేపాడు. ఎంతో నిద్దరపోయినట్లు ముసలిది లేచింది.

"హుష్! నివ్వు నాకో మేలు సెయ్యాల" మెల్లగా గొణిగాడు.

"నేనేం సేస్తాను?"

"రాజిగాడు దాన్నం కొట్టు అరుగుమీద కాపలా కాస్తాడు. మెల్లగా అడుగు వేసి నిద్దరోనాడో లేదో సూసి రాయమ్మ తల్లీ నీకు మొక్కుతాను"

"నా సెల్లనమ్మో! దొంగతనానికి వచ్చినావంటే!"

"ముండా! ముందు ఆగిన్నెలోని అన్నం తినీ...ఈరోజు నాను సెప్పినట్టు యిన్నావంటే నాకు దొరికిందానిలో రోజూ సగానికి సగం నీదే."

వెంకన్న మాట అన్నాడంటే నిలుపుకునే మనిషని ధైర్యంవున్న గన్నెమ్మ గిన్నెలో మిగిలిన గంజి గడగడ తాగేసింది.

నడ్డివంచుకుని మెల్ల మెల్లగా అడుగులు వేస్తూ చూసింది. టోపుల్లు తీసుకొనిఒంటిగా రాజిగాడు కొట్టు అరుగుమీద నిద్దరపోతున్నాడు. పశువులుసాలలో పడుకున్నాయి.

వెంకన్నకు ఈలోగా యెన్నో ఆలోచనలు వచ్చాయ్. ఇంటికి అగ్గిపెట్టామనుకున్నాడు. వాడి రక్తం త్రాగుదామనుకున్నాడు. చంపాలనుకున్నాడు.

ఇంతలో తనలో యెవరో ప్రశ్నించారు. వాడెవడు? రాజిగాడెవడు? నీకొడుకు కాడూ? కొడుకు సంపుతావు...ఆడి రక్తం త్రాగుతావా? సూరమ్మకు ఆ రాత్రి యేం సెప్పావ్? దాని దగ్గర యేమని ఒప్పుకున్నావ్? అది నీకు సెమిస్తాదా?

లేచి యిటూ అటూ గాబరాగా తిరిగాడు. సెడ్డోడుకొడుకైతేనేం! ఆ సలని తల్లి నీలమ్మ యింటికి నిప్పుపెట్టాడు. బుగత భూములు కొ వేసినాడు—స్వంత భూమి దగ్గరెట్టుకొని అన్నాయంచేసినాడు—ఇచ్చిన డబ్బుకి యిలుయిస్తేగానీసాలదని... ఆలని సెట్టుకింద పచ్చుల్ని సెయ్యాలని సూస్తన్నాడు...ఆడు మనిషేనా...ఆడు నా కొడుకేనా? కాడు—కాడు...!

వచ్చింది గన్నెమ్మ. వెంకన్న ఆమె సహాయంతో మెల్లగా కొట్టుచేరుకున్నాడు—

(41-వ పేజీ చూడండి)

# పెద్దల
# పిల్లుల

ఒక మతగురువును 'పాపం' గూర్చి మీ అభిప్రాయాలేమిటో సెలవిస్తారా అని అడిగితే "నాకు అదంటే ఇష్టం లేదు" అని మాత్రం చెప్పి ఊరుకున్నాట్ట. అలాగే పిల్లిని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి అని అడిగితే చాలామంది "మాకు అదంటే ఇష్టం లేదు," అని మొహమాటం లేకుండా నిష్కర్షగా చెప్పేస్తారు.

ప్రపంచం తీరే అంత; నిష్కారణంగా పిల్లుల్ని ద్వేషిస్తుంది. పిల్లిని చూస్తే చాలు, పట్టి పుణ్యానికి చిరచిరలాడి పోతుంది.

పిల్లికి ఇంత చెడ్డపేరు ఎందుకొచ్చిందో తెలియదు. ఆంగ్ల నిఘంటువు చూడండి— క్యాట్ (పిల్లి) పేరుమీదుగా అంత గౌరవాస్పదం కాని మాటలు బోలెడు కనబడతాయి. "క్యాట్-ఓ-షైలో" అంటే అదొక రకం శిక్షా పరికరం. 'కేట్స్ పా' (పిల్లి పంజా)



అంటే కీలుబొమ్మ, మూర్ఖుడు అని అర్థం. దొంగలాగ, చాటుగా ఏమీ ఎరగనట్టు చెడ్డపనులు చేయటాన్ని 'క్యాట్ లైక్' (పిల్లిలా) అంటారు. వంటిమీద బట్ట లేకపోతే 'క్యాట్ స్కిన్' (పిల్లి చర్మం) అంటారు. వేళా

చిత్రకారుడు: గానుగెద్దులతో

# రదా:

# కం!

గ్రహాన్ని 'కాట్ హౌస్' అంటారు.

పిల్లులలో లెక్కలేనన్ని రకాలున్నాయి.
ందుచేత 'మనుషులు ఇలాంటివారు' అని
ాదర్నీ ఒక సూత్రంలోకి ఇరికించి చెప్పటం
త తప్పో, పిల్లులు ఇలాంటివి అని సూత్రీక

★

ంచటం అంటే తప్పు. కొందరు పిల్లికంటె
ుక్క చాలా మంచి జంతువు అని వాదిస్తా
ని, అది చాలా తప్పనీ, పిల్లులు కూడా
శ్వాసంగల జంతువులేనని రాబర్ట్ లిండ్
ుహాశయుడు అన్నాడు.

జాగ్రత్తగా పరిశీలించాలేగాని మార్జా

లాలలో బోలెడు మంచి గుణాలు కనిపి
స్తాయి. తమ సంగతి తాము చూసుకో
వటంలో వాటికవే సాటి. తమ ఆరోగ్యానికి, ఆనందానికీ భంగం రాకుండా జాగ్రత్తపడ తాయి. లోపలా, బయటా కూడా ఎప్పుడూ శుభ్రంగా, అద్దంలాఉంటాయి. ఇంత శ్రమ పడుతూఉన్నా అవి ఎక్కడా గాభరా పడుతున్నట్టు కనిపించవు. మంచి అరిందాల్లాగ హుందాగా ఉంటాయి. వాటి హుందాతనం చూస్తుంటే ముద్దొస్తుంది.

## ప్రసిద్ధ మార్జాలప్రియులు

పిల్లిని మామూలు జనం ఎపగించుకుంటే నేంగాక, చరిత్ర ప్రసిద్ధి కెక్కిన గొప్ప వాళ్ళ నేకులు మార్జాలప్రియులు! ముఖ్యంగా రచయితల నేకమందికి పిల్లులంటే మహాప్రేమ. సర్ కాంప్టన్ మెకంజీ డజను సయామీస్ పిల్లుల్ని పెంచుకున్నాడు. శామ్యూల్ బట్లర్ (వే ఆఫ్ ఆల్ ఫ్లెష్) దారి తప్పిన బాట సారుల్లా దిక్కు మొక్కు లేకుండా తిరిగే పిల్లి కూనల్ని చేరదీసి పెంచేవాడు. ఆయనొకసారి "నాకు పర్షియన్ పిల్లి అయినా సరే వద్దు బాబూ! వాటి సంరక్షణబాధ ఎవడుపడతాడు. నిలవ నీడ లేకుండా తిరిగే దిక్కులేని పిల్లికనిపిస్తే పెంచుకుంటాను. ఎందుకంటే అలాంటి దాన్ని జాగ్రత్తగా పోషించాలనే నైతిక బాధ్యత ఉండదు," అని వ్రాశాడు. జార్జి బెర్నార్డ్ షా లాంటి వాడు కూడా పిల్లిగా ఉండటంలో చాలా లాభాలున్నాయని అంగీకరించాడు. ఏ పిల్లిని చూసినా ఒక్కసారి దానివల్లి నిమరకుండా ఎన్నడూ ఊరుకోలేకపోయానని ఆయన ఒప్పుకున్నాడు. హెన్రీ జేమ్స్ పిల్లిని బుజం మీదెక్కించుకుని మరీ నవలలూ అవీ వ్రాసేవాడు.

చార్లెస్ డికెన్స్ కూడా మార్జాలప్రియుడే. చెవిటి పిల్లినొక దాన్ని పక్కన కూర్చోపెట్టుకుని ఆయన వ్రాసుకు నేవాడు. ఆఖరికి చండశాసనుడు లాగ కనిపించే డా॥ జాన్సన్‌కు కూడా పిల్లులంటే ప్రీతి కలగటం ఆశ్చర్యం. బుజం మీద పిల్లి నెక్కించుకొని జాన్సన్, బాస్వెల్‌తో కలిసి బజారుకు పోయి పిల్లికి అవి ఇవి కొని తినిపించేవాడు. ప్యాన్‌కారే అనే ఫ్రెంచి గణితశాస్త్రవేత్త ఎప్పుడూ సయామీస్ పిల్లుల్ని చుట్టూపెట్టుకుని ఉండే వాడట. "పిల్లి మహా తెలివైనది; మహా చురుకైనది. సరైన సమయంలో సరైన పని చెయ్యటం దానికి తెలిసినట్లు దేనికీ తెలియదు. ఒక సమస్యకు రెండు పరిష్కార మార్గాలుంటే, అందులో తనకునచ్చిందీ తన దృష్టికి మంచిదని తోచిందీ మాత్రమే కాక అది అందంగా గౌరవకరంగా కూడా అని పిస్తేనే అనుసరిస్తుంది," అని ఆయన



అన్నాడు. ప్యాన్‌కారే సాధారణంగా తీవ్రంగా ఆలోచిస్తూ కుడిచేత్తో గబగబా వ్రాసేస్తూ, ఎడమచేతిమీద సయామీస్ పిల్లిని పడుకోబెట్టుకుని నిద్ర బుచ్చుతూ ఉండడంచూసినవాళ్లు చాలామందిఉన్నారు.

సర్ వాలర్ స్కాట్‌కు చిన్నప్పుడు పిల్లులంటే రోతేగాని రాతకోతల్లో ఆరితేరాక ప్రీతిపుట్టింది. పిల్లులను ఆయన బహువిధాలుగా కీర్తించాడు. "పిల్లులు సముద్రమంత గంభీరమైనవి. వాటి ఆలోచనలు మనం పోల్చుకోటానికి కూడా వీల్లేనంత చిత్రంగా

వ్యవసాయం

జి. జి. కృష్ణమూర్తి—గుంటూరు.

# ★ పెద్దలసరదా: పిల్లుల పెంపకం ★

ఉంటాయి," అని ఆయన అభిప్రాయపడ్డాడు. థియాఫీల్ గాత్యే (ఫ్రెంచి కవి, నవలాకారుడు) మనిషికిగాలి ఎంత ముఖ్యమో పిల్లులంత ముఖ్యమన్నాడు. ఆయన ఇంటినిండా ఎప్పుడూ పిల్లులుండేవి. ఒళ్లో పిల్లి లేకుండా ఆయన వ్రాసేవాడు కాదు. ఎమిల్ జోలా, మిరాబో మార్జాలప్రియులే. అనటోల్ ఫ్రాన్స్ "బోనిలార్" లో చక్కని పిల్లిపాత్ర సృష్టించాడు. థామస్ హార్డీకి తన పెంపుడుపిల్లి "మ్యావు మ్యావు" వినిపిస్తే ప్రాణం లేచి వచ్చేది. ఆయనకి పసుపుపచ్చని లోకళ్ళుగల పిల్లి ఉండేది. దానిపేరు కాబీ. హార్డీ చనిపోయినప్పుడు దాని దుఃఖం వర్ణించటానికి వీల్లేదు. అలర్నాన్ బ్లాక్ వుడ్, ఎడిత్ సిట్వెల్ వంటి ఆధునికులకు కూడా పిల్లులమీద మమకారమే.

## రాజకీయవేత్తల్లో

ఇక రాజకీయవేత్తల్లో చూస్తే బిడాలప్రేమికులు కోకొల్లలుగా ఉన్నారు. సర్ విన్‌స్టన్ చర్చిల్‌కి పిల్లులంటే తగని అపేక్ష. ఆయన పెంపుడుపిల్లి పేరు నెల్సన్. అది ఆయన పక్కన ఎప్పుడూ ఉండేదిగనుక సరిపోయిందిగాని, లేకపోతే ప్రపంచయుద్ధాన్ని ఆయ అంత సమర్థంగా నడిపించగలిగేవాడు కాదేమో. 1948 లో చర్చిల్ ఫ్లూ దబ్బతిని కోలుకుంటున్న సమయంలో ఎవరో ఆయన్ని చూట్టానికి వచ్చారు. ఆయన కాళ్ళమీద పెద్ద నల్లని పిల్లి పడుకుని ఉంది. చూట్టానికి వచ్చినాయనతో చర్చిల్ "ఈ పిల్లి మీకంటే ఎక్కువగా యుద్ధసహాయం చేస్తోంది. ఇది నాకు వేడినీళ్ళ సీసా (హాట్ వాటర్ బాటిల్) లాగ పని చేస్తోంది. దీనివల్ల ఎలక్ట్రిసిటీ పొదుపు అవుతోంది," అన్నాడు. దాన్ని సర్ విన్‌స్టన్ "మైడియర్" అని పిలుస్తాడు. అది యజమాని ఎక్కడికి నడిచే అక్కడికి కాళ్లో పడుతూ ఉంటుంది. లార్డు ఫింగాల్‌కి పిలులపై ప్రేమజాస్తి. కిలీన్‌కోట (ఐర్లెండు)లో 50కి పైగా ఆయన పిల్లులున్నాయి. వీటికి ప్రత్యేకంగా మంచిగదులూ గ్రహా ఉన్నాయి. వీటికి తమ యజమాని మీద చెప్పలేని ప్రేమ. ఆయన పిలిస్తే చాలు ఎగురుతూ వచ్చి కాళ్ళమీదపడి దొర్లుతాయి.

జెరెమీ బెంథామ్ (బ్రిటిష్ తాత్వికుడు) ముఖ్య స్నేహితులు పిల్లులు. ఆయన దగ్గరొక పిల్లి ఉండేది. దానిపేరు మొదట లాంగ్ బోర్న్. తరవాత అది సర్ జాన్ లాంగ్ బోర్న్ అయింది. చివరికది రివరెండ్ సర్ జాన్ లాంగ్ బోర్న్, డి. డి., అయింది. పిల్లిమీద ఎంత ప్రేమలేకపోతే బెంథామ్ దాన్నలా బిరుదులూ అవీ ఇచ్చి గౌరవిస్తాడు? ఫ్రెంచి విమర్శకుడు సాన్‌బెవ్ కూడా పిల్లుల్ని ప్రాణప్రదంగా పెంచేవాడు. ఫ్రెంచి రచయిత మాంటేన్ గొప్ప మార్జాలప్రియుడు. "నేను నా పిల్లితో ఆడుకుంటున్నప్పుడు నన్ను చూసి అది వినోదిస్తోందో, దాన్ని చూసి నేను వినోదిస్తున్నానో ఎవరికి తెలుసు?" అని ఆయన వ్రాశాడు.

ఇటాలియన్ సంగీతవేత్త ఆంటోనియో సాకినీ కృతులు వ్రాసేటప్పుడెప్పుడూ తన పెంపుడు పిల్లులు రెంటినీ భుజాలమీద ఎక్కించుకుని మరీ వ్రాసేవాడు. డా॥ లిస్టన్ అనే ఆయన తన ఇంట్లో విందులు చేస్తూ, వచ్చిన అతిథులను తన పెంపుడు పిల్లికి పరిచయం చేసేవాడు. ప్రవక్త మహమ్మద్ పెంచిన పిల్లిపేరు మ్యూజా. ఆయన ధరించిన వస్త్రం మీద అది వళ్ళెరక్కుండా పడి నిద్రపోతుంటే, దాన్ని నిద్రలేపటమెందుకని ఆ కాస్త మేరా వస్త్రం చించివేసుకునేవాడు. అదంటే అంత ప్రేమ ఆయనకి. కార్డినల్ వుల్సీకి తన పిల్లి అంటే చెడ్డప్రేమ. ఇంగ్లండు లార్డు చాన్సెలరుగా తీర్పులిస్తున్న సమయంలో దాన్ని ఎప్పుడూ పక్కన కూర్చోబెట్టుకునేవాడు.

## ద్వారపాలకుడు

కాని ప్రపంచంలో కల్లా గొప్పపిల్లి ఏదంటే "మైక్" అనేదాన్నే పేర్కొనాలి. ఇది 1909 ఫిబ్రవరినుంచి 1929 జనవరిలో చనిపోయేదాకా బ్రిటిష్ మ్యూజియం ప్రాకారద్వారాన్ని కాపలా కాస్తూ ఉండేది. అది చనిపోయినప్పుడు గొప్పవారికి చేసినంత వైభవంగా అంత్యక్రియలు జరిపారు. దూర దూర దేశాలనుంచి మ్యూజియం చూట్టానికి వచ్చినవాళ్లు "మైక్"ను చూపించమని తప్పకుండా అడిగేవారు. లండన్ పత్రికల్లో "మైక్"ను గూర్చిన వార్తలు పడేవి. "మైక్" ఇంకా 18 నెలలకి చనిపోతుందనగా "స్టార్" పత్రికలో ఇలా ప్రచురించారు.

"బ్రిటిష్ మ్యూజియం ద్వారం వద్ద కాపలా కాసే "మైక్" పొందిన పేరుప్రతిష్ఠలు ఇంకే పిల్లీ పొందలేదని చెప్పవచ్చును. రాత్రింబగళ్ళు, ఎండయేది చలి అయేది 18 ఏళ్ళపాటు 'మైక్' ద్వారపాలకత్వం వహించింది. పోలీసు పనిచేసింది. ఎర్రటి కాలరూ, జరీ అంచులపట్టు టోపి ధరించి రాజదూతగా తనవిధి నిర్వర్తించింది........"

ఇంకొకపిల్లి ప్రభుత్వ ప్రచురణ అయిన లండన్ గజెట్‌లో పేర్కొనబడేటంత అపూర్వ గౌరవం పొందింది. ఒక గొప్పింటావిడ సయామీస్ పిల్లి నొకదాన్ని దిగుమతి చేయించుకుంది. రూలుప్రకారం దాన్ని క్వారంటైన్‌లో పెట్టారు. క్వారంటైన్‌లో ఉండగానే దానికి పురుడు వచ్చింది. దిగుమతి చేసిన పిల్లుల్ని జంతువ్యాధి చటం ప్రకారం నిర్బంధంలో ఉంచాలి. అయితే విదేశంనుంచి వచ్చినపిల్లి ప్రసవిస్తే ఆ పుట్టిన పిల్లికూన దిగుమతి అయిన జంతువుగా లెక్కకు వస్తుందా రాదా? ఈ ప్రశ్న అధికారులను తికమక పరిచింది. పిల్లికూనను కూడా నిర్బంధంలో ఉంచాలంటే గజెట్‌లో అధికారిక ప్రకటన చేయవలసిందే తప్ప మార్గాంతరం లేదు, వ్యవసాయశాఖా మంత్రి జంతువ్యాధి చటం (1894). సెక్షన్ 49 (8) ప్రకారం ఈ క్రింది విధంగా ఆజ్ఞాజారీ చేసినటు గజెట్‌లో ప్రకటించారు.

"1930 మే 30 వ తేదీ—మిసెస్ ఇ. లాయిడ్ జోన్స్‌కు చెందిన సయామీస్ పిల్లికి 1930 మే 28 వ తేదిన పుట్టిన ఒక పిల్లికూనను క్వారంటైన్‌లో నిర్బంధించవలసినది."

## స్టాలిన్‌గ్రాడ్ పౌరుడు

గత యుద్ధంలో సాహసోపేతంగా ప్రవర్తించిన మూర్కా అనే పిల్లి చరిత్ర ప్రసిద్ధికెక్కింది. 1942 శీతకాలంలో స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం జరుగుతున్నప్పుడు కొందరు సైనికులు శత్రువు ఎక్కడెక్కడ ఫిరంగి దళాల్ని ఉంచాడో కనిపెట్టేసి ఆ సమాచారాన్ని తమపక్షం వారికి తెలియజేయడానికి నిశ్చయించారు. వారికీ, శత్రువుకూ మధ్యఉన్న ఖాళీస్థలంలోంచి మానవమాత్రుడెవడూ ఫిరంగి కాల్పులను తప్పించుకుంటూ ప్రాణాలతో అవతలికిపోలేడు. కాని పిల్లి మానవమాత్రుడు కాదుగా. పైగా పిల్లికి 9 జీవితాలుంటాయంటారు. అందుకని మూర్కా అనే పిల్లికి ఆ సమాచారం వ్రాసిన పత్రాలను తాడుతో కట్టిపెట్టి పంపించారు. ఆ పిల్లి సురక్షితంగా దాటుకునివెళ్లి ఆ సైనికుల ప్రాణాలు దక్కటానికి కారణమైంది. దాని సాహసచర్య పేపర్లలో మొదటి పేజీల్లో ప్రముఖంగా ప్రచురితమైంది. దానిని స్టాలిన్‌గ్రాడ్ పౌరుడుగా గుర్తించి గౌరవించారు.

మరి మనుషులకు ఇంత మార్జాలద్వేషం ఎందుకో తెలియదు! (ఐ. పి. ఎస్.)★

# నక్షత్ర ఫలితాలు

**(30-4-58 మొదలు 6-5-58 వరకు)**

### గ్రహ స్థితి

| | | | |
|---|---|---|---|
| బుధ | రవి | | |
| శు | 30 తేదిని బుధ వక్ర త్యాగము. 4 న కర్తరీ ప్రవేశము సింహ, కన్యా, తుల, వృశ్చిక, ధనూ రాశులలో చంద్రుడు. | | |
| — | | | — |
| శ | | రాహు | |

### *అశ్వని [చూ, చే, చో, లా]*

ఈవారము ధనలోపమువల్ల యత్న కార్యములకు ఆటంకములు వచ్చును. మిత్రులుగా కనబడిన వారే సమయానికి సహాయము చెయ్యరు కాని మీరు సహాయాన్ని ఆశించని వ్యక్తివల్ల వారాంతానికి కార్యసిద్ధిపొందుతారు వర్తకులకు మొదట్లో నిరుత్సాహముగా వున్నా వారాంతమునకు లాభిస్తుంది ఉద్యోగస్తులు అధికారుల ఒత్తిడి భరించలేక శెలవు పెట్టవలసివస్తుంది. 30,1,2 తేదిలలో తెమలని కార్యక్రమము 3, 4, 5 తేదిలలో ఆటంకములు, ధనాభావము, ప్రయాణము, ఇంట్లోవున్న వారి ఆరోగ్య చింత 6 న మిత్రసహాయము, కార్యసిద్ధి నూతనులతో పరిచయము, విచిత్ర వస్తు సంపాదన.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈవారం కార్యాచరణలో ఆటంకాలు కలుగుతవి. అయినప్పటికి దైవముపై భారము వేసి వ్యవహరించడముచేత కార్యసిద్ధిని పొందుతారు. ఆత్మీయుల అనారోగ్యము కొంత ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్తులకు ట్రాన్స్ఫరు అయేసూచన లున్నవి. వర్తకులకు అస్థిమితము 30,1,2 తేదిలలో కార్యాచరణకు ప్రయత్నములు 3 న ఆటంకములు 4 కార్యలాభము 5 ఆరోగ్యచింత 6 న ధనలాభము.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈవారము ఆశించిన డబ్బు చేతికందకను, ఖర్చులు ఎక్కువగుటచేతను బంధువుల రాకపోకలచేతను, అశాంతి కలుగుతుంది. పరోపకారముకొరకు పాటుపడి, మాట దక్కక నిందలపాలౌతారు. కోర్టు వ్యవహారములు కొంత అనుకూలిస్తవి. ఉద్యోగసులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారములపట్ల పేచీల చే అశాంతి. భార్యకుగాని ఇంట్లో మరే ఇతర స్త్రీకిగాని ఆరోగ్యభంగము కలుగుటచే ఆందోళన. 30, 1, 2 కార్యభారము త్రిప్పట 3 న ధనాభావము, ఆటంకములు 4 కార్యలాభము 5 వివాదములు, ఆరోగ్యచింత 6 మనశ్శాంతి ధనయోగము.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము అనుకున్నట్టుగాపనులు జరగవు. ధనాభావముచే ఇబ్బందికలుగుతుంది. బంధువులకు సహాయముచేయబోయి జరగక మాటపడి

## బి. నరసింగరావు

మనోవ్యధ పొందుతారు. యంత్రములవల్లగాని, వాడిపనిముట్లవల్లగాని ప్రమాదము కలిగె సూచన జాగ్రత్తవల్ల తప్పవచ్చును. యంత్రములు నడుపు నిపుణులకు రసాయన శాస్త్రజ్ఞులకు గనులయజమానులకు, భూస్వాములకు, కష్టముతో కూడినలాభము. 30,1,2 తేదిలలో కార్యాలోచన 3 న ఆటంకములు, నిందలు 4 న కార్యలాభము 5 ప్రమాద సూచన 6 న బంధుసహాయము, ధనలాభము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈవారము మీకు యోగ్యప్రదము గత రెండువారములనుండి కలుగుతూవున్న ఆటంకములను గడిచి అధికారుల సహాయము చేతను, మీ పలుకుబడి ఉపయోగించుకొని కార్యసిద్ధినిపొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. 30,1,2 తేదిలలో తొందరుతగ్గి కార్యక్రమము ఒక దారిని పడుతుంది. 3 న ప్రయాణము 4 అధికారులు ఆదరణ, కార్యసిద్ధి 5 అలసట 6 న ధనలాభము, బంధు దర్శనము కవులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగకాలము. ఉన్న ఇబ్బందులు తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది కోర్టు వ్యవహారములు అనుకూలనుగా తీర్పు అవుతాయి. పిలల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లుచేస్తారు నూతన కార్యములు ప్రారంభిస్తారు. పండితులతో జ్యోతిషగోష్ఠి జరుపుటచే నూతనాంశాలు తెలుసుకుంటారు. 30, 1, 2 తేదీలలో ధనయోగము, కార్యసిద్ధి 3 న నూతన కార్యాలోచన. 4, ఉద్యోగస్తులకు అధికారవృది. 5 న ఎక్కువ ఖర్చులు. 6 న పండితగోష్ఠి ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము

### * పునర్వసు [కే, కో, హ, హి] *

ఈవారము మీ ఆర్థికస్థితి, పదవి ఎక్కువవుతాయి బంధువులను కలుసుకుంటారు. కవులతోనూ గాయకులతోనూ వినోదిస్తారు. ఇంట్లోవారు ఆరోగ్యం కోలుకుంటారు. దూరస్థులైన ఆప్తుల క్షేమము తెలియుటచే ఆందోళన తొలగుతుంది. ద్రవపదార్థములు, ప్రత్తి, దూది, బియ్యము, వెండి వ్యాపారసులకూ లాభము. కవులకూ, గాయకులకూ నటీనటులకూ యోగకాలము 30, 1, 2 కార్యసిద్ధి, ధనయోగము, ఉద్యోగస్తులకు అనుకూలము. 3 న అధికఖర్చులు 4 న కవితాగోష్ఠి, వినోదము, మృష్టాన్నభోజనము. 6 న కుశల వార్త.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈవారము మీకు యోగదాయకము. గత వారము అసంపూర్తిగా నిలిచిన కార్యములు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు. నూతన ఉద్యోగలాభము కలుగుతుంది. బంగారము, వజ్రములు, నూలు, బట్టలు వ్యాపారస్తులకు క్రయ విక్రయములలో లాభము. వాహనయోగము, శయ్యాసుఖము కలుగుతవి. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 30, 1, 2 తేదీలలో కార్యసిద్ధి, ధనయోగము, నూతనోద్యోగ లాభము. 3 న ఖర్చులు. 4 శుభకార్యచింత విందు, వినోదము. 6 న వాహన యోగము.

### * ఆశ్రేష [డి, డూ, డే, డో] *.

ఈవారము మీకు కార్యభారముఎక్కువ మీకు కలిగిన డబ్బు ఇతరులకు ఇచ్చినది సమయమునకు మీకు తిరిగిరానందున వ్యధచెందుతారు. వింతవార్తలను వింటారు. పరాక్రమమువల్ల ఘనతకలుగుతుంది. రాజకీయ కను



# నక్షత్రఫలితాలు



లలో ప్రయాణమువల్ల ధనలాభము పొందు తారు. త్రిప్పటచే అకాలభోజనము చేయుటచే శరీరములో వేడి, కళ్లు మంట వంటి అనారోగ్యసూచనలు కనబడగానే ఔషధ సేవవల్ల మేలుకలుగుతుంది. 30, 1, 2 తేదులలో కార్యక్రమము, ధనాభావము. 3 న అనారోగ్యము. 4 న ప్రయాణము! 5 ఆటంకములు. 6 న ధనలాభము, కార్యసిద్ధి.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈవారము మీకు అంత యోగదాయకము కాదు. మిత్రులెవరో శత్రు లెవరో తెలుసుకోలేకపోతారు. కార్యసాధనలో అనేక ఆటంకములు కలుగుతాయి. వ్యాపారస్తులు దిగాలను పొందుతారు. ఉద్యోగస్తులకు బదిలీ కావచ్చును. మనస్సు చంచలముగా వుంటుంది. వారాంతమున ప్రయాణము చేయుచున్నప్పుడు కలిసిన మిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి పొందుతారు. 30. 1, 2 కార్యభంగము. 3 ప్రయాణము. 4, 5 చంచలస్థితి, బదిలీసూచన. 6 న మిత్ర సహాయము, కార్యసిద్ధి.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ]

ఈవారము మీకు మిశ్రమ యోగము. స్త్రీలతో కలహామువల్ల విరక్తిచెందుతారు. యత్న కార్యములకు ఆటంకములు కలుగుతాయి. మీరు దైవముపై నమ్మకముకలిగి వ్యవహరించడమువల్ల నష్టద్రవ్యలాభమును పొందుతారు. తీర్థయాత్రలలో చిత్రవిచిత్ర వస్తువులను చూస్తారు. అమితముగా భుజించుటవల్ల శరీరపీడ కలుగుతుంది. 30, 1, 2 అనిశ్చిత కార్యక్రమము. 3 న కలహము. 4 ధనలాభము. 5 ప్రయాణము. 6 దేవతా దర్శనము, వింతవస్తువులను చూచుట, రాజవార్తా ప్రసంగము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈవారము బుద్ధిమాంద్యము ఎక్కువగా వుంటుంది. తలచిన కార్యములలో జయము లేకపోవుట, వ్యర్థముగా తిరుగుట, సజ్జనులతో విరోధమువంటి చెడ్డఫలితాలు కలుగుతాయి. అపరదినుసులు, ఉప్పు, నూనె, నువ్వులు వ్యాపారస్తులకు లాభము. ఉద్యోగస్తులకు తోటివారితో సరిపడక శెలవుపెట్టవలసి వస్తుంది. 30, 1, 2 కార్యభంగము. 3 న విరోధము. 4 వ్యాపారస్తులకు లాభము. 5 న శెలవుపెట్టుట. 6 న అనుకూలము. కోర్టు వ్యవహారములలో జయము.

### —ధరలు:—

నూలు, వస్త్రములు, పత్తి: నిలకాటుగా వుండును.

నూనె దినుసులు: సులభమగును.

పంచదార: మార్పు లేదు.

బెల్లము, చింతపండు: క్రమముగా హెచ్చగును.

ఆహారధాన్యములు: మందముగా వుండును.

పప్పుదినుసులు: కొంచెము చురుకగును.

వెండి, బంగారము: సులభము.

ఎండలు మెండుగా వున్నను మధ్య మధ్య గాలితోకూడిన వర్షములు అప్పుడప్పుడు పడుచుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, విష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.




### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మీకు అంతయోగదాయకము కాదు. ప్రతిపనికీ ఆటంకములు కలుగుతాయి. కాని పట్టుదలతో ప్రయత్నించి తుదకు జయముపొందుతారు. అనుకున్న డబ్బు సమయమునకు రాకపోవుటవల్ల సోదరులకు సహాయము చేయలేక విచారము పొందుతారు. ఉద్యోగస్థులకు అధికారులపోటు మాటలవల్ల మనోవ్యథ. కురుపులు వేయుటగాని, అవయవములకు దెబ్బలుతగిలే ప్రమాదముగాని వుంటుంది. రసాయనిక శాస్త్రజ్ఞులకు, పోలీసుశాఖలో వారికి భూస్వాములకు శ్రమఎక్కువైనా మేలుగావుంటుంది. 30, 1, 2 తేదీలలో త్రిప్పట, శ్రమ. 3 న ధనలోపము. 4 కార్యలాభము. 5 ప్రమాదము, మనోవ్యథ. 6 అన్నిరంగములలోనూ తృప్తి.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము మీ పలుకుబడివల్ల కార్యానుకూలత పొందుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. నూతన మిత్రలాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు. జ్యోతిషవిద్యాగోష్ఠి జరుగుతుంది. డాక్టర్లకూ

గణితశాస్త్రజ్ఞులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 30, 1, 2 కార్యానుకూలత ధనయోగము 3 న అధిక ఖర్చులు. 4 విద్యాగోష్ఠి, 5 బద్ధకం 6 న ఈశాన్య దిక్కునుండి శుభవార్త.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు ధనయోగము; భాగ్యవృద్ధి అవుతుంది. యత్న కార్యములు సిద్ధిస్తాయి. కోరు వ్యవహారములు అనుకూలమవుతవి. పండిత గోష్ఠివల, ఉత్తమ గ్రంథపఠనమువల్ల విజ్ఞానాభివృద్ధి పొందుతారు. పిల్లల క్షేమాభివృద్ధి సంతోషము నిస్తుంది. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము. 30, 1, 2 ధనాదాయము కార్యసిద్ధి 4 న పండితగోష్ఠి 6 న ఉద్యోగస్తులకు యోగం.

## *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము మీరు తలపెటిన కార్యములు నెరవేరుతాయి ఆర్థిక స్థితి బాగుంటుంది. బంధు మిత్రులతో కలిసి వినోదాల్లో పాల్గొంటారు. దక్షిణ దిక్కునుండి శుభవార్త వింటారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి వ్యాపారస్తులకు యోగకాలము. విద్యార్థులకు పరీక్షాఫలితాలు అనుకూలిస్తాయి. కవులకు, గాయకులకు, కళాకారులకు మేలుకాలము. 30, 1, 2 తేదిలలో కార్యసాధన 3 న మానసికాందోళన 4 ధనలాభము 5 న చాంచల్యము 6 న శుభవార్త.

## *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము ఉద్యోగ రీత్యా హోదా, ఆదాయము ఎక్కువవుతాయి. గతవారము అసంపూర్తిగా వుండిపోయిన పనులు ఈ వారము పూర్తి అవుతవి. పరోపకారమునకు పాటు పడతారు. కోరు వ్యవహారములు సుముఖ మవుతాయి. నూతన గృహ నిర్మాణమునకు ప్రారంభిస్తారు. స్త్రీలకు అలంకార ప్రాప్తి, విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు లాభము పొందుతారు. కవులకు, గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము 30, 1, 2 ధనలాభము, కార్యానుకూలత 3 ప్రయాణము 4, 5, 6 శుభకార్యములలో పాల్గొనుట, విందు, వినోదము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము ఆదాయాభివృద్ధికి ధైర్యముతో మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తవి. కార్యభారము ఎక్కువవుతుంది. ప్రభుత్వ వార్తాప్రసంగములు, వింతవార్తలు వినుట, పరాక్రమమువల్ల ఘనత సంపాదించుటవంటి



# నక్షత్రఫలితాలు

కార్యములలో నిమగ్నులవుతారు. శరీరములో వేడివల తలపోటు, కళ్ళు మంట మొదలగు అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధసేవ చేయుట మేలు. ఉద్యోగస్తులకు బదిలీ సూచన లున్నవి. వర్తకులకు రావలసిన సొమ్ములు వసూలుకాక ఇబ్బంది. 30 1 2 తేదీలలో రాజకీయములలో జయం, ధనలాభం. 3 న బదిలీ ఆయే సూచన. 4 న కార్యానుకూలత. 5 న అనారోగ్య సూచన. 6 న ప్రయాణమువల్ల లాభము.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము నిలకడలేని ఆలోచనలతో సతమతమవుతారు. ధనలోపమువల్ల ఇబ్బంది. శ్రమపడి నప్పటికీ మాటదక్కదు. గృహమందున్న ముసలివారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆకస్మికముగా కలుసుకున్న మిత్రుని సహాయమువల్ల వారాంతమున చిక్కులు తొలగి ఫలసిద్ధిని పొందుతారు. అనుకోకుండా ప్రయాణము చేయవలసి వస్తుంది. వర్తకులకు వారాంతమున లాభము. 30 1 2 లలో అమితఖర్చులు, 3 న కార్యరంగములో ఆటంకములు, 4 ప్రయాణము, మిత్ర సమాగమము, కార్యసిద్ధి, 5 ఆరోగ్య చింత. 6 లాభయోగము.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము మీకు మిశ్రమయోగం. అనుకున్నట్లుగా పనులు జరగవు. ధనలోపమువల్ల గృహావసరములు తీరక కలతలు. కోరిన సహాయము లభించదు. దైవముపై భారమువేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. వర్తకులకు మొదట్లో త్రిప్పట ఆశాభంగం కలిగినను వారాంతమున లాభం, 30 1 2 తేదీలలో పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మ వికాసము. 3 న ధనలోపము, కలతలు. 4 మిత్ర సహాయము. 5 చెడ్డ వార్త వినుట, 6 న ఆకస్మిక ధనలాభము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము కార్యభారముచే శ్రమ ఎక్కువ. ఇతరులకొరకు శ్రమపడినను చేసిన ప్రయత్నము కాకపోవడమువల్ల మాట పడతారు. కోర్టు వ్యవహారం మీ పరముఅయినా ఖర్చులు ఎక్కువగుటచే ఆ సంతోషము వుండదు. భార్య అనారోగ్యము ఆందోళన కలిగిస్తుంది. అన్నివిధాలా అసంతృప్తిగావుంటుంది. 30, 1, 2 పరోపకారము, ఆటంకములు. 3 న కార్యభారము. త్రిప్పట, 4 న కార్య లాభము. 5 న ఆరోగ్యచింత. 6 న లాభయోగము.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈవారము మీ ప్రయత్నములు ఫలించక అనేక చిక్కులకు లోనౌతారు. పట్టుదలతో ధైర్యముగా కార్యరంగమునకు దిగి తుదకు ఫలమునుసాధిస్తారు. తోబుట్టువులసహాయము వల్ల చాలావరకూ ధనలోపము తీరుతుంది. అధికారుల ఒత్తిడిచే ఉద్యోగస్తులకు మనోవ్యధ. యంత్రములు, అగ్ని మొదలగువాటి వల్ల కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకు ఖనిజములు, లోహములు వ్యాపారస్తులకు మేలుకాలము. 30, 1, 2 లలో తీరికలేని కార్యక్రమము. 3 న కార్యభంగము, 4 న బంధు సహాయము 5 న ప్రమాదభయం. 6 న కార్యలాభము.

## *ధనిష్ఠ [గా, గీ, గూ, గే]*

ఈవారము మీ బుద్ధిబలముచే మీ ఆశయాలను కార్యరూపములో పెట్టి ఫలమును సాధిస్తారు. జ్ఞాతులవల్ల కార్యసహాయము, ధనసహాయము కూడా కలుగుతవి. ఈశాన్యదిక్కునవున్న రక్తబంధువుల క్షేమవార్త వినుటచే సంతోషమును పొందుతారు: ఉద్యోగసులకు హోదా పెరుగుతుంది. విద్యార్థులకు పరీక్షలలో జయము. వైద్యులకు లాభము. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. 30, 1, 2 ఆలోచనలు తెగని కార్యక్రమము. 3 న బడికము. 4 మిత్రసహాయము, 5 న ప్రయాణము. 6 వ ధనలాభము, కార్యసిద్ధి.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము ఉత్సాహముతో కొత్త పనులను మొదలు పెడతారు. ధనాదాయము ఎక్కువవుతుంది. కోర్టు వ్యవహారములు లాభిస్తాయి. పిల్లల అభివృద్ధికి అవసరమైన కార్యక్రమము ఏర్పాటు చేస్తారు. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. విద్యార్థులకు జయము కలుగుతుంది. 30, 1, 2, తేదీలలో పండితగోష్ఠి, విజ్ఞానవృద్ధి. 3 న తీరికలేని కార్యక్రమము. 4 ధనలాభము. 6 న కార్యసిద్ధి. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకూ, నటీనటులకూ వారమంతా యోగము.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

గత వారముకన్నా ఈ వారము మీ ఆర్థికస్థితి ఎక్కువవుతుంది. తలపెటిన పనులు అనుకొన్నటు నెరవేరుతాయి. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి గానసభలు మొదలగు వినోదములలో పాల్గొంటారు. మృష్టాన్నభోజనము ఆరగిస్తారు. విద్యార్థులకు పరీక్షలలో జయము, బియ్యము, నూలు, బటలు, వెండి సరుకుల వర్తకులకు 30,1.2 తేదీలలో లాభము. 3 మానసికాందోళన. 4 వినోదములు, విందు 6 వ కార్యలాభము.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, ధా] *

ఈ వారము మీరు తలపెటిన కార్యము, ఫలిస్తాయి. ధనలాభము అనుకున్న దానికన్నా ఎక్కువవుతుంది. సాంఘికముగా మీకు కీర్తి కలుగుతుంది. పుణ్యకార్యములు చేస్తారు. మీకు వాహన యోగము, మీ భార్యకు అలంకార ప్రాప్తి పట్టుబటలు, బంగారము, వజ్రములవంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకులాభము. 30,1,2 తేదీలలో కార్యానుకూలత. 4 న పుణ్యకార్యాచరణ, కీర్తి, 6 న ధనలాభము.

## * రేవతి [దే, దో, చా, చీ] *

మీ ఆదాయము ఈవారము వృద్ధిపొందుతుంది గాని మొదట్లో అందునుగురించి చేసే ప్రయత్నాలకు విఘ్నములు కలుగుతాయి. గృహకలతలు వస్తాయి. అకాలభోజనమువల్ల అనారోగ్యము సూచనలు కనబడగానే గ్రహరాజైన రవికి శాంతి చేయించండి అన్నివిధాల మంచిది. ఉద్యోగసులకు బాధ్యతతో కూడిన అధికారవృద్ధి 30.1,2 తేదీలలోకలుగుతుంది. 3 న విఘ్నములు, 4 కార్య లాభము 5 న అనారోగ్య సూచన 6 ధన లాభము. ★



# వనితాలోకం

## స్వార్జితము



ఆ వేళ శనివారం. పత్రికవారు పంపారని 5 రూపాయలు ఇచ్చి వెళ్ళాడు పోస్టు బంట్రోతు. అది నేను పత్రికకు వ్రాసిన దానికి ప్రతిఫలం. అంటే అది నా స్వార్జితం అన్నమాట! మధ్యాహ్నం మావారు భోజనానికి వచ్చినప్పుడు రు 5 లు వచ్చినట్లు తెలియజేశాను. నీ స్వార్జితాన్ని నీయిష్ట మొచ్చినట్లు వుపయోగించుకో. నాకేమీ అభ్యంతరం లేదని అని ఆయన చెప్పారు. భోజనం అయినతర్వాత కాస్సేపు కార్డ్స్ ఆడుకొన్నాము. తర్వాత విశ్రాంతి కావాలని వారు పడుకోడానికి వెళ్లారు. ఏమీ తోచక ఆ వారం పత్రిక చదవడానికి వుపక్రమించాను. కాని సాగలేదు. అదేమో ఆ వేళ చదవడానికి బుద్ధిపుట్టలేదు.

అంతలోనే ఆయన అన్న మాటలు జ్ఞాపకమొచ్చాయ్. అవును! నా స్వార్జితాన్ని నాఇష్ట మొచ్చినట్లు వుపయోగించాలి. సరే! నా రు 5 లతో ఏమికొందామని ఆలోచిస్తూ కూచున్నాను. మొటమొదట నాకు సెంటు బాటిల్ కొందామని తోచింది. ఎందుకంటే మావారికి వీటిపైన అభిరుచిలేదు. ఇంటికి సెంట్స్ ఏమీకొని తీసుకొనిరారు. ఇది నాస్వార్జితం కాబట్టి, నేనేమికొన్నా వారికి అభ్యంతరం వుండదు. కాబట్టి సెంట్స్ కొనాలని తీర్మానించుకున్నాను. కాని మరో క్షణంలోనే ఆ తీర్మానాన్ని విరమించుకున్నాను. ఆయన అభ్యంతరము పెట్టినంత మాత్రాన ఆయనకు ఇష్టములేని వస్తువును కొనడం నాకు సబబుగా తోచలేదు. అదీగాక, నా స్వార్జితంతో శాశ్వతంగా జ్ఞాపకముండే వస్తువు నేదైనా కొనాలని పించింది నాకు.

ఇక పోతే, ఏవైన పిండివంటల పుస్తకాన్ని కొనాలనుకొన్నా, కాని అదికూడ నచ్చలేదు. మామూలు వంట చేసుకోలేక సతమతమవుతున్న నేను ఇక పిండివంటలు ఎప్పుడు చేయగలను? అదీకాక, జీతం వచ్చిన తర్వాత అడిగితే ఆయనే కొనిస్తారు. ఈమాత్రం దానికి నాకష్టార్జితాన్ని ఎందుకు వృధాచేయాలనిపించింది.

ఇంతలోనే రెండేళ్ళ మాచిట్టితల్లి సునీత లేచింది. అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. పాపకు మంచి ఫ్రాకు ఒకటి కావాలని. కాని అది కూడ నాకు తృప్తినివ్వలేదు. పాప తండ్రి పాపకు తప్పనిసరిగా ఫ్రాకుకొంటారు. నా డబ్బులో నేను కొనవలసిన అవసరం లేదనిపించింది.

నా ఆలోచనలకు బ్రేకుపడింది. వారు నిద్రనుంచి లేచారు. వారికి పకోడీలు చేయడానికి వెళ్ళాను. వారు ఆఫీసుకు వెళ్ళిన తర్వాత పనివారు వచ్చారు. తర్వాత నేను వంటపనిలో మునిగిపోయాను. ఇలాగ రాత్రి

శ్రీమతి మంగళా కందూర్

8 గంటలదాకా ఏదో పనితోనే సరిపోయింది. తిరిగి ఆలోచనకు పూనుకొన్నా. పోనీ భోజనం చేసే టేబిలుకు ఒక క్రొత్త rexene కొందామనిపించింది. కాని అది కూడా వృధాయేననిపించింది. ఇంకో నాలుగు రోజులు పోతే ఎలాగు ఆయన క్రొత్తది కొంటారు.

ఆయన ఆఫీసునుంచి వచ్చారు, భోజన సమయంలో రోజూలాగ వారితో కబుర్లాడ బుద్ధివేయలేదు. ఆలోచిస్తూ అన్నం తింటున్నాను. 'అబ్బ! ఇవాళ ఏవూరుపాపయిందో మారాణీగారు మౌనంగా వుండడం నేటికి చూచాను' అని అన్నారు. ఆయన వేళాకోళ మాడినా నేనేమీ సమాధానం చెప్పకుండా మౌనంగా నేవుండడంవల్ల తిరిగిఆయనే ప్రశ్నించారు. 'ఎందుకలా మౌనంగా వున్నావు? నాతో చెప్పకూడదా?' అని నేను వారికి నా ఆలోచన సంగతి చెప్పాను. ఆయన నవ్వి అన్నారుకదా? "దీనికి యింత ఆలోచన ఎందుకు మంగళీ (హుషారుగా వున్నప్పుడు వారు ఇలానే అంటారు) రేపు ఎలాగూ ఆదివారంకదా! ఆ డబ్బు నాకిచ్చెయ్. నేను క్లబ్‌లో హాయిగా పేకాట ఆడుకొంటాను," అని. నాకు భలేకోపం వచ్చింది. "మంగళీ లేదు! గొంగళీ లేదు! నేను నా జన్మలో నాస్వార్జితాన్ని మీ పేకాటకు ఇవ్వను. నాస్వార్జితం నాకే వుపయోగపడాలి" అని జవాబిచ్చాను. ఆయన చిరునవ్వుతో అవును "నీ స్వార్జితం నీకే వుపయోగపడాలి నా స్వార్జితం నాకే వుపయోగపడాలి. ఇక నెల నెల జీతం నేనే వుపయోగించుకొంటాను" అని అంటూ పకపకా నవ్వారు. నేను మాట్లాడకుండా భోజనం ముగించాను.

మరుసటిరోజు ఆదివారం. ఆ వేళ మాకు సినిమా ప్రోగ్రాము వుంది, టిఫిను తినేటప్పుడు వారన్నారు 'పోనీ ఈరోజు పిక్చరుకు నీడబ్బుతో తీసుకెళ్ళు మంత్ ఎండింగ్ కదా! నాకుకూడ డబ్బుకు కొస్త కష్టంగా వుంది నేను ఒప్పుకోలేదు.

మ్యాటినీషోకు 'భూకైలాస్'కు వెళ్లాము. ఎందుకైనా మంచిదని నా 5 రూపాయలను 'పిల్లిబొచ్చు పర్సులో' (పంజాబీ ఫ్రెండ్ ప్రెజెంటు చేసింది) వుంచుకొని సినిమాకు బయలుదేరాను. మావారి కన్ను నా డబ్బుపైనే వుంది కాబోలు! టికెటుకొనేటప్పుడు అడిగారు 'మంగళా! తిరిగీ అడుగుతున్నా! నీ డబ్బిస్తే టికెట్టు కొనితెస్తానని నేను సమాధానం చెప్పకుండా థియేటర్ లోకి వెళ్లా.

విశ్రాంతి సమయంలో కూడ 'నీడబ్బుతో కూల్ డ్రింక్ ఇప్పించవూ' అంటూ చిన్నపిల్లవాడికి మల్లే పీడించారు. నాకు భలే విసుగనిపించింది. ఇదేమి సమస్యరా బాబూ!

(47 వ పేజీ చూడుడు)

# మా కాశీయాత్రవిశేషాలు

భోగరాజు సత్యవతి

మేము ఈమధ్యనే కాశీయాత్రచేసి వచ్చినాము. మా యాత్రావిశేషములు కాశీలో మేము చూచినవాటిగురించి సంగ్రహంగా చెబుతాను. మేము మొట్టమొదట జబల్‌పూరువెళ్ళి అక్కడ రెండురోజులు ఉండి, కాశీకి బయలుదేరినాము. ఇక్కడ నర్మదా నది పాలరాతి కొండలలో పుట్టి ఆ కొండలలోనే ప్రవహించుచున్నది. నదీతీరమున గాంధీజీ స్మారకచిహ్నము నెలకొల్పినారు. అది చూడముచ్చటగానున్నది. ఆంధ్రదేశములో 'కొండపల్లి' పట్టెబొమ్మలకు ప్రసిద్ధి చెందినట్లు ఈపూరు రాతిబొమ్మలకు ప్రసిది.

ఇక్కడ పాలరాతితో బొమ్మలు, మన యెదుటనే యేమాదిరి కావలెనో అటుల తయారుచేసి యిచ్చెదరు. తాజ్ మహల్, శివలింగములు, కుంకుమభరిణెలు మొదలగునవి చాలాబాగా చేస్తారు. ఇక్కడ రెండురోజులున్నాము. రాత్రి 1 గంటకు బొంబాయి కాశీఎక్స్‌ప్రెస్సు జబల్‌పూర్‌లో బయలుదేరును. మా భర్తగారు, నేను, యిద్దరుపిల్లలు ఆబండిలో బయలుదేరినాము. బండిలో స్థలము లేదు. మాకు హిందీరాదు. ప్రయాణము యెటులసాగునోయని ఆందోళన చెందినాము. బండిలోవారంతా మరాటీ, గుజరాతీ, బెంగాలీవాళ్లు. మగవాళ్ళపెట్టిలో యెక్కినాము. వారితో కాలక్షేపమునకు యేదైనా పిచ్చాపాటి మాట్లాడుదామంటే వారలకు ఇంగ్లీషు, తెలుగు అర్థముకాదు. భాష రాకపోయినను సంజ్ఞతో స్థలముకావలెను అని చూపించితే వాళ్ళుకొంచెము జాగాయిచ్చినారు. క్రింద బెడ్డుపరచి పిల్లలను పడుకో పెట్టినాను. బర్తుమీద ఆయనకూర్చున్నారు. ఇక్కడివారు మర్యాదస్థులు. మాప్రక్కన కూర్చున్న మగవాళ్లు చిలుము. గంజాయి మొదలగు మత్తుపదార్థములను పీల్చడము మొదలుపెట్టినారు. వాళ్ళనుచూచి నేను చాలా భయపడ్డాను. ఆవాసన భరించలేక కొంగు ముక్కుకు అడ్డుపెట్టుకొంటే వాళ్లు నన్ను చూచి కొంచెము ప్రక్కగాపీల్చినారు.

మా అబ్బాయి చాలా అల్లరిపిల్లవాడు. పెట్టెలోని వాళ్ళందరిని పటప్ అంటే వాళ్ళంతా చాలా సంతోషముతో మళ్ళీ అంటూవుండేవాళ్ళు. మరి కొంచెముసేపటికి నిద్రపోయినాము. తెల్లవారినదాకా అటులనే గడిపినాము. రాత్రి చాలా చిన్న స్టేషన్సుదాటి అలహాబాద్ పగలు 8 న్నరకు చేరినది. అలహాబాద్ అంటే ప్రయాగ క్షేత్రం. ఇక్కడ గంగా, యమున, సరస్వతి, యీ మూడునదులు కలుస్తాయి. అందుచే త్రివేణీ సంగమమనికూడా అనెదరు. ఇచ్చట దిగుటకు మాకు వీలు లేకపోయినది. అలహాబాద్‌లో చాల బట్టలమిల్సు కలవు. పెట్టెలో కూర్చుంటేనే కన్పించును. కాని నల్లటి పింగాణీబొమ్మలు వివిధరకములు తయారుచేసే ఫ్యాక్టరీఉంది. సేషన్‌లోనే బొమ్మలు అమ్మవచ్చాయి. సింహములు అగరవత్తులు పెట్టుకొనే కూజాలు, అశోక స్తంభములు మొదలుగునవి చాలా చౌకగా అమ్మెదరు. పగిలిపోతాయని మా వారు వలదని అంటూయున్నా నేనే బేరంచేసికొన్నాను. ఈ సేషన్ చాలా పెద్దజంక్షన్. రోజుకు కనీసం 25, 30 యక్స్‌ప్రెస్సులు యీ స్టేషన్ మీదుగా పోతాయి.

మరికొన్ని స్టేషన్సుదాటి బండి, మొగల్‌సరాయిసేషన్ చేరినది. ఇక్కడకూడా రోజుకు 40 లేక 50 యక్స్‌ప్రెస్సులు యీ స్టేషన్‌మీదుగా పోవును. వందలైన్సు కలవు. 5. 6 బండ్లు ఒకేమారు పోవుచుండును. 78 స్టేషనులు దాటినపిదప కాశీస్టేషను వచ్చినది. కాశీకియాత్రీకులు వచ్చుచుందురని కాశీనుంచి పండాలు మొగల్‌సరాయిస్టేషన్‌లో మనని అటకాయించి మా బసలో మీకు అన్ని సౌకర్యములు కలుగచేసెదమని బలవంతముచేసి తీసుకొని వెళ్ళెదరు. బియ్యం వండుకొనే పాత్రలు యిచ్చి అచ్చట మనము యిచ్చే దానములన్నియు పట్టె డబ్బు చాలాగుంజుతారు. ఈ పండాలు అన్ని భాషలూ మాట్లాడుతారు. బాగా

## పిల్లల ఫ్రాకులమీదకు.

వీటికి ఈ క్రింది పట్టికప్రకారం ఆ యా రంగుల దారాలు వాడితే బాగుంటుంది:



1—886 ఎరుపు.
8—834 లైట్ పింక్.
4—898 నీలం.
5—887 పసుపు.
T—పింక్ ప్లెయిన్. (సాదా)



1—నెం. 886 ఎరుపుదారం.
2— ,, 885 పింక్.
4— ,, 893 నీలం.
5— ,, 897 పసుపు.
7— ,, 898 నారింజ.
10— ,, 881 గోధుమ.
T— పింక్ ప్లెయిన్. (సాదా)
B— బ్లాక్ ప్లెయిన్. (సాదా)

—ఎం. ఎ. లక్ష్మి, (వాల్తేరు)

# అప్లికే



ఆప్లికే ఎలాటి బట్టమీద కుట్టినా అప్లికేకు కత్తిరించుకొనే బట్ట మాత్రం కాటన్‌లాటి మందపాటి దయితే బాగుంటుంది. మొదటి డిజైను కుట్టేందుకు ఆకుపచ్చ రోజారంగులలో బట్ట కావాలి. డిజైను మధ్యవున్న ఆకును ఆకుపచ్చ బట్టమీదపెట్టి అవుట్లయిను ప్రకారం కత్తిరించుకోవాలి. ఈ కత్తిరించుకున్న ఆకును మనం కుట్టబోయే బట్టమీదవుంచి షేపు చెడకుండా సన్నగా టాకాలు వేసుకోవాలి. తర్వాత ఎంబ్రాయిడరీ ఫ్రేములో బిగించి ఆకుపచ్చదారంతో చుట్టూ సన్నగా కాజా కుట్టు (బటన్‌హోల్ స్టిచ్) కుట్టాలి. అవుట్ లైను అంతా కాజాకుట్టు కుట్టాక, టాకాలువేసిన దారం మెల్లిగా లాగెయ్యాలి.

మధ్య ఉన్న గీతలు లేత ఆకుపచ్చ దారంతో కాడకుట్టుతో గాని గొలుసు కుట్టుతో గాని కుట్టవచ్చు. పువ్వులు రోజారంగు బట్టలో కత్తిరించి అవుట్ లైను అంతా రోజారంగుదారంతో కాజాకుట్టు కుట్టాలి. లోపలభాగం ఎరుపుదారంతో కుట్టాలి. పువ్వులమీద ఉన్న ఆకులు ఆకుపచ్చ బట్టక త్తిరించి అప్లికే చేశాక డిజైను పూర్తవుతుంది. ఈ డిజైను టేబుల్ క్లాత్ మూలలకయితే బావుంటుంది.

రెండవ డిజైను చిన్న పిల్లల లంగాలకు బావుంటుంది. కుందేళ్ళను లేత నీలం బట్టతో అప్లికే చెయ్యాలి. కుందేళ్ళ కళ్ళను నల్లదారంతో కుట్టాలి. కుందేళ్ళ మధ్య ఉన్న అదాలు ఎవరికి నచ్చిన రంగులు వారు వేసుకు కుట్టవచ్చు.

మూడవ డిజైను పిల్లల ఫ్రాకులకు గాని, లేక వాళ్ళు వాడుకొనే టవల్సుమీదగాని, దిండు గలేబుల మూలలకుగాని బాగుంటుంది. పువ్వు ఎరుపు రంగు బట్టతోనూ ఆకులు, ఆకుపచ్చ బట్టతోనూ సీతాకోకచిలుకను కాఫీ రంగు బట్టతోను అప్లికే చెయ్యాలి. పువ్వుమధ్య పుప్పొడి పసుపురంగు దారంతో కుట్టాలి. సీతాకోక చిలుక మీద సున్నలు కనకాంబరము దారంతో ముద్దకుట్టు కుట్టాలి. గీతలు కాడకుట్టు కుట్టవచ్చు. ఇవి కుట్టేందుకు శ్రమ అనిపించినా, కుట్టిన తర్వాత చూస్తే చాలా బావుంటాయి.



డి. సౌజన్య.

# ★ మా కాశీయాత్ర విశేషాలు ★

కబుర్లు చెబుతారు. బాగా డబ్బు ఇచ్చేదాకా పీడిస్తారు. అయితే ఇప్పుడు ఈ బాధ అంతకనుపించదు. ఈ క్షేత్రములలో 66 ఘట్టములు కలవు. గంగానది పొడుగునా యీ రేవులు కలవు. హరిశ్చంద్ర ఘట్, మణికర్ణికాఘట్, విశ్వేశ్వరఘట్, దశాశ్వమేధఘట్, పంచగంగాఘట్ మొదలైనవి ముఖ్య ఘట్టములు. కాశీ అంతటా చాలా దేవాలయములుకలవు. అన్నియును వుత్తర హిందూదేశములో దేవాలయములన్నిటివలె ఒకే విధమైన శిల్పముతో కన్పించును. ప్రతివీధిలోను, సందులలోను, అరుగులమీదను బజారులలోను చిన్న చిన్న దుకాణముల మూలలను లింగాకారములే కన్పించును. చూచుకొన్న కొలది భక్తిభావముతో మనస్సు పరవశమొందును. ఆశ్చర్య సంతోషములతో అడుగుముందుకు వేయలేము.

విశ్వేశ్వరాలయ మంతా పాలరాతితో కట్టబడినది. శిఖరమునకు 22½ మళ్ళ బంగారపు రేకులతో తాపడము చేసినారు. ఆలయ ప్రాంగణములోనే మారేడు దళములు, బంగాళా బంతిపూవులు మాలలుకట్టి ఆకు దొన్నెలలోపోసి అమ్మెదరు. ఇచ్చట పూజారులు కొబ్బరికాయలు, అరటిపండ్లు మొదలైనవి తీసుకొనుట నైవేద్యముచేయుట మొదలగు లిచ్చుటయులేదు. మగవారికి నమకంచమకం మొదలైన మంత్రములు వస్తే మనమే అభిషేకములు చేసికొనవచ్చును. విగ్రహములను ముట్టుకోకూడదు అను నియమములేదు. మేము కొన్ని మారేడు దళములను శివునిపైవుంచి కొంచెము గంగా తీర్థముపోసి కొబ్బరికాయలు కొట్టి ప్రసాదము తెచ్చుకొన్నాము. పాలతో కూడా అభిషేకములు చాలామంది చేసెదరు.

ఈ ఆలయములోనే ఒకప్రక్క నరసింహాలయం, రామాలయం, నవగ్రహాలూ దుంఢు గణపతి మొదలైనవి కలవు. అన్నపూర్ణ ఆలయము ఈ ఆలయమునకు కొంచెము దూరమున ఉంది. కలకత్తా కాళీమాయి, లక్ష్మీనారాయణులు, నీలకంఠేశ్వరుడు పార్వతీదేవి. మరికొన్ని లింగాలు, అన్నపూర్ణ ఆలయములోనే వున్నవి. అన్నపూర్ణకు మిఠాయి నైవేద్యము చేసి మనము తెచ్చుకొనవలెను. ఇచ్చట ఆవులు దేవాలయములచుట్టూ తిరిగి అచ్చట పడిన పూవులు, ఆకులు మొదలైన వితిని కడుపు నింపుకొనును. కొన్ని ఆవులను, కొంచెము గడ్డి తెచ్చి ఒకప్రక్కన పెట్టి, - ఒక పైసకు దొన్నితో గడ్డి అన్నపూర్ణ ఆలయములో అమ్మెదరు-యాత్రికులు పైసాగడ్డికొనిగోసేవ కూడా చేసెదరు. అన్నపూర్ణ ఆలయములోనికి మనము వెళ్ళ వీలులేదు. కటకటాలకో కట్టివకట్టడము వద్ద నిలబడి దర్శనము చేసుకొనవలెను. 2,3 మైళ్ళ దూరములో కాలభైరవాలయమున్నది. ఈ ఆలయములో విగ్రహము శునకరూపమున కన్పించును. ఇచ్చట పాపపరిహారార్థం మంత్రములు చదివి నెమలి యీకల విసనకర్రతో మన వీపున చిన్న దెబ్బలు కొట్టి కాశీ తోరములు చేతికి కట్టెదరు. తోరములు కూడా యిక్కడనే దొరకును. నలుగురైదుగురు పురోహితులు కూర్చుని కొస్త తీర్థం చేతిలోపోసి పూలమాలలు మెడలోవేసి పైసలు దక్షిణలు యివ్వమనెదరు. దర్శనము చేసుకొని త్వరలో బయటపడవలెను. కాశీకి 5,6 మైళ్ల దూరములో వ్యాసకాశీ, పంచతీర్థ మరికొన్ని పుణ్యక్షేత్రములు కలవు. బోటు మీద గంగానదిలో బయలుదేరి యీ క్షేత్రములను చూడవచ్చును. కాశీ క్షేత్రములోని శివుడు హరిజనులు ప్రవేశించుటచే మైలపడినాడని ఆందోళన లేవదీసి 30 కోట్ల ఖర్చుతో అచ్చటి సేట్లు మరల ఆలయము కట్టుతున్నారు. మేము వెళ్ళిన రోజుననే ప్రతిష్ఠ జరిగినది. ఈ ఆలయ మంతయును పాలరాతితో కట్టుచున్నారు. గోడలమీద బుద్ధుని బోధ, కృష్ణార్జునుల సంవాదము, శంకరాచార్యులు, రామలక్ష్మణులు, వ్యాస మహర్షి మొదలగువారి ప్రతిమలూ, తులశీ రామాయణంలోని ఘట్టాలూ ఈ పాలరాతి గోడలపైన చెక్కినారు. ఈ చెక్కడములు చూచుచున్నప్పుడు ఎల్లోరా అజంతా శిల్పములు జ్ఞప్తికి వచ్చును. మేము చూచునప్పటికి రెండు అంతస్తులు పూర్తి అయినవి. 6 సంవత్సరములకు ఆలయనిర్మాణము పూర్తి అవుతుంది. ఇచ్చటకూడా పంచముఖేశ్వరుడు, పార్వతీదేవి, కుమారస్వామి, గణపతి మొదలైన విగ్రహముల ప్రతిష్ఠ జరిగినది.

టౌనులో ఇంకను దేవాలయములు కలవు. రామాలయం, రేణుకాదేవిగుడి, దురాబాయి ఆలయం మొదలైనవి కలవు. బెనారెస్ యూనివర్శిటీ చాలా పెద్దది. ఆ ఆవరణలో వివిధశాఖలకు విద్యార్థుల వసతిగృహాలు, ఆడపిల్లలకు కాలేజీ, లైబ్రరీ అధ్యాపకుల నివాసగృహాలూకట్టినారు. పండిత మదనమోహన మాలవ్యా కృషివలన ఇక్కడ కొన్ని వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు చదువుకొని వృద్ధిలోనికి వచ్చుచున్నారు. మాలవ్యా స్వర్గస్థులైనతరువాత వారికుమారులు యూనివర్శిటీ నిర్వహణలో ప్రముఖులుగా ఉండి పనిచేస్తున్నారు. ఈ విద్యాపీఠానికై 10 మైళ్ళ స్థలము ఒక సంస్థానాధీశ్వరుడు దానము చేసెనట. అచ్చటనే క్రొత్త యాశ్వరాలయము, యూనివర్శిటీ భవనము రెండునూ కలవు. విజయనగరం రాజుల కోటయు కలదు. ఇవి అన్నియు బెనారెస్ కంటోన్మెంట్ లోనే కలవు. కాశీ స్టేషన్‌కు వారణాశి అని పేరు పెట్టినారు. కంటోన్మెంటునకు వెడితేనే విశాలమైన వీధులు కాన్పించును. టౌను అంతా యిరుకు సందులూ మూడు అంతస్తుల భవనములు పైనించి, చెత్తపోయుచుందురు. సందులు దూడల పేడతోను, తంబాకు వుమ్మితోను నానా అసహ్యముగా యుండును. ఆ సందులను గల్లీలందురు. నడుచునపుడు యేమి మీద పడునోయని భయముగా యుండును. ఇంతటి పుణ్యక్షేత్రమైన కాశీ పట్టణములో ప్రజల ఆరోగ్యవిషయం హెల్తుడిపార్టుమెంటు తగిన శ్రద్ధ తీసుకొన్నట్లు కనిపించదు. సంవత్సరమునకు కొన్ని వేలమంది యాత్రీకులు వచ్చుచుందురు. దేవాలయములయందు నేల బురదతో జర్రు బుర్రుమని అనుచుండును. శుభ్రమైన బట్టలు కట్టుకొని వెడలినయెడల, అన్నీ బురదతో బయటపడుదుము. ఏమి అయినను గంగాజల మాహాత్మ్యమో కాక ఈశ్వరుని మహిమయో కాని అచ్చటి ప్రజలు కానీ యాత్రికులు కాని ఆరోగ్యముగానే బయల్పడెదరు. ఈ క్షేత్రం చూచుటకు 10 లేక 15 రోజులుపట్టును. ఈ క్షేత్రంలో ప్రతిపట్టణములో దొరకుచున్నట్లే యిచ్చట కూడా పట్టుబట్టలు, యిత్తడి సామాన్ల షాపులు, వెండి బంగారు వస్తువులు తయారు చేసి అమ్మెడిజ్యూలరీ షాపులు పిల్లలక్క పిడతలు ప్లాస్టిక్ సామానులు మొదలగునవి దొరకును. జరీ చీరలగురించి నేను వేరే చెప్పనక్కర లేదు. ★

# ★ వంటలు ★

## పేలాల వడియాలు

ఇది వేసవికాలం. ఎండలు మంచి తీవ్రంగా వుంటాయి. అందుచేత మనం. వడియాలు; అవకాయి. ఇటువంటి ఎండ వలసినవన్నీ ఈ కాలంలోనే పెట్టుకుంటాం. నేను మా అమ్మగారివద్ద నేర్చుకున్న కొన్నిరకాల వడియాలు చెపుతాను చేసి చూడండి. ముందు పేలాలతో చేసే రకాలు చెపుతాను.

ఒకటవది: దీనికి కావలసినవి రెండుశేర్లు పేలాలు. 1/16 శేరు. (పావు శేరులో నాలుగోవంతు) నువ్వుపప్పు. రెండు టీ స్పూన్ల సీమ మిరపకాయలకారం. ముందు పేలాలు, ధాన్యం, బెడ్డలు లేకుండా శుభ్రం చేసుకోవాలి. ఒక గిన్నెలో నీళ్ళుపోసి ఆ నీళ్ళలో ఈ పేలాలు వేసి బాగా కలిపి (అంటే పేలాలన్ని తడిసేటట్లు). ఒక పళ్ళెంలోకి తీసుకోవాలి. నీటిలో పేలాలు నాననివ్వకూడదు. వెంటనే తీసేయాలి లేకపోతే. వడియాలు ఎండిన తరువాత గట్టిగా వుంటాయి. ఆతడిపిన పేలాల్లో, నూ పప్పు; కారం వేసి, చేతో కలపాలి (కలపడంఅంటే అంటే పిసికేయ కూడదు). తరువాత. మట్టు వున్న. గిన్నెగానీ. చెంబుగానీ. లేకపోతే ఏదైన పాత్రకున్న. సీసామీద మూతగానీ తీసుకుని. చిన్నగుడ్డ తడిపి దానిమీద వేసి. నిమ్మకాయ సైజులో. పేలాలముద్ద తీసుకుని, తడిచెయ్యి చేసుకు. ఆబటమీద పెట్టి. అంటే పలుచగా కాకుండా. దళసరిగా. కాకుండా అదిమి. బటయొక్క కొసలతో సరిచేయాలి. ఒక చేటకి నూనెరాసి. దానిమీద వీటిని వరుసగా పెట్టుకుని. మూడునాలుగు రోజులు ఎండనిచ్చి. అటుపైని నూనెలో వేసుకుతింటే చాలా బావుంటాయి.

ఇదేవిధంగా వలేరు వేసికూడా పెటవచ్చు. వల్లేరు, మనం పెట్టే వడియాలనుబట్టి వేసుకోవాలి. ఇంతఅని చెప్పలేం. వలేరు తెచ్చుకుని. శుభ్రంగాకడిగి తడి ఆరినతరువాత చేతులకు బూడిదరాసుకుని (బూడిద రాయకపోతే చేతులకు దురద విపరీతంగా వుంటుంది) వల్లేరు సన్నగా. చెక్కు తరుగుకొని రోటిలో వేసి మెత్తగా దంచాలి. లేకపోతే. అట్ల కాడతో తోనూ రుబ్బాలి ఇది నలిగిన తరువాత పైన చెప్పినట్లు పేళాలు తడిపి అందులో ఈముద్ద నువ్వుపప్పు కారం, వేసి పేలా వడియాలు పెట్టినట్లుగానే ఇవి కూడా పెట్టాలి.

ఒక $\frac{1}{2}$ శేరు పేలాలు తీసుకుని శుభ్రంగా చేసి, ఒకపావుశేరు (బియ్యం దంచినపిండి) వరిపిండి ఒకపావుశేరు నీళ్ళతోతడిపి, పావుశేగు నీళ్ళు గిన్నెలోపోసి అవి మరుగుతున్నప్పుడు దానికి సరిపడినన్ని పచ్చిమిరపకాయలు, వుప్పుతీసుకు దంచి ఆమరుగుతున్న నీళ్లలో తడిపి వుంచుకున్న పిండివేసి, అది వుడుకుతున్నప్పుడు పచ్చిమిర్చి కారం వేసి, తడి చెయ్యిచేసుకుని చూసే చేతికి అంటుకోకుండా వున్నప్పుడు దించేసి అందులో అర్ధశేరు పేలాలు వేసి బాగాకలిపి పైన చెప్పినట్లుగానే వొడియాలు పెట్టాలి.

వేరుశెనగపప్పుతో: వేరుశెనగపప్పు దోరగా వేయించి తొక్కు తీసి శుభ్రం చేసుకోవాలి. ఒకపావుశేరు బియ్యం నీళ్ళలో మూడు గంటలు నాననిచ్చి మెత్తగా దంచి జల్లించుకుని పిండి కొలుచుకుని ఆపిండి ఎంతయితే వుంటుందో అంతికి రెట్టింపు నీరుకొలిచి ఆ కొలిచిన నీళ్లలో సగంనీరు పొయ్యిమీద పెటి మరగనిచ్చి అవి మరిగిన తరువాత ఆమరిగిననీళ్ళలో ఈపిండి వేసి కలిపి దాన్ని మరుగుతున్న నీళ్లలో వేసి పచ్చిమిరపకాయ కారం వేసి పైన చెప్పినట్టు వుడకబెటి అది దించేసి ఈ వేయించి బాగుచేసిన వేరుశెనగపప్పు వేసి పైవిధంగా వడియాలు పెట్టుకుంటే గుళ్ళవిచ్చి ఎంతో బావుంటాయి. ఇదే విధంగా పుల్లికాడలతో కూడా పెడతారు. పుల్లికాడలు సన్నగా తరిగి కలిపి పెడతారు. వాటికంటె పుల్లి కాడల వడియాలకి ఇంకొంచెంసేపు పిండివుడకాలి ఇవి అరటి ఆకుకి నూనెరాసి, చెయ్యితడిచేసుకు బిళ్లలుగా చేసి పెడతారు. వేరుశెనగపప్పువి కూడా ఇట్లాగే పెడతారు.

బలభద్రుని వరలక్ష్మి,
(విజయనగరం)

## కమన్‌ఢూకుల్లా

ఈ టిఫిన్ గుజరాతీలు చేసుకుంటారు.

కావలసిన సామాను: శెనగపప్పు, బియ్యం, మినపప్పు, జీలకఱ్ఱ, మిరియాలు, పోపు సామాను, నూనె, కొద్దిగా పుల్లటి పెరుగు.

చెయువిధం: రేపు చేయడమనగా, తొలి రోజు శెనగపప్పు ఒకభాగం, అందులో సగం బియ్యం, అందులో (బియ్యంలో) సగం మినపప్పు శుభ్రముగా బాగుచేసుకొని నానపెట్టుకోవలెను. మరునాడు నానపెట్టినది మొరుంగా రుబ్బుకోవలెను. తరువాత మిరియాలు, జీలకఱ్ఱ వేరు వేరుగా ఎండపెటి. గుండ కొట్టుకొని వుంచుకోవలెను. రుబ్బినముద్దలో తగ్గవుప్పు పసుపుగుండ (చిటెడు) జీలకఱ్ఱగుండ, (లెక్కకు) 10. 15, మిరియాలు, పెరుగు కలపవలెను, కళాయిఉన్న పళ్లెంకి నూనెరాసి ఈ ముద వేసి చేతితో సర్ది ఆవిరిమీద (ఇడ్డీ వుడికించినవిధముగా) వుడికించవలెను. వుడికిన

## సట్టకం

"సట్టకం" ఒక పానీయం. ఇది అరుచిని బాపును. అగ్నిదీపి నొసగును. కంఠస్వరమునకు మృదుత్వమును కలుగజేయును. పైత్యదోషములను బాపును. వాత దోషములను దరిచేరనీయదు. బలాన్ని, తృప్తిని చేకూర్చును. ప్రతికాలమునను ప్రతివారూ సేవించవలసినది. దీనికి కావలసినవి :

పెరుగు 40 తులములు, లవంగముల చూర్ణము $\frac{1}{8}$ తులం, శొంఠి చూర్ణం $\frac{1}{4}$ తులం, పిప్పలి చూర్ణం $\frac{1}{8}$ తులం, మిరియముల చూర్ణం $\frac{1}{4}$ తులం, పటిక బెల్లంపొడి 10 తులములు.

వీటన్నిటిని స్టెయిన్‌లెస్ సీల్ పాత్రలో వేసి కవ్వముతో చిలికి—వడబోయవలయును. అందు దానిమ్మరసం 8 తులములు, పచ్చకర్పూరపుపొడి ఒక చిటెడు వేసి బాగుగా కలపవలయును. దీనినే సటకమందురు. దినిని యే రోజుకు ఆరోజే చేసుకొనవలయును. నిలవవుంచరాదు. అన్ని కాలములందుననూ వాడవలసినదే ఐనా వేసవికాలమున వాడిన చాలా మంచిది. గాయపులకు మంచిది.

వైద్యశ్రీ ప్రకాశచంద్రశతపథి (విజయవాడ.)

# వనితా వాణి



ప్రఖ్యాత సినిమా తార, రచయిత్రి శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు వ్రాసిన వ్యాసాలు, 'అత్తగారూ-ఆచారాలు' 'అత్తగారూ - ఆవకాయ' మొదలైనవి నన్ను ఎంతో సంతోషపరచాయి. శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు నా అభిమాన తారే కాకండా అభిమాన రచయిత్రి అని చెప్పటానికి ఎంతో సంతోషిస్తూ వున్నాను. చిత్రాలలో అతివుత్తమంగా నటించగల ఆమె ఇలాంటి చక్కటి వ్యాసాలు వ్రాయారంటే ఎంతో ఆనందపడవలసిన విషయం. ఈవారంలోని "కోరికలూ — కొరతలూ" వ్యాసం చదివాక ఆమెను అభినందించకండా వుండలేకపోయాను. ఇక ముందుకూడా ఇలాంటి చక్కటి వ్యాసాలు రాస్తారని ఆశిస్తూ వున్నాను.

సత్యవతీ గోపాలకృష్ణ (హాంపీకేంప్).

*　　*　　*

ఎం. ప్రభావతీ దేవిగారు అప్పుచేసి పప్పుకూడు అన్న వ్యాసం చాలా బాగా వ్రాసారు. అందులో డాబులు చేసేవారికి బుద్ధివచ్చేలా వ్రాశారు. నిజంగా అలా చేసే వారిని చాలామందిని చూచాను. నిజంగా ఎవరింట్లో వారు తిన్నా, తినకపోయినా డాబులుచేస్తారు. అల్లా చెప్పేవారు కూడా కొంతమంది. అందరూ అలాగ ఉండరు. ప్రభావతీదేవిగారు వ్రాసిన వ్యాసం చదివి అలా చేసేవారు తమకువచ్చే లోటుపాట్లని గుర్తిస్తారని తలుస్తాను. ఏమైనా కొంచెం చిల్లరఖర్చులు తగ్గించుకొని గడుపుకోన్నా, ప్రభావతీదేవిగారు చాలా బాగా వ్రాసారు. వారికి నా అభివందములు.

ఎమ్. లక్ష్మి. (విజయనగరం.)

*　　*　　*

16-4-58 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "దకరకాల ఉత్తరాలు" అన్న వ్యాసం వ్రాస్తూ "నాట్ పెయిడ్ ఉత్తరాన్ని మా అత్తవారు మామీద కోపం వస్తే రాసి పడేసేవారు. మాకు డబుల్ చార్జి తగలడం వారికి ఒక ఆత్మ సంతృప్తిగా వుండేది" అని అన్నారు రచయిత్రి. అటువంటి ఉత్తరాలు పుచ్చుకుని తీరాలన్న నిబంధన ఏమీ లేదు. వాటిని పుచ్చుకోకుండావుంటే, రాసినవారే విధిగా డబుల్ చార్జి యిచ్చుకొని తీరాలి. లేనట్లయితే, యికముందు వారికి వచ్చే వుత్తరాలన్నీ అపుచెయ్యగల అధికారం తపాల శాఖకి వుంది. ఇది ఎందుకు రాశానంటే, కాలేజీ అమ్మాయిలకి, గరల్స్‌స్కూల్ మిస్సమ్మలకీ, యిటువంటి అన్‌పెయిడ్ (ప్రేమ) లేఖలు రాసే దురలవాటు అనేకమంది (పిరికి) రొమాంటిక్ హీరోలకి వుందని లోకవిదితమే ! అవి పుచ్చుకోకుండావుంటే, రాసినవారివద్ద వడ్డీతో సహా సొమ్ము వసూలు చెయ్యగలరు. రాసినవారి చిరునామా లేనప్పుడు, తపాలశాఖ ప్రత్యేక స్మశానంలో నిర్దయగా దహనం చేస్తారు ఈ లేఖల్ని.

జి. వి. ఎల్. ఎన్. స్వామి, (బరంపురం)

*　　*　　*

## చారూ - పులుసూ

'ముద్దుపేర్లూ—మొద్దు పేర్లు' అనేది మాకు చాలా నవ్వు పుట్టించింది. శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు చాలా బాగా వ్రాశారు. అది చదువుతూ వుంటే మా యింట్లో తమాషా వ్రాయాలనిపించింది. మా పిన్నికి ఇద్దరు కూతుళ్ళు - ఒక అమ్మాయి పేరు 'శ్యామల'. ఇంకొక అమ్మాయి పేరు 'శారద.' కాని వాళ్ళు అలా పూర్తిపేరుతో పిలువరు. శ్యామలను 'చామీ' అని, శారదను 'చారూ' అని పిలుస్తారు. అదే అందరికీ అలవాటు అయింది. మా యింట్లో వంటవాడు చాలా తమాషా అయిన మనిషి. శారదను ఎవరైనా 'చారూ' అని పిలిస్తే చాలు 'పులుసూ' అంటూ వస్తాడు. దీనితో మొదట తమాషాగా వున్నా ఆఖరికి ఆ అమ్మాయికి అదే పేరు నిలుస్తుందేమో ననిపిస్తుంది.

వి. సరోజినీదేవి (పోర్టు) (బళ్లారి)

*　　*　　*

మా చుట్టాలావిడికి లేక లేక పిల్లడుపుట్టేడు. వాడికి మంచిపేరు పెట్టక, బ్రతికిఉంటే చాలని "అడివి" అని పేరు పెట్టేరు. ఆ అబ్బాయి యిప్పుడు ఉద్యోగము చేస్తున్నా ఆపేరేను. నాకు ఆ పేరు వింటే చాలా నవ్వువచ్చినది. యింకా యిలాంటివి చాలా ఉన్నాయి.

జె. రుక్మిణి (కలకత్తా.)

*　　*　　*

"మగువలు-మర్యాదలు" అన్న వ్యాసం నన్నెంతయినా ఆకర్షించింది. ఆ ఉపాధ్యాయుని భార్యామణియొక్క ప్రవర్తన గయ్యాళిభార్య ప్రవర్తనయని గట్టిగా చెప్ప

## వంటలు

తరువాత దించి కొద్దిగా చల్లారినతరువాత సైజువారీగా ముక్కలు కోసుకొని వుంచుకోవలెను. ఈ కోసినముక్కలు, పోపులో (ఆవాలు జీలకఱ్ఱ ఎండుమిరప, పచ్చిమిరప కరివేపాకు) వేసి, వేయించవలెను. ఎఱ్ఱగ వేగినతరువాత మిరియాలగుండ వేసి మరి కొంచెం వేగనిచ్చి దించుకొనవలెను. మిరియాలగుండ అంటే. యిష్టము లేనివారు కొద్దిగా (చిటికెడు) వేసుకోవచ్చును చేయుటకు శ్రమ అయినను రుచికరముగా యుండును.

### మెంతిమిరప

ఇది అన్నంలోకి ఆధరువుగా పనికొస్తుంది.

కావలసినవి మంచిమెంతులు, మెత్తని ఉప్పు, పచ్చిమిరపకాయలు, (పెద్దవిఎంచి)

చేయువిధం: మెంతులు ఎఱ్ఱగ వేయించి, మెత్తగ గుండ కొట్టవలెను. మెంతులకు రెండింతలు వుప్పు, మెంతిగుండలో కలపవలెను. మిరపకాయలు చాకుతో నిలువుగా రెండుముక్కలు (పెడలు) కాకుండా కోయవలెను. ఇప్పుడు మెంతిగుండ మిరపకాయల్లోకూరి (దిట్టంగా) ఎండపెట్టవలెను. బాగా ఎండినతరువాత నూనెలో వేయించుకొనిన రుచికరముగా వుండును. విస్తారము కారము వుండదు. నూనెకూడ ఎక్కువ అక్కరలేదు. కర్చు తక్కువ. సంవత్సరం పొడుగునా నిలవ వుంటాయి.

మెంతులు వేయించడం తక్కువఅయిన చేదు ఇచ్చేస్తుంది. కాబట్టి ఎఱ్ఱగా వుండవలెను. (పెద్ద మిరపకాయలు ఎంచవలెను.) మిరపకాయలు కోసినప్పుడు జాగ్రత్తగ రెండుముక్కలు కాకుండా ఒకేపక్క చాకుతో నిలువుగా కోయవలెను. ★

గాదె. శేషాచలం (బొనై-ఒరిస్సా)

# ★ దగా పడిన తమ్ముడు ★

(27-వ పేజీ తరువాయి)

గన్నెమ్మ గబగబ వెనక్కి నడిచింది. భజన మందిరం అరుగుమీద పడుకున్నట్లు అభినయించింది.

వినిపిస్తున్నాయ్ టోకుర్లు. గాఢనిద్దర్లో వున్నాడు. చేతులు మెల్లగా రాపాడించాడు. చేతులతో ముఖం ఒకసారి తుడుచుకున్నాడు. అభిమానాలన్నీ ఆశయం యెదర మండుకపోయాయి. శరీర మంతా కర్తవ్య నిర్వహణలో వుబ్బెక్కి వురకలు వేసింది. చీకటి—ఆ చీకటిలో కళ్లు నిజంగా కనిపించనట్లయింది. జంతువు యెదురుపడ్డ మృగరాజయ్యాడు. ఒక్క వురుకు వురికాడు "నాకు లేపకండా సేసావ్? లే... లే... లేరా నా కొడుకా?"

రాజిగాడు తెలివి తెచ్చుకొని ఘీంకరించాడు. మీదికి లేవబోతే వెంకన్న జుత్తు పట్టుకొని అలా క్రిందనే వుంచాడు. "రండ్రో" అని అరిచాడు రాజిగాడు. గింజుకుంటున్నవాడి ముక్కు మీద తీసి ఒక్క గుద్దు గుద్దాడు. రక్తం బొడబొడా కారజొచ్చింది. ఆ రక్తం చుక్క బొట్టు పెట్టుకొని "నా కొడకా! నీ యమ్మముకం సూసానురా! లేదా అంటే యీ సెణానికి యమలోకాన్న ఉందువు!"

దీపాలతో నలుగురూ చుట్టుముట్టారు. వెంకన్నను నలుగురూ పట్టుకున్నారు. బంధింపబడిన సింహం గర్జిస్తోంది. "పుల్లయ్యలాంటోల బతుకు లెందరివి కాలుస్తావురా? వదలండి! ఇంకో గుద్దు గుద్దుతాను. తెలివొసాది... నా కొడుక్కి తెలివొసాది!"

"నీ కొడుకున్రా" ఘీంకరించాడు రాజిగాడు. రక్తం కారుతున్న ముక్కుకు గుడ్డ అడ్డుపెట్టి పరుగెత్తివచ్చి కడుపులో ఒక్క తాపు తన్నాడు. 'గయక్' మంటూ వెంకన్న నేలకు ఒరిగి కూలిపోయాడు. అంతమందిలో 'గుడ్డోడిమీదరా నీ బలం' అని యెవరూ అనలేదుగాని అప్పుడే వచ్చిన పుల్లయ్య అన్నాడు. సరి ప్రజల్లో గుసగుసలు బయలుదేరాయ్. రాజిగాడు రౌద్రంతో "నాకు తెలుసునురా పుల్లిగా! ఊరంతా తెలుసునురా యీ పని యెవుడు చెయ్యించాడో! ఇది వూరుగాని అడివికాదు. ఇక్కడు న్నోలందరూ, సాక్ష్యం రారా! రేపొద్దున్న పోలీసులు వస్తే యెవురు కైదులోనికి యెళ్తారో చూస్తారు!"

తెల్లవారింది. "ఎవరి మద్దతు లేకపోతే గుడ్డోడికి అంత సాహసం వస్తాద"ని వూరిలో చాలామంది అన్నారు. "ఆ పుల్లిగాడికి పోయేకాలం వచ్చింది. అసలు పొలంలో రాజిగాడు యేరు యిప్పినదగ్గరనుంచీ యెలాగ యీడిమీద కక్ష సాధించుదామని చూస్తున్నాడు. ఆడి నొసట కైదురాసుంటే పట్నం యెందుకు పోతాడు?" "పెజల్లో సెడ్డయ్యాడు. వాని మంచి యెంతకాలం కాస్తాది?" ఇలా తలోలా వ్యాఖ్యానాలు చేస్తున్నారు. పుల్లయ్య కదల్లేదు. అంతావిని తెలుసుకొని నీలియే మాటాడలేదు. భజన మందిరం వగర తిండిలేక కడుపులో రాత్రి తగిలిన తాపువల్ల నొప్పితో గిజగిజ వెంకన్న గెంజుకుంటున్నాడని తెలిసింది. నీలి వెంటనే గిన్నెలో తను త్రాగకండా గంజి అన్నం పోసుకొని వెళ్ళింది.

"అయ్యా!" అని పిల్చింది.

నీలి మాటవిని సిగ్గుపడి వానులుచుకుంటున్న వాడు లేచి కూర్చున్నాడు. దగ్గర కూర్చొని కడుపుమీద చెయ్యివేసి "పాపం వాసిపోయిందే" అంటూ చెయ్యితో రాసింది. గుడ్డివెంకన్న కళ్లల్లో నీరు తిరుగ సాగింది. యెదురగా గిన్నెపెట్టి చెయ్యి అందులో పెట్టింది. ఆకలితో వున్నాడేమో గబగబ ఆమెతుకులు నమిలి గంజిత్రాగాడు. ఇప్పుడు నీరు కడుపులో పడిందేమో వుస్సృతంగా యేడుపు వచ్చేసింది. ఏడుస్తున్న యీసింహాన్ని చూచి కళ్లల్లో నీరుబికినా ఓదారుస్తూ" ఏడవకయ్యా! నిన్నటిలాగ యీ వేళ నువ్వున్నావా? నిన్నటిలాగ వుండాలన్నా వుండగలవా? ఆలాగే అందరి బతుకులూ? ఈ వేళ చెడ్డని ఒకర్ని సంపిస్తే రేపు మంచి అవకండా చేస్తాం! సంపి మనం మరింత సెడ్డ అవడందేనికి? నీలాంటోలకి నాలికమంచైతే వూరు మంచవుతాదయ్యా!"

వెంకన్న దుఃఖం యింకా వుపశమనం కాకపోవటంవల్ల మాటాడలేదు. కొంతసేపు కూర్చున్నాక గన్నెమ్మవచ్చింది. "మామ్మా! ఇక్కడే పడుకున్నావు కదా! ఒద సైనా సెప్ప లేకపోనావా? ఇనతిపోతే వన్నెకా పిలిసి నావుకాదు. సూడు కడుపు యెలాగైపోనాదో? సూన పిసర తెస్తాను. రాస్తే నావు తగ్గుతాది."

నీలి మాటలకు గన్నెమ్మ గతుక్కు

---

వచ్చును. ఇటువంటి స్త్రీలు బహుఅరుదుగా కనిపిస్తుంటారు. విచిత్ర మేమిటంటే వీరు దురదృష్టవంతులైన ఆ ఉపాధ్యాయునివంటి సౌమ్యులకే భార్యలై కూచుంటారు. ఇక వీరిని కట్టుకొని కాపురంచేసేవారికి సుఖమిసుమంతయినా ఉండదు. అయితే-విజయలక్ష్మి గారనట్లు గయ్యాళితనం వారసత్వమే. వ్యక్తిత్వం వచ్చినతర్వాత మన ప్రవర్తనా విధానాలన్నింటికి మన చిన్ననాటి పోషణాదులే కారణాలు. తల్లిబుద్ధులు ఆడపిల్లలకు, తండ్రి గుణాలు మగపిల్లలకు రావడం సహజమే గదా. కాబట్టి ఇటువంటివారికి సత్ప్రవర్తనా విధానాన్ని బోధించటానికి సంఘాలూ, సమాజాలూ కూడా ఏమీ చేయలేవు

జంగా కాత్యాయినీదేవి, (ఏలూరు)

★

# ★ దగాపడిన తమ్ముడు ★

మన్నా" బాగుపడేవోళ్లకి ఒకరు సెప్పాలా? పాడయ్యేవోలకివొకరు సెప్పితే బుర్రకెక్కుతాదా? నానే మయ్యాను...రాత రాతే తల్లీ!" అంటూ యింకేంమాటలు వస్తాయేమోనని అక్కడ నించి నడ్డవంచుకొని వెళ్ళిపోయింది.

ఇంతలో సంజీవి అలాపోతూ "నీలమ్మా! ఆ గుడ్డి నాయాళ్ని కనికరిస్తున్నావు. అదిగో రాజిగాడు నాయుడు యింటి దగ్గర యేంచేస్తున్నాడో నూడు! పోలీసులొస్తారు. పుల్లిగాడికి రోజులు బాగులేవు"

గుడ్డి వెంకన్న చటుక్కున "రానీ అయ్యా రానీ! ఇందులో యెవురు దొంగతనం సెయ్యనేదూ - రంకుతనం సెయ్యనేదు. నిజం నిలకడమీద తెలీదా?"

"నివ్వు ఆడిని సంపిద్దువే - నిజం యేంటిరా గుడ్డోడు నిజం?" అంటూ దగ్గరకు వ్రోసుకొచ్చాడు.

వెంకన్నకు మనసు మండి గట్టిగా "ఎలాంటోడు పుల్లయ్యని కైదుపెట్టిసాడో నానూ నూస్తాను"

"నివ్వేం సేసావురా? ఊరి నుంచే నీకు తగిలెయ్యాలని నూసుంటే!"

"నలుగురు పీకలుతీసి మరీ వూరు కదులాను".

నీలిమెల్లగా జోక్యం చేసుకొని "ఎందుకయ్యా యీ మాత్రం దానికి పీకలు తీసుకోవటం? కర్రవంకర పొయ్యి తీర్చాలిగానీ నీ సేత యేం వున్నాది?"

వెంకన్న చప్పున "మనం ఆ కర్రని పొయ్యిలో పెట్టొద్దె కూతిరా!"

"ఆ కాలం వసే ఆకర్రే పొయిదగరకి వస్తాది. ఆ దేముడే దానికి తగినోడిసేత పెట్టిస్తాడు"

"ఆ తగినోడ్ని నానే కూతిరా! ఆడి అయ్యని"-

"అయ్యా! పరుగెత్తి పాయసం తాగేబదులు కూకొని మంచినీరు తాగితే ఒంట పట్టాదంటారు. ఇలా తొందరపడే వచ్చిందేమీ లేదు వచ్చినా యెంతకాలం నిలవదు. ఏపని సేసినా యెదుటోడిగురించి కొంచం తెలసాలంటావా? మళ్ళి వసాను-నూసిరాస్తే వాపుతగుతాది." అంటూ వెంకన్నను మరి మాటాడే అవకాశం యీయకుండా వెళ్ళిపోయింది. సంజీవి కదులుతూ "ఆకళ్లుంటే..." అంటూ వెళ్ళిపోయాడు.

ఇంటికి చేరుకొని ఆ పుల్లిగాడ్ని యిలా సేసాన్ అలా చేస్తానని నోరు చేసున్న రాజిగాడ్నిచూసి పెళ్ళాం మెల్లగా "నీకు మతి నేద"ంది. "నాకా!" అంటూ ఆగి వెంటనే "ఏవేఁ అలాగంటున్నావ్" అన్నాడు.

పెళ్ళాం విసుక్కుంటూ "నాకేంటి మీ పంగలనోడ్ని—ఎద్దుతోనైనా పోట్లాడతావంటావ్? ఆ వెంకన్నని వూరునుంచి తగిలేసానంటావ్? ఆ పుల్లయ్యని కైదులో పెట్టేస్తానంటావు!"

"ఊరంతా నా పక్క వున్నారు. నాయం నాపక్క ఉన్నది" "కోర్టు లెక్కినోడూ గాడిదెక్కినోడూ ఒక్కటే అంటారు. నూడు, పులయ్య కైదునుంచివచ్చి నిన్ను బతకనిస్తాడనా? ఆ గుడ్డోడు ఏదో సెయ్యకండ ఊరు కదుల్తాడనా? నాను సెప్పినట్లు విను."

"ఏనాడు యినలేదే! నీ మాటయిని ఆడి కళ్ళు పొడిసీ నేదా?"

మెల్లగా చెవిదగర యేదో చెప్పింది. సరే నన్నాడు. అప్పుడే వూర్లో నాయుడు కరణాలకి పెద్దలకి భజనమందిరం దగ్గర పోగు చేసాడు. పెద్ద మనుష్యులు పుల్లయ్యని పిలిపించారు వాళ్ళేమడిగినా పుల్లయ్య సమాధానం చెప్పలేదు. "నివ్వే వాడ్ని ఖూనీ చెయ్యించాలని చూసావ"న్నారు. అప్పటికీ పుల్లయ్య మాటాడలేదు. వెంకన్న "రామరామ—అంతా నానే సేసానర్రా!" అంటూ వెనకనుంచి అరుస్తున్నాడు.

సంజీవి ముందుకొచ్చి "రాజిగా! ఆడెలాగా పట్నం యెళ్లిపోదామని బతుకుదామని నూసన్నాడు. ఇలాంటప్పుడు కైదులో పెట్టించకరా! దాని మొకం పిల్లల మొకాలు నూడరా."

రాజిగాడు ఫీంకరించాడు "అందరూ రాతిర రాకపోతె యింతేళకి నాను బుగయిపోదును. ఆడ్ని కనికరిసానా?"

"అలాగంటె యెలాగరా? ఏదో నివ్వు డబ్బు యివ్వనేదని తొందరపడి పోనాడు. అదేదో పెద్దలున్నారు. తేల్చేసి ఆడికేం రావాలో యిచ్చీకూడదా?"

"నాకు ఆ భూమీవదూ యిల్లూవద్దూ, నా దగ్గర పద్దులున్నాయి నా నిచ్చింది యిచ్చీమను ఒక్కానీ వడ్డీ వద్దు."

"ఇప్పుడు ఆడిని గంగలో తోసిస్తే యెలాగ. ఎలాగో కక్కుర్తిపడ్డాడు. మైనేరు ఆస్తి అమ్మడానికి పుల్లిగాడికి యేం హక్కు వున్నాదిగానీ...యెవురు కొంటారులే..."

కరణం అందుకున్నాడు "ఎందుకదంతాను రాజిగా? ఆ యిల్లు రాసిస్తాడు. గవుర్నమెంటువురకేజాగా గ్రామకంఠంలో యిస్తామంటుంటే ఆ పాత యిల్లు యెవడికి కావాలి? ఎలాగా పట్నం పోతున్నాడు. ఆ రైలు చార్జీలు పదిపూటలు తిండికి తగ్గట్టూ యిచ్చే!"

"నానొక దమ్మిడీ యివ్వను. కరీదు కట్టండి. నాకు నష్టంగానీ నాభంలేదు" అని రాజిగాడు ఖచ్చితంగా అనగానే నాయుడు కలుగజేసుకొని "సచ్చిన పాముని కర్రతోన బాదుతానంటావేమిటి? వూరూరా యిలాగ నిన్ను సంపడానికి యేసాడని తెలిసిపోయిందని ఆడే సచ్చిపోతుంటే! ఆడి పెళ్ళాం ముఖం నూడు. ఊరుకొని తనే సెయ్యించినట్లు ఒప్పుకున్నాడే. ఏదో మరో యే బైరూపాయలు ముట్టసెప్పి ఆ పొలం యిల్లూ రాయించుకో కీడుచేసినోడికే మేలు సెయ్యమన్నారు. ఇంతకంటే మేం యేమీ సెప్పలేం! ఏం పుల్లయ్యా యిష్టమేనా?" పుల్లయ్య యిష్టమన్నట్లు తలవూపాడు.

"మీరందరూ పెద మనుసులు మరికాదని బతకకలనా?-నష్టానికే వచ్చింది" అని రాజిగాడు చిన్న సోకం చేసుకున్నాడు. అంతా లేచివెళ్ళిపోయారు. పుల్లయ్య భజనమందిరం సంభానికి ఆనుకొని కూర్చున్నాడు. దగ్గరే వున్న వెంకన్న "అయ్యా! నీకు నాయం కాదు ఆలకీ నాయంకాగు" అని బొటబొటా కన్నీరు కార్చి తుడుచుకుంటున్నాడు.

"ఏడకురా!" అన్నాడు పుల్లయ్య.

"ఏడవనా తండ్రీ! నేం నీ మీదేసుకున్నావు. ఊరోళ్లు గోటున్నారు నిన్ను... నానెంత పొరపాటు పని సేసినాను?"

"నివ్వేమీ సెయ్యనేదు. నామీద అభిమానంమీద అంత పనిసేసావు. పొన్నా రెళ్లి యేంబతుకుతావ్. ఈ నేరం నీమీదే వుంటే వూరో యెవరూ నీకు గంజిపోస్తారా? నానే సంపడానికి పంపానని సెప్పు పరవానేదు. మళ్లా నేను యీవూరి ముకం నూస్తానా?"

"నాయనా మరి రావురా? మనవడ్ని నాను సచ్చిపోయే ముందైనా ముద్దులాడనీయవా? నాయమ్మ నీలమ్మ తల్లి దగ్గరుండదా? - ఆ దేముడ్ని తిట్టానురా...ఆడికి కనికరంలేదురా ... ఆడూ నాలాగ గుడ్డోడైపోనాడురా...ఆడు - ఆడు" ఉద్రేకంతో మాటలు మరి రాలేదు. కానీ ఆ కళ్లలోనించి నీరుమాత్రం బొటబొటా రాలిపోతుంది.

మౌనంగా యిద్దరూ కూర్చున్నారు.

—ఇంకావుంది.]




# "బావిలో చంద్రుడు"

రామయ్యను తోటమాలి
రాత్రివేళ నీటికొరకు
తోటలోని బావికడకు
నీటుగాన వెళ్లినాడు.

చక్కగ నా బావి జేరి
బొక్కెన వేసెనో? లేదో
చటుకున బొక్కెనలాగి
నిక్కిచూచె బావిలోకి.

పున్నమవెన్నెల వెలుగుల
నూతియందు చంద్రబింబ
మగుపించగ వేగిరమే
మరలినాడు తన యింటికి.

బసకు జేరి, భార్యనుగని
పలికె నిటుల "పాపము! మన
బావియందు చందురుండు
పడిపోయెను బయలుదేరు"

ఈ మాటలు విన్న భార్య
ఏమరుపాటే లటంచు
చంద్రుని సంరక్షింపగ
తొందరగా పయనమయ్యె.

బిర, బిర ఆభార్య, భర్త
లిరువురు వే వేగపోయి
బొక్కెనేసి బావియంత
బాగుగాన గాలించిరి.

బొక్కె నొక్కరాతిమధ్య
చిక్కుకొనగ తానొక్కడె
బలమంతను ప్రయోగించి
బయటికి లాగెను దానిని.

గట్టితనము లేని త్రాడు
పటుక్కుమని తెగిపడగా
పట్టుదప్పి రామయ్యా
పడిపోయెను వెలకిలగా.

భూమిపైన కూలినట్టి
అమాయకపు రామయ్యా
ఆకాశము వంకచూచి
ఆనందముతో నిట్లనె:

"అరె! అదిగో చంద్రుడు,
ఆకాశము పై నుండెను.
శ్రమపడి ఎట్లో చంద్రుని
జేర్చితి మాకాశమునకు." ★

కె. రాధాకిషన్‌రావు

# లక్ష్మణుని నవ్వు

కె. ఆర్. కె. ప్రసాద్

సత్యవాక్య పరిపాలకుడైన శ్రీరామచంద్రుడు పదునాలుగేండ్ల వనవాసము ముగించుకుని, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి తన పరివారంతో సహా అయోధ్య చేరుకున్నాడు. సీతారాములకు క్షణం ఏమరక సేవ చేసిన లక్ష్మణుడు, స్వామిభక్తిపరాయణుడైన హనుమంతుడు వెంట రాగా ఆశ్రితవత్సలుడైన శ్రీరామునికి ఘనంగా స్వాగత మిచ్చారు పురప్రజలు. ఏనోట విన్నా శ్రీరాముని గూర్చిన ప్రశంసే. ఒక్కటిగాదు, రెండుగాదు, పదునాలుగేండ్లు రాజభోగాలనుభవించాల్సిన రాజకుమారులు మానవ సంచారంలేని కాఱడవుల్లో ఉంటూ, అనేక బాధలకు గురి అయి తమశక్తి సామర్థ్యాలను చూపి, విజయవంతగా తిరిగి వచ్చారు.

వారు తిరిగివచ్చిన కొంత కాలానికే రాజగురువైన వశిష్టుడు పట్టాభిషేకానికి సుముహూర్తం పెట్టాడు. సుమంత్రుడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు పట్టాభిషేకానికి తగిన ఏర్పాట్లు చేశారు.

ఆరోజు రానేవచ్చింది. అయోధ్యానగరం అతిథులతోనూ, బంధువులతోనూ, అట్టహాసంగావుంది. నగరమంతా అలంకరింపబడింది. రాజభవన ప్రాంగణంలో ఒకపెద్ద పందిరి వేయబడింది. ఆ పందిరి మధ్య ఒక పెద్ద మండపం. మండపాన్ని నేత్రానందంగా అలంకరించారు. మండపంలో నవరత్నఖచిత సింహాసనం. దానికి కొంత ముందుగా హోమగుండం. తపోధనులైన మును లొక వైపు, వేదకోవిదులైన బ్రాహ్మణులు మరోవైపు కూర్చుని దిక్కులు పిక్కటిల్లేలా మంత్రాలు జపిస్తూ కుండలతో నేతిని క్రుమ్మరిస్తూ హోమం చేస్తున్నారు. పట్టాభిషేక మహోత్సవానికి విచ్చేసిన మహారాజులు బారులుతీరి కూర్చున్నారు. అంతే గాక లంకాధీశుడైన విభీషణుడు, కిష్కింధాధిపతి అయిన సుగ్రీవుడు, మిథిలాపతి అయిన జనకుడు, ప్రత్యేకాసనాలు అలంకరించారు. హనుమంతుడు సింహాసనం మీద కూర్చున్న సీతారాముల పాదాల చెంత ఉన్నాడు. హనుమంతుని సేవకు ముగ్ధురాలై జానకీదేవి తన కత్యంత ప్రియమైన రత్నాల హారాన్ని బహూకరించింది. హనుమంతుడు దాన్ని తీసుకుని ఒక్కొక్క రత్నమే పగులగొట్టడం మొదలెట్టాడు. రామభక్తుడైన అతనికి రత్నాల్లోకూడా రాముడున్నాడో లేదో చూడాలనే కుతూహలం.

సింహాసనానికి కొంత సమీపంలో నిల్చున్నాడు లక్ష్మణుడు. నిల్చున్నట్టుగానే అతనికి ఒక తూగు వచ్చింది. తూగబోయినవాడల్లా అంతలోకే సర్దుకుని ఒకచిన్న నవ్వు నవ్వాడు.

శ్రీరాముడు, సీత, వశిష్టుడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, కైకేయి మొదలగు వారందరూ లక్ష్మణుడు నవ్వుతూండగా చూడడం తటస్థించింది.

“వయస్సు మళ్లినా, మాఅన్నకు రాజ్యకాంక్ష విడువలేదు గదా! పదునాలుగేండ్ల అనంతరం తిరిగి రాజ్యం కావాలనే ఆశ, అతన్ని, పరాయివానియింట వున్న మా వదినను తిరిగి స్వీకరించి పట్టాభిషేకం చేసుకునేట్టు చేస్తూంది గదా!” అని లక్ష్మణుడు తన గురించి అనుకుని నిండుసభలో ఇలా నవ్వుతున్నాడేమోనని అనుకున్నాడు రాముడు.

“వనవాసానికి వెళ్లి, అక్కడ అన్నదమ్ములను చిక్కులో పెట్టింది చాలక, రావణుని ఇంట వుండి ఇప్పుడు తగుదునమ్మా అని సింహాసనంపైన కూర్చున్నది మా వదిన” అని లక్ష్మణుడు తన విషయమే అనుకుంటూ ఇలా నిండుసభలో నవ్వుతున్నాడేమో ననుకుంది జానకీదేవి.

“క్రిందటిసారి పెట్టిన ముహూర్త బలం రామలక్ష్మణులను వనవాసానికి, దశరథుని పరలోకానికి పంపింది. ఇక ఈసారి ఏరికోరి నిశ్చయించిన ఈనాటి ముహూర్తానికి ఫలిత మెట్లుండ గలదో!” అని తను పెట్టిన ముహూర్తాన్ని తలపోసుకునే లక్ష్మణుడిప్పుడు నవ్వుతున్నాడనుకుని వశిష్టుడు చిన్నబోయాడు.

“శత్రువులతో చేతులు కలిపి, రక్తపాశాన్ని కూడా వదలుకుని తోబుట్టువైన రావణుని చంపించినది చాలక, ఆ లంకారాజ్యానికే పట్టం గట్టుకుని ఇప్పుడు ఏ మొహం పెట్టు

కుని వచ్చాడో ఈ విభీషణుడు అని తన చరిత్రను మననం చేసుకుని హేళనగా నవ్వుతున్నాడు గాబోలీ లక్ష్మణుడు అని బాధపడ్డాడు విభీషణుడు.

"మాయోపాయంతో శ్రీరాముని వల్లో వేసుకుని అన్నపై నేరాలు మోపి అతన్ని చంపినది చాలక అతని రాజ్యాన్ని సైతం పరిగ్రహించి పెద్ద మనిషిలా ప్రత్యేకాసన మలంకరించాడీ సుగ్రీవుడు" అని తన్ను ఎత్తిపొడిచేందుకై ఈ విధంగా నవ్వుతునట్టున్నాడీ లక్ష్మణుడు" అని సుగ్రీవుడు కోపగించుకున్నాడు.

"అయినా! ఈ లక్ష్మణస్వామికి నేనంటే ఎంత హేళన. సీతమ్మవారు ప్రీతితో ఇచ్చిన బహుమానాన్ని మర్యాదగా ఉంచుకొనక, కోతి బుద్ధిని చూపించి, దాన్ని ఆవిడ ముందే తునకలుగా చేశానని ఈ విధంగా నవ్వుతున్నాడు. శ్రీరాముడు రత్నాల్లో వున్నాడేమోనని చూడడం తప్పా" అని అర్థం చేసుకున్నాడు హనుమంతుడు.

"క్రిందటిసారి నిశ్చయించిన పట్టాభిషేకానికి తీవ్రమైన వరాలు కోరి, ఇటు పుత్రులను వనవాసానికి, అటు భర్తను పరలోకానికి పంపి, కోరినందుకు తనూ సుఖపడక, తన కుమారుడు సుఖపడకుండా చేసుకుందీ ఇల్లాలు. ఈసారి ఏమి చేయగలదో" అని తన విషయమై తలచుకుంటూ నవ్వుతున్నాడీ లక్ష్మణుడు అని తల వంచుకుంది కైకేయి.

ఈ విధంగా అంతమంది కూడి వున్నచోట లక్ష్మణుడు నవ్వేసరికి ఒక్కొక్కరొక్కొక్క విధంగా భావించుకోవడం జరిగింది. శ్రీరాముడు తక్కినవారి ముఖ కవళికలను బట్టి, వారుకూడా లక్ష్మణునినవ్వును తప్పుగా భావించినట్టు తెలుసుకొని లక్ష్మణునితో ఇలా అన్నాడు:

"లక్ష్మణా! నీవు ఏ కారణంచేత నవ్వావో ఎవరికీ తెలియదు. కాని ఇచ్చట చేరిన పెద్ద మనుష్యులంతా నీ నవ్వును అపార్థం చేసుకున్నట్టగబడుతుంది. నిండుసభలో ఈవిధంగా అకారణంగా నీవు నవ్వటంవల్లే ఇంత మంది చిన్నబోవటం జరిగింది. నీవిప్పుడు ఏ కారణంచేత ఇలా నవ్వావో తెలిపినట్టయితే అందరి సంశయాలను తీర్చినవాడవుతావు."

ఈమాటలు విన్న లక్ష్మణుడుతన తప్పిదాన్ని గ్రహించాడు. ఏమరుపాటుతో వున్న తను నిండుసభలో నవ్వడం జరిగింది. కాని తన నవ్వును పరిపరి విధాలుగా అర్థాలు తీసుకోవచ్చు. అందుచేత అసలు కారణాన్ని తెలియబఱచటం తన విధి అనుకుని బిగ్గఱగా ఇలా అన్నాడు:

"అన్నా! నే నీ విధంగా అందరి యెదుట నవ్వడం తప్పే. అయితే జాగ్రదవస్థలో లేనందునల్లనే ఈ పొరపాటు జరిగింది. ఇందరి మనస్సులకు బాధ కల్గించినందుకు పెద్దలందరిని క్షమింప గోరుతాను. పదునాలుగేండ్ల కాలం నేను మాఅన్నను, వదినెను నిద్రాహారాలు లేక కాపాడుతూ వచ్చాను. ఈపదునాలుగేండ్ల కాలంలో ఒక్కసారైనా నిద్రాదేవి

# ఊలు బంతి

సాయంకాలము ఆరు గంటలు కావడమే తడవుగా పిల్లలందఱు భోజనముచేసి తాతయ్య వద్దకు చేరారు. "పిల్లలూ! మీరు ఆడు కొనే 'బాటు' గోడకు ఎందుకు తగిలిస్తారో తెలుసా?" అని తాతయ్య అడిగాడు. పిల్లలందఱు 'తెలియ'దని చెప్పారు. 'అయితే నేను చెబుతాను వినండి' అని తాతయ్య కథ ప్రారంభించాడు:

ఒక రోజున ఊలు బంతులు (బాడ్మింటన్ బంతులు) బ్రహ్మదేవునివద్దకు వెళ్లి "మా జాతిని ఎందుకు సృష్టించారు? బాటులు ఎప్పుడూ మమ్ములను కొంచెము కూడా జాలి లేకుండా కొడుతున్నవి. ఈ బాధ భరించలేకుండా ఉన్నాము. మాకు యీ బాధనుంచి విముక్తి కలిగించవలసినది అని మొరపెట్టుకొన్నవి.

అంతట బ్రహ్మదేవుడు "నేను సృష్టికర్తను మాత్రమే. లయకారుడైన శివునివద్దకు వెళ్ళవలసింది" అని చెప్పాడు. వెంటనే బంతులు శివుని దర్శనార్థమై కైలాసపర్వతమునకు వెళ్ళినవి. తపస్సు చేస్తున్న శివుని గాంచి తమ బాధను తెలియబఱచి విముక్తి కలిగించమని వేడుకొన్నవి.

టి. వి. శాస్త్రి

శివుడు తన కుమారుడైన వినాయకుని ప్రార్థించవలసినదని చెప్పాడు.

తక్షణమే బంతులు యింటికి వెళ్లి వినాయక చవితినాడు వినాయకుని పూజచేయుటకు నిశ్చయించినవి. వినాయక చవితిరాగానే పూజచేసి వినాయకుని మనస్సులో ధ్యానించి తమ కష్టాలు తీర్చవలసినదిగా ప్రార్థించినవి. వినాయకుడు బంతులపై జాలి తలచి తన వాహనమైన మూషికమును పిలచి 'బంతి జాతికి సహాయము చేయవలసిన'దని చెప్పాడు. మూషిక రాజము తన స్వామి ఆజ్ఞానుసారము బంతి జాతికి సహాయంచేయ పూనుకొన్నది. వెంటనే తన సేనతో 'నేలమీద కనుపించిన 'బాటు'ల నరములను కొఱికి వేయవలసిన' దని చెప్పింది. ఎలుకల దండు బయలుదేరి బంతి జాతి శత్రువులైన బాటులనరములను కొఱికివేయుట ప్రారంభించినది. ఈ విధముగా బాటుల నాశనము జరుగుచుండగా ఆటగాండ్రందఱు సమావేశమై 'బాటులను నేలపైనుంచరాదు. గోడకు తగిలించాలి' అని తీర్మానించారు. ఆ రోజునుంచి ఆటగాండ్రందఱు తమతమ బాటులను గోడలపైనే ఉంచుతున్నారు, అని తాతయ్య కథను ముగించాడు.

పిల్లలందరూ బాగుందంటే బాగుందని కేరింతాలుకొడుతూ వెళ్ళారు. 

---

## లక్ష్మణుని నవ్వు

నన్ను చేరలేకపోయింది. గడువు ముగిసిన తర్వాత ఇప్పుడు నాపై తీవ్రంగా తన ప్రభావం చూపుతూంది. ఇంతటి సభలోకూడా నేను ఒళ్లుమరచి తూగబోతూండగా, నిద్రాదేవి ప్రభావాన్ని తలచుకుని నవ్వాను. అంతేగాని నేను ఇంకొక విధంగాభావించి నవ్వలేదు. పద్నాలుగేండ్లు అరికట్టగల్గిన ఈ నిద్ర ఈ నాటికి నన్ను జయించ కల్గినదికదా! అని నవ్వుకున్నాను. కావున నా నవ్వును అపార్థం చేసుకున్న పెద్దలు నన్ను మన్నించ గోరుతాను," అని చెప్పాడు.

లక్ష్మణుని నవ్వుకి అసలు కారణం తెలియగానే అనవసరంగా తాము అతన్ని అపార్థం చేసుకున్నామే అని బాధపడ్డారు పెద్దలంతా.

చూశారా! నిండు సభలో నవ్వినందుకు ఎంత ప్రమాదం జరిగిందో! అందుకే నవ్వు నాలుగు విధాలా చేటు అన్నారు పెద్దలు. ★

# ★ కృష్ణా జిల్లా బస్సు రవాణా ★

(6-వ పేజీ తరువాయి)

ఎంక్వైరీ ఆఫీసు ఎక్కడుందో అని అడిగి తెలుసుకోడానికి పావుగంట పట్టింది. ఫలానాచోట ఎంక్వైరీ ఆఫీసుంది అన్న విషయం తెలిపే బోర్డులాటిది విజయవాడ బస్సు స్టాండులో నాకు కన్పించలేదు. బందరులో "ఎంక్వైరీ ఆఫీసు ఏది?" అని ప్రశ్నిస్తే ఎవరో మహాత్ములు వేలటు చూపించారు. అదికనుచూస్తే ఓగోడ కానించిన పెద్దబోర్డుమీద బస్సుల రాకపోకల వేళలూ, చార్జీలు వగైరా వివరాలున్న పెద్ద కాగితం అతకబడి వుంది. దానిపక్కనే చిన్న పాకలాటిది వుంది. అదే ఎంక్వైరీ ఆఫీసు అనుకోమని ప్రార్థన. కాని అందులోమాత్రం మనిషి కాదుగదా, లాంఛనార్థం ఓ కుర్చీకూడా లేదు. పోనీ ఆచుట్టుపట్ల 'ఎక్కడా' ఎంక్వైరీ ఆఫీసు' అన్న బోర్డయినా కన్పించలేదు.

ఇహ ఈ ఎంక్వైరీ ఆఫీసర్లు (వాళ్ళపేరు అదే అనుకుంటాను) గురించిన మరోక చిన్న సంఘటన వుంది.

ఏప్రిలు 5 వ తారీఖు విజయవాడ వెళ్ళాలని బందరు బస్‌స్టాండ్‌కి వెళ్ళి ఆ టైంటేబిలు కాగితంచూస్తే ఆఖరుబస్సు రాత్రి 7-20 కని వుంది. నేను బస్‌స్టాండ్‌కు సరిగ్గా 7-15 కల్లా చేరుకున్నాను. అక్కడ మరో మిత్రుడు తటస్థపడ్డాడు. తనూ విజవాడ కెళ్ళే బస్సుకోసమే ఆరింటినుండీ కాచుకూర్చున్నాననీ, గంటంపావు నుండి ఒక్కబస్సయినా రాలేదనీ చెప్పాడు. ఆ టైంటేబిల్ ప్రకారం ప్రతీ ఇరవై నిముషాలకూ ఒక బస్సు రావాలి. గంటంబావునుండీ బస్సు రాలేదంటే-కనీసం మూడు బస్సులయినా వస్తూవుండాలి అని తీర్మానించుకుని నేనూ బస్‌స్టాండ్‌లో ఆగాను. అడుగుదామంటే ఎంక్వైరీ ఆఫీసులో యథాప్రకారం ఎవరూ కన్పించలేదు. పోనీ మరోసారి ఆ టైంటేబుల్ నయినా చూదామంటే దీపంలేదు! దాదాపు ఓ యాభైమంది విజయవాడ బస్సుకోసం ఎదురుచూస్తున్న వాళ్ళందరూ బస్‌స్టాండుకటు చెల్లాచెదురుగా వున్నారు. 7-35 కి ప్రభుత్వం వారి ఒకబస్సు వచ్చింది. 'హమ్మయ్య' అనుకుని ఈ యాభైమందితో బాటు మేమూ ఆ బస్సుదగరకు ఆశతో పరుగెత్తాము.

"ఈ బస్సు ఈరాత్రి కిక్కడేవుండి పొద్దున్నే బయలుదేరుతుంది." అన్నాడు ఆ కండక్టరు.

"మరి ఆఖరుబస్సు—7-20 కి బయలుదేరవలసిందిగాని అంతకుముందువి రెండుగాని రాలేదేం?" అని అడిగితే—

"అవన్నీ నాకు తెలియవుకాని ఒకబస్సు కోనేటిదగ్గర అరఘంటనుండీ నిలబడివుంది. అది విజయవాడ వెళ్తుంది. కావాలంటే అక్కడికెళ్ళి అందులో ఎక్కండి - స్థలం వుంటే" అన్నాడు ఆ కండక్టరుగారు సానుభూతితో.

రిక్షాలమీద వెళ్ళి నేనూ, నా మిత్రుడూ రెండున్నర ఫర్లాంగుల కవతలవున్న విజయవాడ బస్సునందుకున్నాం. మా ఇద్దరికి సీట్లు లభించాయి. అపాటికే బస్సు నిండిపోయి వుంది. పాపం ఆరింటినుంచీ బస్సుస్టాండ్‌లో కాచుకుని కాచుకుని, అక్కడనుంచి పిల్లా జెల్లా, మూటాముల్లేతో పరుగెత్తుకొచ్చిన ప్రయాణీకులు వెనక్కి తిరగాల్సి వచ్చింది.

"ఏమండీ ఈ బస్సు బస్‌స్టాండ్‌దాకా రాకపోవడంలో మహదాశయం ఏమిటీ?" అని టికెట్ చెకింగ్ ఇన్‌స్పెక్టరు నడిగితే "బస్‌స్టాండ్‌లో ప్రయాణీకులే లేరటగా, అందుకని బస్‌స్టాండ్‌దాకా రానక్కరలేదని మా సూపర్‌వైజర్ గారు చెప్పారు." అని సమాధానం వచ్చింది. ఆ సూపర్‌వైజర్ ఏవరో, ఆయన ఎక్కడుంటాడో పర్యాంతర్యామికే ఎఱుక. అబస్సు 7-20 కి బందరువదలి విజయవాడకి 9-50 కి చేరాల్సింది; 8-10 కి బయలుదేరి 10-55 కు చేరింది.

ఆవిధంగా 5-4-58 న బందరులో మేము అష్టకష్టాలూపడి అందుకున్న బస్సునంబరు APZ. 2025-No 3/- నా టిక్కట్టు నెంబరు 1213. మరి ఇది అరణ్యరోదనేగా....

మరోసారి ట్రిప్పులో ఎవరో పల్లెవాసులు నాలుగు పెద్దపెద్ద మూటలతో ఎక్కబోతే కండక్టరు వారించి, వారివద్దనుంచి—లగేజి తూచకుండానే—"ఆ... దీనికి లగేజిఛార్జి రెండురూపాయలవుతుంది" అని రెండురూపాయలు పుచ్చుకుని, ఆమూటల్ని బస్సుపైన పారేయించాడు. లగేజివివరాలేవి రాయకుండానే వారికి టిక్కట్టు రాసిచ్చాడు. వారికి చదువు రాదాయె. కాస్తదూరం తర్వాత ఓ చెకింగ్ ఇన్స్పెక్టరు వచ్చి ఆతొమ్మిది కాలమ్సు షీటును చెక్ చేశాడు. "లగేజీ ఏమీ లేదా?" అని అడిగాడు.తొణక్కుండా "లేదు"-అన్నాడు కండక్టరు. ఇన్‌స్పెక్టర్ సంతకంచేసి దిగిపోయాడు. అతడి ధర్మం అతడు నిర్వర్తించాడన్న మాట!

ఆదాయంలో నిష్పత్తిలో కొప్పకోని పనితో ఫలితం స్వల్పమైన బాధ్యతలతో, ఉద్యోగులని పీడిస్తే ఏర్పడే ఫలితం ఇది. ఈ అవినీతికి నైతిక పతనమూ కారణమయినా డబ్బు ఇబ్బంది అతి ముఖ్యాధారం అని

# స్వార్జితము

(35 వ పేజీ తరువాయి)

: 'యిగా పత్రికవాళ్ళు ఏదైనా వస్తువు పంపి వుంటే బాగుండేదని అనిపించింది నాకు.

సినిమా వదిలారు. బస్సెక్కేటప్పుడు 'ఇదే ఆఖరిసారి అడుగుతున్నా, నీకిష్టముంటే పన్నా, సునీతను హోటల్‌కు తీసికెళ్ళి రు 5 లు బిల్లుచేయి' అన్నారు మావారు. నాకు చాలా చీకాకు కలిగింది, వీరెంటి ఇవాళ ఇలా ఏడ్పిస్తున్నారని. నన్నేడిపించడమంటే (తమాషాగా) మావారికి భలే సరదా.

ఇంటికి చేరేటప్పటికి సాయంత్రం 6-30 గంటలయింది. ఇంటిదగ్గర మాచాకలివాడు మాకోసం ఎదురు చూస్తున్నాడు. డబ్బుకోసం వచ్చాడట. ఒకటో తారీకు ఇంకా రాలేదు; రెండు రోజులు పోయినతర్వాత రమ్మని అతనికి చెప్పాను. కాని అతను "నిన్నటినుంచి మేమంతా పస్తువున్నామమ్మా. ఇంట్లో చాలా ఇబ్బందిగా వుంది' అన్నాడు. నాదగ్గర డబ్బులున్నప్పుడు సహజంగా లేదని నేను చెప్పను. అందులోనూ ఇటువంటి పరిస్థితిలో లేదని ఎలా చెప్పగలను. అయితే ఇంట్లో పత్రికవాళ్ళు పంపిన 5 రులు తప్ప ఇంకేమీ లేదు. ఏదైనా వుంటె 1,2 రూ. ల చిల్లర మాత్రము వుండాలి. నాకో పెద్ద సమస్య! అయిపోయింది. అందుకే మా వారి నికన్నడంలో అడిగాను (ఎదుటి వారికి మేము మాట్లాడేది తెలియకూడదని ఎందుకంటె ఇక్కడ వీరికి కన్నడం బొత్తిగా తెలీదు) 'నేనిప్పుడు నా దగ్గరున్న 5 రు ఇస్తాను. జీతం వచ్చిన తర్వాత మీరు నాకు తిరిగి ఇచ్చెయ్యాలి, కాని వారు నా బలహీనాన్ని గుర్తించారు. అందుకే నిక్కచ్చిగా 'నీకిష్టముంటే ఇవ్వు', లేకపోతే లేదని చెప్పు. నేను మాత్రం జీతంలో నీకు డబ్బు వాపసు చేయను' అని చెప్పారు. చాకలివాని మొహం చూశాను. ఎంతో దీనంగా వుంది. అతను పస్తువున్నట్టు స్పష్టంగా కనిపిస్తూనే వుంది. రెండు రోజులనుంచి నా స్వార్జితం 5 రూపాయలను ఎలా ఖర్చుపెట్టాలో తెలియక తికమక పడుతూ వున్న నేను, పోనీ ఇతర్ల కష్టంలో సహాయపడుతుందనే తృప్తిలో రు 5 లు తీసి చాకలికిచ్చాను. పిల్లి బొచ్చు పర్సులో హాయిగా పవ్వళించి వున్న రు 5 లు చాకలివాని మురికి చేబులోకి ప్రవేశించినా, నేనేమీ చేయలేక పోయాను!





# కృష్ణాజిల్లా బస్సురవాణా



మరవడానికి వీల్లేదు. ముందు సరయిన వేతనాలిచ్చి అటర్వాత నీతిలెక్చర్లు, శిక్షలూ వగైరా ప్రయోగించవచ్చు. నామట్టుకు నేను ఆరోజు కండక్టరలా చేస్తూంటే ఏమీ అన లేక పోయాను. కారణం-రోజుకు 12,16 గంటలు చొప్పున దినబత్తెం లేకుండా కేవలం నెలకు అరవై రూపాయిలకని ఈ బండ చాకిరీ ఎవడు చేయగలడూ?

ఈ సంఘటన చూడగానే నాకు చాల బాధనిపించింది. నాందిలోనే ఈ జాతీయీ కరణ అపశ్రుతులు పలుకుతున్నటని పించింది. ఇది మామూలు-అయిపోక మునుపే గద్దెల మీది పెద్ద మనుషులు గమనిస్తారని ఆశించ వచ్చును వుంటాను.

ఇహ ఈమార్గాల్లో ఆదాయంహెచ్చించ డానికి ఈ క్రింది పద్ధతులు పనికి రావచ్చు.

(1) ప్రభుత్వం రవాణాలో ఎన్నో కొత్త సౌకర్యాలు కల్గించింది. కాబట్టి బస్సు ఛార్జీలు మునుపటికన్న కాస హెచ్చించినా సంతోషంతో ఇవ్వడానికి ప్రజలు సిద్ధంగావున్నట్లు నా అనుభవం.

(2) ఎక్స్‌ప్రెస్ ఛార్జీ ప్రస్తుతం మామూలు బస్ ఛార్జియే. అలాకాకుండా ఎక్స్‌ప్రెస్ బస్సుఛార్జి కొస్త హెచ్చించ వచ్చు.

(3) ప్రసుతం ఎక్స్‌ప్రెస్ బస్సు-ఉదాహరణకు-విజయవాడ బస్‌స్టాండ్‌ను వదిలితే విజయవాడ మునిసిపల్ సరిహద్దుల్లో కూడా ఎక్కడ ఆగడంలేదు. కనీసం, ప్రజలకీ ఎక్స్‌ప్రెస్‌బస్ కావాలంటే బస్‌స్టాండ్‌కే రావాలన్న అలవాటు రప్పించేదాక, బస్‌స్టాండ్ కాక ఎక్స్‌ప్రెస్ స్టాపులు ఒకటో రెండో ఏర్పాటు చేయవచ్చు.

(4) ఇవన్నీ కాక, బస్సుల్లో పలా, బస్సు వెలుపల వెనకా, ఇరుప్రక్కలా వున్న ఖాళీ స్థలాల్ని ప్రకటనలకు అద్దెకివ్వడంతో ఎంతో రాబడికి ఆస్కారం వుంది.

(5) ఈబస్సు రాకపోకలు, వాటికి సంబంధించిన రూల్సు వగైరా చిన్న (ఎకొ్కలపుస్తకాలు) పుస్తకం క్రింద ప్రచురించి వాటిని అర్ధణాకో అణాకో అమ్మవచ్చు. ఆపుస్తకంలో ప్రకటనలూ అవీ అనుమతించవచ్చును.

ఈవిధంగా ఆదాయం హెచ్చించి ఉద్యోగుల వేతనాలు పెంచి, ప్రజలకు ఇతోధిక సౌకర్యాలు కలిసే ప్రభుత్వపు ఈ జాతీయీకరణ ప్రయత్నం నూటికి నూరు పాళ్ళు సఫలమై, ప్రజలకు ప్రభుత్వంపై వున్న ప్రేమ, నమ్మకం స్థిరపడి, ప్రభుత్వం వారు క్రమంగా ఇతర మార్గాలను కూడా జాతీయంచేయడానికి దోహదం కాగలదు.

ప్రజాస్వామ్యంలో ప్రభుత్వంవారి ప్రయత్నం దేనికయినా ప్రజల ఉత్సాహం వెన్నెముక. కృష్ణాజిల్లాలో ఈ ప్రాంతవాసులు ఈ బస్సు మార్గాల జాతీయీకరణకు ఎంతో ఆనందోత్సాహాలలో స్వాగతమిచ్చారు. వారు ప్రస్తుతం పైన ఉదహరించబడిన ఇబ్బందులన్నీ భరిసున్నదీ ఆ ఉత్సాహంతోనే—ఏనాటికయిన తమ కష్టసుఖాలు గుర్తించగలది ఒక్క ప్రభుత్వమే అన్న నమ్మకంతోనే. ప్రజల ఈ హృదయపూర్వకమైన భావాలు చల్లారిపోవకమునుపే ప్రభుత్వంపైన చెప్పిన లోట్లను సర్దివేయాలి. కాకపోతే కేంద్ర ప్రభుత్వం విమానమార్గాలనూ, భీమాసంస్థలనూ జాతీయం చేసిన తర్వాత బయలుదేరిన రసాభాసలూ, దుమారాలూ రాకమానవు. ఇలాంటి అవాంఛనీయ పరిణామాలు రాకముందే రాష్ట్ర ప్రభుత్వం వారు నడుము బిగిస్తారని ఆశించడంకన్న సామాన్యుడు చేయగలిం దేముంది? ★



# సినిమా

## రాష్ట్రపతి హితవాక్యం

భారతీయ విజ్ఞాన భవన్‌లో ఈ ఏడాది బహుమతి ప్రదానోత్సవం, గత నాలుగేళ్ళకన్న బాగా జరిగిందని ఢిల్లీ వెళ్లివచ్చిన వారంతా మెచ్చుకున్నారు. ప్రధాని నెహ్రూ, కేంద్ర మంత్రులూ, ఇతర అధికార అనధికార ప్రముఖులు, మూడు ఫిలిం కేంద్రాలనుండీ ప్రతినిధులూ, చలనచిత్ర అభిమానులూ పలువురు వచ్చారు.

డా॥ రాజేంద్రప్రసాద్, బహుమతులు ఇస్తూ, ఉత్తమ చిత్రాల యోగ్యతను నిర్ణయించడానికి ప్రమాణం, ఆయా చిత్రాలలో వినోద, విజ్ఞాన ప్రదాయకాంశాలను ఎంత వరకూ, ఎంత అందంగా మేళవించడం జరిగిందీ అన్నదేనని చెప్పారు. నేటి మన చిత్రాల తరహాను ప్రస్తావించి, 'లేత మనసుల'పై ఇవి ఎటువంటి ముద్రలు వేస్తున్నాయి, వాళ్ళని ఎంతగా పాడు చేస్తున్నాయి అన్న సంగతిని ఇదమిత్థంగా చెప్పలేకపోయినా, మొత్తానికి వస్తున్న చిత్రాలన్నీ చిన్న వాళ్ళు చూడదగ్గవనలేమని ఆయన అన్నారు.

అందువల్ల, తీసే చిత్రాలకూ, చూసే జనాభాకూ, పరిచయం తగునా అన్న విషయం ఆలోచించి, హద్దులు ఏర్పాటు చేసుకోవడం మంచిదని ఆయన హితవు చెప్పారు.

రాష్ట్రపతి హితవాక్యంలో ధ్వనించిన విమర్శ స్థూలంగా అందరికీ వర్తించినా బొంబాయి క్రైమ్ పిక్చర్లకు బాగా పడుతుంది. వీటిలో కొత్త కొత్త పద్ధతులలో దొంగతనాలూ దోపిడీలూ సాగించి, 'పోలీసులకు ఫోటోజెనిక్‌గా టోకరాలు ఇస్తూ చివర్ని సంఘాన్ని, ధర్మాన్ని చివాటేసి చెక్కేసే హాలీవుడ్ మార్కు బొంబాయివాళ్లీ దొంగల కథలద్వారా క్రైమ్ 'విజ్ఞానాన్నీ', సెక్సు డాన్సులద్వారా వినోదాన్నీ మేళవిస్తున్నారు. రామాయణ, భారతాల దగ్గర్నించి ఏ కథతీసుకున్నా దానికి 'క్రైమ్ థ్రిల్లరు' వైద్యం చేసేసే ధోరణి నేటిపరిశ్రమకు జెండా. అందుచేత, వీటిలో కొన్ని ఫలనా ఈడు వాళ్ళు చూడతగనివి, మరికొన్ని చూడ తగినవీ అని, ఏరటం, చాలా కష్టం...



కాశీనాధ్ ప్రొడక్షన్స్‌వారి 'శ్రీరామాంజనేయ యుద్ధం'లో రఘురామయ్య.



హిందీచిత్రం "దో అన్‌ఖేన్ బారాహాత్"కు రాష్ట్రపతి స్వర్ణపతకం, రూ. 25 వేల బహుమతి లభించాయి. చిత్రనిర్మాత శ్రీ వి. శాంతారాంకు రాష్ట్రపతి బహుమతి ప్రదానం చేస్తున్నారు.

## ఏటేటా చలనచిత్రోత్సవం

ఢిల్లీ ఉత్సవానికి తెలుగు పరిశ్రమ తరఫున 'భాగ్యరేఖ' దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి, నటి శ్రీమతి జమున, 'తోడికోడళ్లు' దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు, నటుడు శ్రీ నాగేశ్వరరావు నటి శ్రీమతి సావిత్రి వెళ్లారు.



ఢిల్లీలో బహుమతి ప్రధానోత్సవం జరిగినసందర్భంలో తీసినచిత్రం డా॥ రాధాకృష్ణన్, ఢిల్లీరేడియోస్టేషన్ డైరెక్టర్ శ్రీ ఎస్. ఎన్. మూర్తి, నటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు, లోక్ సభ అధ్యక్షులు శ్రీ అనంతశయనం అయ్యంగారు.

## రాష్ట్రపతి హితవాక్యం

ప్రభుత్వం బహుమతులు ఇచ్చినపుడే చలన చిత్రోత్సవంవంటి దొకటి ఏర్పాటు చేయడం అవసరమని ప్రముఖ దర్శకనిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డి సూచించారు. ఢిల్లీ ఉత్సవం తీరుతెన్నులను చూచినవారు ఎవరైనా ఈ ఏర్పాటు చాలాఅవసరమని అంగీకరిస్తారు.

"అసలదంతా చాలాయాంత్రికంగా జరిగిపోయింది. ఏదో కర్మకాండ అన్నట్టుగా. అందరిచేతా ఉపన్యాసా లిప్పించాలని కాదుగాని, దేశం నలుమూలలనుండి వచ్చినవాళ్లు ఎవరెవరో పరిచయం చేయడంవంటి దైనా జరగాలికదా. అలాకాక, ఏదో ధర్మంచేస్తున్నట్టు, వచ్చినవాళ్ళు ఎవరో మాకు తెలీదన్నట్టు ఉంది" అని ఆయన అన్నారు.

బొంబాయిస్టార్లూ, ప్రొడ్యూసర్లు అయితే, ఢిల్లీవాళ్లకి తెలుస్తుంది. కాని, ప్రాంతీయ చిత్రపరిశ్రమ ప్రతినిధుల సంగతి అలాఉండదు. వాళ్లనివాళ్లే, సాటి వాళ్ళకి పరిచయం చేసుకోవలసి వచ్చింది.

బహుమతు లిస్తామని ఇంతదూరమూ పిలిపించి, ఇలా మర్యాదచెయ్యడం భావ్యం కాదు. కాగా, వీళ్ళని ఎందుకుపిలిచారు? వాళ్ళుతీసినచిత్రాలు బాగున్నందుకు. అయినపుడు, వాటిని సభకువచ్చిన వారికి చూపడం అవసరంకదా. అదీలేదు. సువర్ణపతకం వచ్చిన చిత్రం ఒకటే చూపించినంత మాత్రాన చాలదు. నాలుగుప్రాంతాలవారు, ఈపండుగ వేళనైనా, ఒకరిచిత్రాలు ఒకరు చూచి తెలుసుకోవడానికి సదుపాయం జరగడం అవసరం.

"దీనికి, బహుమతి ప్రదానంతోపాటే, దేశీయ చలనచిత్రోత్సవంకూడా ఏర్పాటు చేస్తే అనుకూలంగా ఉంటుంది. ఆ నాలుగు రోజులూ అన్నిప్రాంతాల చిత్రాలూ (బహుమతులు వచ్చినవి) వేయవచ్చు" అని రెడ్డిగారు అన్నారు.

అంతేకాక, ఈబహుమతి ప్రదానోత్సవాలు ఏటేటా ఒకచోట పెడితే బాగుంటుందనికూడా ఆయన సూచించారు.

* * *

ఢిల్లీ ఉత్సవంపై వచ్చిన మరోసూచన: బహుమతులు పొందిన చిత్రాలపై రాష్ట్ర ప్రభుత్వాలు వినోదపు పన్ను రద్దుచేయాలి. కన్నడ దర్శక నిర్మాత శ్రీ ఆర్. నాగేంద్రరావు ఈ సూచన చేశారు. ★

## ఫిలిం ఫాన్స్ సంఘం బహుమతులు

మద్రాసు చలన చిత్రాభిమానుల సంఘం 1957 వ సంవత్సరానికి ఉత్తమ నటులను, చిత్రాలను గతవారం ఎన్నిక చేసింది. బహుమతి ప్రదానోత్సవం జూన్‌లో జరుగుతుంది. ఉత్తమ చిత్రాలను ఎన్నిక చేసిన సంఘ సభ్యులను, తంజావూరులోని 'కరుణానిధి తమిళ సంఘం'కు పాతిక వేల రూపాయలు విరాళమిచ్చిన ప్రముఖ నిర్మాత శ్రీ ఎ. కె. వేలన్‌ను గతవారం దాసప్రకాష్ హోటల్‌లో సంఘ సభ్యులు సన్మానిం

దారు.

ఉత్తమచిత్రాలు: తోడికోడళ్ళు (తెలుగు) ఎంగళ్ వీట్టుమహాలక్ష్మి (తమిళం–ఈ రెండూ అన్నపూర్ణా వారివే) పాడాత్త పైంకిలి (మలయాళం), ప్రేమద పుత్రి (కన్నడం).

ఉత్తమ తెలుగు నటుడుగా ఎన్. టి. రామారావు (ఎన్. ఎ. టి. వారి పాండురంగ మాహాత్మ్యం) ఎన్నిక అయ్యారు. తమిళంలో శివాజీ గణేశన్ (మక్కళై పెట్ర మహారాశి), మలయాళంలో సత్యన్, కన్నడంలో కెంపరాజ్.

తెలుగు తమిళ చిత్రాలలో ఉత్తమనటిగా (తోడికోడళ్లు, వణంగాముడి) సావిత్రి ఎన్నిక అయింది. కన్నడంలో హెచ్. ఆర్. సంధ్య, మలయాళంలో కుమారి ఎన్నిక అయ్యారు.

ఉత్తమ హాస్యనటులు రేలంగి వెంకటరామయ్య (పొన్నలూరివారి భాగ్యరేఖ), చంద్రబాబు (భరణీవారి మణముగన్ తేవై), మలయాళం: ఎస్. పి. పిళ్లై), కన్నడం గణపతిభట్.

ఉత్తమ సహాయ నటులుగా, గుమ్మడి వెంకటేశ్వరరావు (చందమామ వారి దొంగల్లో దొర) కె. ఎ. తంగవేలు (ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి), ముత్తయ (మలయాళం) ఉదయకుమార్ (కన్నడం), కన్నాంబ (తెలుగు–విక్రమ్‌వారి కుటుంబ గౌరవం), ఎం. ఎన్. రాజం (మహాదేవి), శ్రీరంజని జూనియర్ (కన్నడచిత్రసీమలో), పంకజవల్లి (మలయాళం) ఎన్నిక అయ్యారు.

ఉత్తమ బాలనటిగా 'యార్ పయ్యన్?' చిత్రంలో నటించిన డెయిసీ ఇరానీ ఎన్నిక అయింది. ★



1957-వ సంవత్సరానికి తెలుగు తమిళ చిత్రసీమలలో ఉత్తమనటిగా ఫిలింఫాన్స్ సంఘంవారు సావిత్రిని ఎన్నిక చేశారు.



రిపబ్లిక్ వారి "పెళ్లి సందడి"లో అంజలీదేవి, గుమ్మడి

# శ్రీ నాగిరెడ్డి హెచ్చరిక

భారతీయ చిత్రాలు ఏడెనిమిది వేల అడుగులలో తెమిలిపోగా చూడాలని కేంద్ర మంత్రి మురార్జీ దేశాయ్ గారి లాగే చాలామంది ముచ్చట పడేవారు వున్నారు. ఊహమంచిదేగాని, దాన్ని హఠాత్తుగా అమలులోకి తేవడం, లక్షలాది పనివారికి అన్నంపెడుతున్న పరిశ్రమతో చెలగాటం ఆడడం అవుతుంది. విదేశీద్రవ్యం పొదుపు చేయడానికని గతజూలైలో ముడి ఫిలిం దిగుమతి నూటికి 40 వంతులు కోతపెట్టినప్పుడే పరిశ్రమలో అంతటా కలవరం చెలరేగింది. నిలవవున్న ఫిలిముతో కాలక్షేపం చేస్తే ఈసారి కోటాలు ప్రకటించినపుడు పరిస్థితులు మెరుగు అవుతాయని అంతా ఆశించారు. తీరా, ప్రభుత్వం పాతకోతకు ఇంకో ఇరవై వంతులు తగిలించి అరవైకి పెంచడంతో అందరూ విభ్రాంతులై పోయారు. ఇక్కడ ఉత్పత్తిలేని ఈ సరుకును తగ్గించి, సాలుకు పన్నెండుకోట్ల రూపాయలు పన్నులు కడుతూ, విదేశాలనుండి 2 కోట్లు సంపాదించిపెడుతూ దేశంలోని పరిశ్రమలలో ద్వితీయస్థానం వహించిన సినిమాను ఇంత లోకువచేసి, క్షోభపెట్టడం భావ్యం కాదు. ఈ పరిశ్రమ శ్రేయస్సుకై పాటిల్ కమిటీచేసిన సిఫార్సులను త్రోసి రాజనడం సబబూకాదు. ఇన్నిటికీ వడిగట్టి ప్రభుత్వం పొదుపు చేయదలచినది, చెయ్యవలసిన దానిలో నూటికి పావలా లేదు.

## కాబట్టి ....

ఆరు భాషల చిత్రాలకు నిర్మాణ కేంద్రంగా, కోట్ల పెట్టుబడితో నడుస్తున్న మద్రాసు పరిశ్రమకు ఇది గొడ్డలిపెట్టు. ఈ మాటను, పరిశ్రమకు నాయకుడు, ప్రతినిధి, ఆసియాలో అగ్రస్థానం వహించిన వాహినీ స్టుడియో అధిపతిఅయిన శ్రీ బి. నాగిరెడ్డి గారు అసందిగ్ధంగా చెప్పారు. పరిశ్రమతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలు వున్నవారూ, పరిశ్రమ శ్రేయోభిలాషులూ కూడా "ముడిఫిలిం కోత పరిశ్రమపై పెద్ద దెబ్బతీస్తుంది; అభివృద్ధికి ఆటంకం అవుతుంది" అని ఆయన చేసిన హెచ్చరిక అక్షరాలా వాస్తవమని బలపరుస్తున్నారు. ★



రాష్ట్రపతి అభినందన లందుకొంటున్న నటి ('తోడికోడళ్లు') శ్రీమతి కె. సావిత్రి.

# సినీ వార్తావరణం

ముడిఫిలిం కొరత, పన్నుల ధాక వగైరాల వల్ల, తారలు వేళకురాక, థియేటరు చాలక కలిగే ఇబ్బందులవల్ల, ఎంత హైరానగా ఉన్నా, ఎంతటి ఉత్పాతాలు విరుచుకపడుతున్నా, దేశంలో నిర్మాతలు వెన్ను చరుచుకు, ఉత్సాహంతో ముందుకు సాగుతూనే ఉన్నారు. మద్రాసులో చిత్ర నిర్మాణం భారీఎత్తున సాగిపోతోంది. దాన్నిబట్టి దేశంలో, వాటిని ఆడించడానికి చోటు గిరాకీ ఎక్కువగా ఉంది. తయారైన చిత్రాలు,విడుదలకు కాచుకుకూర్చున్నాయి. కొందరు, "వచ్చే ఐదారు నెలలలో చోటు ఎలాగా దొరకదు. కాబట్టి తొందరేల మనకు" అనుకుని, స్థిమితంగా తాపీగా పనులు సాగిస్తున్నారు. వాళ్ళకి ఆ ఊహ తట్టకపోతే, పని రద్దీగా ఉన్న నటులే, పరిస్థితులు వివరించి,—"వచ్చే రెణ్ణెల్లూ పోటీ ధాటీగా ఉంటుంది - ఆపైన రెణ్ణెల్లు వానలు కురియు. అందాకా తొందరేల. అంచేత నా కాల్ షీటు ఆగస్టులో వేసుకోండి" అని నిర్మాతలకు నచ్చచెబుతున్నారు.

నిర్ణీత కార్యక్రమం ప్రకారం, "కథ" నడిపే సంస్థలు మాత్రం యథాప్రకారం నిర్మాణం సాగిస్తున్నాయి.

* * *

## విజయ పరంపర

ప్రభుత్వ ప్రశంసాపత్రం సంపాదించుకొన్న అన్నపూర్ణావారి 'తోడికోడళ్లు' చిత్రాన్ని మొన్న మద్రాసు ఫిలిం ఫాన్స్ సంఘంవారు 1957 కు ఉత్తమ తెలుగు చిత్రంగాను, దాని తమిళ ప్రతి 'ఎంగల్ వీట్టు మహాలక్ష్మి'ని ఉత్తమ తమిళచిత్రంగానూ ఎన్నిక చేశారు. ఆచిత్రంలో నటనకు, శ్రీమతి సావిత్రిని ఉత్తమ తెలుగునటిగానూ, ఉత్తమ తమిళనటి (వణంగాముడి) గానూకూడా ఎన్నికచేసుకున్నారు. 'తోడికోడళ్లు' చిత్రం,ఇటీవలే సినిమాపత్రిక 'కినీమా' బాలెట్‌లో కూడా ఉత్తమ తెలుగుచిత్రంగా ఎన్నిక అయింది. అందులో నటనకు శ్రీ ఎ. నాగేశ్వరరావును ఉత్తమ నటుడుగా ఎన్నుకొన్నారు.

* * *

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి కొత్తచిత్రం 11 రీళ్ళు తయారైంది. ఈవారం మూడు పాటలు రికార్డు చేస్తున్నారు. ఇవి అవుతూనే, గత డిసెంబరులో వేసుకొన్న కార్యక్రమం ప్రకారం రేపు మే 6 న ఈ బృందం ఔట్‌డోర్ దృశ్యాల చిత్రణకై ఊటీ బయల్దేరుతున్నారు. నటులు నాగేశ్వరరావు, రేలంగి, రంగారావు, సావిత్రి, రాజసులోచన, నిర్మాత మధుసూదనరావు, దర్శకుడు సుబ్బారావు, ఛాయాగ్రహణ దర్శకుడు పి. ఎల్. రాయ్ ముఖ్యులు.

'అగ్ని పరీక్ష' అనే బెంగాలీ ఇతివృత్తం ఆధారంగా, దీనికి కొత్త పద్ధతిలో కథను రూపొందించారు. మాటలు ఆత్రేయ, పాటలు శ్రీశ్రీ, ఆత్రేయ వ్రాశారు. సంగీతం వేణు.

జులైలో ఈచిత్రం విడుదలకు సిద్ధం కాగలదని తెలుస్తోంది.

* * *

మే 9 న కాశీనాథ్ ప్రొడక్షన్స్ వారి 'శ్రీరామాంజనేయ యుద్ధం' విడుదల అవుతోంది. చాలకాలంగా పరిశ్రమలో వున్నా తొలిసారిగా, ఈచిత్రంద్వారానే ఎస్.ఎన్. ఆచార్య, దర్శకుడుగా ఆంధ్ర ప్రేక్షకులకు పరిచితు లవుతున్నారు. శ్రీరంజని, అమర్‌నాథ్, రాజనాల, ముక్కామల, సూర్యనారాయణ (సువర్ణమాల) ఇందులో నటించారు. రచయిత కొవ్వలి. సంగీత దర్శకుడు జంధ్యాల లక్ష్మీనారాయణ. నిర్మాత కాశీనాథుని సుబ్రహ్మణ్యం.

* * *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి 'వీరప్రతాప్' మే తొలివారంలో విడుదల కాగలదని తెలుస్తోంది. శివాజీ గణేశన్, పద్మిని, తంగవేలు ఇందులో పాల్గొన్నారు. దర్శకుడు తాతినేని ప్రకాశరావు. మాటలూపాటలూ శ్రీశ్రీ వ్రాశారు.

* * *

మే నెల రాగల మరోచిత్రం పొన్నలూరివారి 'శోభ'. కమలాకర కామేశ్వరరావు గారి దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో రామారావు, అంజలీదేవి, రాజసులోచన, రేలంగి, ముక్కామల, రమణారెడ్డి, మొదలగువారు నటించారు. దీనికి మాటలు డి. వి. నరసరాజు, పాటలు నిర్మాత వసంతకుమార రెడ్డి, వ్రాశారు. సంగీత దర్శకుడు ఎ. ఎం. రాజా. నృత్యాలు వెంపటి సత్యం కూర్చారు.

* * *

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి 'కృష్ణమాయ' మే నెలాఖరులోగా వస్తుందనుకుంటున్నారు. నాగేశ్వరరావు, జమున నటించిన ఈ చిత్రానికి సి. ఎస్. రావు దర్శకుడు.

* * *

జూపిటర్ పిక్చర్స్ వారి 'ఉత్తమ ఇల్లాలు' మొన్న 17-న విడుదల అయింది. సావిత్రి, జెమినీ గణేశన్ నాయికా నాయకులు. దర్శకుడు ఎ. ఎస్. ఎ. స్వామి.



1957 కు ఉత్తమ తెలుగు నటుడుగా, ఫిలింఫాన్స్ సంఘంవారు, ఎన్. టి. రామారావును ఎన్నిక చేశారు.

# కొత్త డాక్యుమెంటరీ చిత్రాలు

ఫిలింస్ డివిజన్‌వారు ఇటీవల విడుదల చేసిన కొత్త డాక్యుమెంటరీ చిత్రాలను గతవారం మద్రాసు 'న్యూ ఎల్ఫిన్‌స్టన్'లో పత్రికలవారికి చూపించారు.

అవి: నాగార్జునకొండ, ఆల్ ఎబౌట్ టీత్, స్టోరీ ఆఫ్ డాక్టర్ కార్వే, మండూ- ది సిటీ ఆఫ్ జాయ్, షిప్ యార్డ్స్ టు సీ వేస్, డు యు నో?, 496 న్యూస్ రీల్.

వీటిలో మొదటిచిత్రం పై సమీక్ష ఇంతకుముందువెలువడింది. రెండవది,దంతాల పరిరక్షణ గురించినది. పన్ను స్వరూపం, అందులో వివిధ భాగాలూ, అశ్రద్ధచేస్తే వాటికి వాటిల్లే ప్రమాదం, దానివల్ల కళ్ళు, ముక్కు, చెవులూకూడా ఎలా దెబ్బతినేది, అందరికీ తేలికగా తెలిసేలా వివరించారు. తెలుసుకోడానికై వెళ్ళి చూడతగ్గ చిత్రం.

## డా॥ కార్వే

తరువాతది, భారతరత్న డా॥ కార్వే జీవిత విశేషాలను సంగ్రహంగా తెలుపుతూ తీసినది. మానవకల్యాణానికై కంకణంకటి నూరేళ్ళు నిండుగా, సార్థకంగా జీవితం సాగించి, ఈనాడు నూట వొకటవ ఏట, హాయిగా కాలుపెట్టిన డా॥ కార్వేకు భారతి మహిళలు, ముఖ్యంగా మహారాష్ట్ర మహిళాలోకం ఎంతైనా ఋణపడి ఉంది. సాంఘిక దౌర్జన్యాలకు, పౌరుషేయ శాసనాలకు గురిఅయి నలిగిపోతూన్న స్త్రీల సముదరణకు, మహర్షి కార్వే అసామాన్య సాహసంతో సహనంతో పోరాటం సాగించారు. వితంతువివాహోద్యమంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారికి సాటిఅయిన వ్యక్తి అనిపించుకున్నారు. (ఈచిత్రంలో రాజారామమోహనరాయ్, వీరేశలింగం ప్రభృతి సంస్కర్తలందరినీ సంస్మరించారు.)

డా॥ కార్వే ప్రథమ కళత్రం మరణించడంతో, ఆయనే ఒక వితంతువును వివాహమాడారు. అపుడు ఆయన ఆప్త మిత్రులు, సంఘులో పెద్దలూ, చివరకూ, సాక్షాత్తు తలిదండ్రులుసహా కార్వే దంపతులను వెలివేశారు. తమ ఉద్యమం బలపడ్డ తరువాత, కార్వే అనాథ శరణాలయం నెలకొల్పారు. దేశం నలుమూలలనుండీ, ఎందరో వచ్చి అక్కడ వృత్తి విద్యలు నేర్చుకున్నారు. తరువాత, ఆయన స్త్రీలకై విశ్వ విద్యాలయం నెలకొల్పారు. వీటిని నడపడానికి మహర్షి కార్వే, కాని డబ్బు దగ్గరనుండీ కూడా యాచించి తెచ్చేవారు. ఈ రోజున ఆయన కృషి సత్ఫలితాలను ప్రసాదించింది. ఏప్రిల్ 19న దేశంఅంతా, ఆయనకు జోహార్లు అర్పించింది. ఆగౌరవానికిరూపమే ఈచిత్రం. ఎటొచ్చి దీనిరూపు రేఖలు తీర్చి దిద్దటం, ఉండదగినంత అమోఘంగా లేదు. 'నాగార్జునకొండ' చిత్రంలో బాగుందనుకుని అదేపనిగా తిరిగిన 'పావుకోళ్ళ కాళ్లు', ఇందులో పావుకోళ్ళుమార్చి అకుజోళ్లుతొడుక్కు తిరిగాయి. అరవై డెబ్భైఏళ్ళ క్రితం, 'పాదచారియై' తిరిగిన కార్వేగురించి చెప్పడానికి, ఆ వ్యక్తిని చూడ్డానికీ, నడుస్తున్న కాళ్ళ ఫొటోగ్రాఫ్ చెయ్యడం ఒక్కటేమార్గం కాదు. అన్ని రకాల చిత్రాలకీ అదేమార్గం అంతకన్నా కాదు. ఇంద్రజాలం లాగే సినిమాలోకూడా ఒకే 'ట్రిక్కు'ను పునఃపునః వాడటంఏమంత మంచిపనికాదు. అయినా, ఈడాక్యుమెంటరీలు చూస్తున్నపుడు, ఒకటి రెండు సందర్భాలలో వినవచ్చే వరసలుకూడా సుపరిచితమైన వనిపిస్తాయి. ఇటీవల రెండువార్తా చిత్రాలలో, సితారుమీద మనోహరమైన ఆలాపన ఒకటి వినబడి ప్రేక్షకులను అలరించింది.

## 'ఈ రాణీ ప్రేమ పురాణం'

'నాగార్జునకొండ' 'మండూ' అనే మరిరెండు చిత్రాలలోఅదేమళ్ళీవినిపించింది. స్వర 'కల్పన'లో అగ్రగణ్యుడైన షిరాలీ వంటివారుకూడా అదేవరసను పదేపదే వాడటం (బాక్సాఫీసుప్రమేయం లేకపోయినా,) బాధాకరం. ఇదిఇనహా, తిరిగి, 'మండూ' అనే చిత్రంలో షిరాలీ వినిపించిన సంగీతం చాలాహాయిగాఉంది. 'మండూ'అనేది పదవ శతాబ్దంలో, ఉచ్చదశలోఉన్న ఒక నగరం. పూర్వపుమధ్యరాష్ట్రంలోఉండేది. కొండంత కోట, చుట్టూరా సముద్రమంత చెరువూను. చుట్టానికి చాలా బాగుంటుంది. అప్పటి నవాబూ ఆయన ప్రేయసీ ఈ నగరంలో నివసించేవారు. ఆమెపేరు రూపవతి. కవయిత్రి. గాయని. ఆమె కట్టినపాటలు ఈనాడు మధ్యప్రదేశ్ జానపద ప్రాంతా



పొన్నలూరివారి 'శోభ'లో రామారావు అంజలీదేవి



సంగీతావారి 'ఇంటిగుట్టు'లో ఎన్. టి. రామారావు, సావిత్రి, బాల

## కొత్త డాక్యుమెంటరీ చిత్రాలు

లలో అంతా పాడుకొంటు ఉంటారట. ఇందులో వినిపించిన రెండు మధుర గేయాలు ఇందుకు నిదర్శనలు. సరే, కొన్నాళ్లకి, ఆ రాజా మొగలాయి రాజులతో యుద్ధానికివెళ్లి బందీ అయిపోయాడు. తిరిగిరాలేదు...

మొన్న చూపించిన డాక్యుమెంటరీలలో, 'ఈ రాణీ ప్రేమపురాణం, 'డు యు నో (మీకు తెలుసా?) అను భారతీయ శిల్ప విభవ పునః పారాయణం, కరుణరసోద్దీపకాలు అని చెప్పుకోవాలి. అంటే, ముడి ఫిలింకోసం నానా క్షోభపడుతున్న స్వతంత్ర నిర్మాతలమీద కరుణ కలిగిస్తాయి. విదేశీ ద్రవ్యం పొదుపుకోసం ఫిలిం దిగుమతి కోత పెట్టి, నిర్మాతలను పొదుపు నేర్చుకోమని హితవు చెబుతున్న ప్రభుత్వం, నిర్మాతలు ఫిలిము దుబారా చేస్తున్నారని కోప్పడి, దిగుమతి కోటాలో కోతపెట్టిన పెద్దలూ, తమ ఆధ్వర్యాన సాగే నిర్మాణాలలో, ఫిలింను మెండుగా దండుగకానివ్వడం భావ్యం కాదు.

## మీకు తెలుసా?

'మీకు తెలుసా?' చిత్రంలో ఏముందో మీకు తెలుసా? కొత్తపేరా మొదలైయే లాగా చెప్పండి తెలిస్తే...

...రైటే. మనదేశపు శిల్పాలగురించి మళ్ళీ ఓసారి గుండెలుబాదుకుని ఆశ్చర్యపోవడం. తాజమహల్, కుతుబ్ మినార్, జంతర్ మంతర్ వగైరాలు. వీటిగురించి విడి విడిగాను, జమిలిగానూ, సమష్టిగానూ కన్నాం, విన్నాం. మళ్ళీ ఇవి తెలుసా అన్న ఉపాయంమీద పొడుపుకథలుగా చూపించారు. కొలం నాడు ఒక హాలీవుడ్ కంపెనీ (యునైటెడ్ ఆర్టిస్ట్స్ అయి వుండాలి) 'క్విజ్ సీరీస్' తీసింది. ఇది వాటికి అనుకరణ...అంచేత తప్పు అవటం లేదు కాని, మళ్ళీ మనం శిల్పాలతోనే సినిమాలు తీయాలని లేదు. భారతదేశపు ప్రజలు తెలుసుకోతగవీ, తెలుసుకో గోరవీ ఇంకా బోలెడన్ని ఉన్నాయి ... ఇప్పుడు తీసింది 'శాంపుల్' అనడంలో అర్థం లేదు...

ఎల్ - ఆర్. భట్ దీనికి పెట్టిన సంగీతం బాగుంది. ★

## కేసరీ పాఠశాలకు శ్రీ నాగిరెడ్డి విరాళం

విజయ స్టుడియోస్ అధిపతి శ్రీ బి. నాగిరెడ్డి, మద్రాసు త్యాగరాయనగర్ లోని కేసరీ మాధ్యమిక పాఠశాలకు ఇరవై అయిదు వేల రూపాయలు విరాళం ప్రకటించి, అందులో నాలుగు వేలు గతవారం అందచేశారు. మిగతాది వాయిదాలుగా ఇస్తామన్నారు.

ఇప్పుడు అక్కడ నాలుగు, ఐదు ఫారాలు ఏర్పాటుచేయాలని పాఠశాల పాలక సంఘం ఆలోచిస్తూంది. వాటికి కావలసిన హాలును నిర్మించడానికికూడా సహాయం చేస్తామని శ్రీ నాగిరెడ్డి వాగ్దానం చేశారు.

* * *

## తెనాలి కళాశాల సహాయార్థం...

తెనాలి కళాశాల భవననిర్మాణానికి ధన సహాయం చేసే సత్సంకల్పంతో ప్రముఖ తెలుగు నటీనటులు, టెక్నిషియన్‌లు, గాయ

యీ ఆవూళ్లో 'మనోహర' అనే నాటకం ప్రదర్శించ నిశ్చయించుకొని అందుకు సన్నాహాలు పూర్తిచేశారు. దీనికి శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు, శ్రీ కె. జగ్గయ్య మొదలగువారు పూనుకొని, నాటివారి సహకారం ఆకట్టుకువచ్చి కృషిచేస్తున్నారు.

"కళాశాల భవననిర్మాణానికి ఆరులక్షలు కావాలని అంచనావేశారు. అందులో సాంస్కృతిక కార్యక్రమాలు జరుపుకోవడానికి కట్టే సభామందిరానికి అరవై వేలు కావాలి. ఈ నాటకంద్వారా ఈ మొత్తాన్ని సేకరించాలని మా సంకల్పం. ఇంత మొత్తం వసూలుకావాలంటే, ఆంధ్ర ప్రజలంతా అభిమానంతో, ఉత్సాహంతో సహకరించాలని వేరే చెప్పనక్కరలేదు. కాబట్టి తెలుగు వారందరూ—ముఖ్యంగా గుంటూరుజిల్లా వారు లందరూ ఇందుకు పూర్తిదోహదం చేయాలని విజ్ఞప్తిచేస్తున్నాం" అని నిర్వాహకులు ఒకప్రకటన చేశారు. వారు: శ్రీయుతులు కె. జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, పెరుమాళ్ళు, పద్మనాభం, చిక్కాలినేని రాధాకృష్ణమూర్తి రామకోటి, జి. వరలక్ష్మి, గిరిజ, ప్రమీల, సీత, లలితారావు, కోదండపాణి, మాధవపెద్ది సత్యం, పి. నాగేశ్వరరావు, పి. బి. శ్రీనివాస్, ఎస్. జానకి, స్వర్ణలత, జి. వెంకట్రావు.

నాటక ప్రదర్శనం ఏప్రిల్ 28వ తేదీ రాత్రి తెనాలిలో జరుగుతుంది.

* * *

## పద్మశ్రీవంతికి జరిమానా

సినీనటి నర్గీస్‌కు బొంబాయి ప్రెసిడెన్సీ మాజస్ట్రేటు 25 రూపాయలు జరిమానా వేశారు. ఏడాదిన్నర క్రితం ఒకనాడు, నర్గీస్ ఒక పోలీసు ఉద్యోగి విధి నిర్వహణను అసభ్యంగాను, దౌర్జన్యంగాను అటకాయించినట్లు ప్రాసిక్యూషన్ అభియోగం. గిర్‌గాంవ్ న్యాయస్థానంలో ఇది గత సంవత్సరం విచారణ జరుగుతూ ఉండగా రాష్ట్ర ప్రభుత్వం అభియోగాన్ని ఉపసంహరించుకొంది. దరిమిలా, దీనికి అనుమతి ఇచ్చిన మేజస్ట్రేటు, అభియోగాన్ని సాకల్యంగా పరిశీలించలేదన్న కారణంపై, పునర్విచారణ జరగాలని హైకోర్టు ఆదేశించింది. ఇపుడు మేజస్ట్రేటు శ్రీ ఎం. నేమాజీ పాతిక రూపాయలు జరిమానా వేశారు.

* * *

# భలే మేళం!

(11-వ పేజీ తరువాయి)

మాడు. పోలీసు రెండుమూడుసార్లు అడిగే దాకా యేమీమాట్లాడక చివరికి, 'నాపేరు శేఖర్' అన్నాడు దొంగ.

పోలీసు: ఏమిటి! దొంగవైనా మంచి నాజూకైనపేరే పెట్టుకున్నావే! అయితే మీ ఊరు?

దొంగ: ప్రస్తుతం యీ ఊరే.

పోలీసు: ఊఁ! అల్లాగా! చమత్కారం కూడా తెలిసే నీకు! అయితే అసలూరు?

దొంగ: అసలూరు, కేపల్లె.

భీమయ్య: ఇంటిపేరు?

దొంగ: కురుగంటి.

తిలక్: కొదండీ పోలీస్‌గారూ, ఇది మా బావగారి పేరండి. వీడెవడో ఆయన పేరుచెప్పి తప్పించుకు పోవాలని చూస్తున్నాడు. మీరుబాగా విచారించాలండి.

"ఏదీ, మరొకసారి వానిముఖం చూడనివ్వండి" అంటు లాంతరెత్తాడు పోలీసు. ఇంతలోనే దొంగ తలపాగాతీసేసి, మీసం లాగిపారేశాడు. ముఖం చేత్తో తుడుచుకుని చిరునవ్వుతో నుంచున్నాడు. చూస్తే నిజంగా తన పెద్దబావగారే ఆ దొంగ! "ఏమిటిది బావా!" అన్నాడు ఆశ్చర్యంతో తిలక్. భీమయ్య యేమీ మాట్లాడలేక నిశ్చేష్టుడైనాడు. ఇంతలో ఆ సందడికి మెలకువవచ్చి యింట్లోంచి రాజ్యత్రయము, తల్లి కాంతమ్మ గబగబ అక్కడికొచ్చారు. కాని ప్రతాప్ మాత్రము యింకా ముసుగులోంచి బయటికి రాలేదు!

"మీరు సమయానికి వచ్చారు కాబట్టి త్వరగా తేలిపోయింది. మా అల్లుడిగారి నాటకం. మీసహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి" అన్నాడు భీమయ్య.

"అల్లాకాదు. మీ అల్లుడైతే మాత్రం యేమండీ? అర్ధరాత్రివేళ యీ దొంగ వేషమేమిటి? ఈ రివాల్వరేమిటి? ఇదంతా అనుమానంగా ఉంది. ఆయనను పోలీసు స్టేషనుకు తీసుకెళ్ళాలిసిందే యిప్పుడు" అని గర్జించాడు పోలీసు.

"ఎందుకండీ తీసికెళ్లటం? మేం కేసుపెడితేగదా?" అని అందుకుంది స్వరాజ్యం.

"మీరు కేసుపెట్ట నక్కరలేదు," అని నొక్కి వక్కాణించాడు పోలీసు. ఇక ఉపాయంగా ఆ పోలీసును సమాధానపరచి పంపుదామని, "మీరు కొత్తగా వచ్చారా అండి? మిమ్మల్ని మనఊరిలో యిదివరకెప్పుడూ చూచినట్లు జ్ఞాపకం లేదే!" అన్నాడు భీమయ్య.

"హుఁ! చాలా సార్లు చూశారు!" అన్నాడు పోలీసు.

"లేదే!" అని భీమయ్య అందుకున్నాడు.

"లేకేం?" అంటూ తన తలపైనున్న టర్కీటోపీ తీసేసి, గడ్డం విప్పేశాడు పోలీసు. అందరు ఘొల్లున నవ్వారు.

"ఏమిటిది! బావగారిద్దరు కలిసి యీ నాటకమాడారే!" అన్నాడు తిలక్.

"హుఁ! ఇద్దరమే యేం కర్మం ముగ్గురం ఉండగా!" అన్నాడు పెద్దబావగారు.

"ఏడీ మూడోబావ?" అన్నాడు తిలక్.

"అడుగో, యీ సందడివిని బయటినుంచి యెవరూ రాకుండా సింహద్వారం దగ్గర కాపలా ఉన్నాడు. రావయ్యా తమ్ముడూ!" అన్నాడు రెండవ బావగారు.

చిరునవ్వు నవ్వుకుంటూ మెల్లగా మూడవ బావగారు కూడ అక్కడికొచ్చారు.

"అమ్మ దొంగలారా! హాలులో పడుకున్నట్లే పడుకుని ఈదొంగనాటక మాడారు" అంది రాజ్యం.

"ఆడకేం చేస్తాం? మామగారి మాటలూ మామగారి బడాయిలు యెంతవరకు నిజమో చూద్దామనే ఈ నాటకమాడాం! ఇదుగో ప్రతాప్ ఉంగరం, దొంగిలించాం." అన్నాడు పెద్ద బావగారు.

'ఇదంతా నిజంగా దొంగ నాటకమేనని నాకిదివరకే తెలుసు. అందుకనే నా ఉంగరము ధైర్యంగా యిచ్చి ఊరుకున్నాను!" అన్నాడు ప్రతాప్ ముసుగు తీయటానికి సిగ్గుపడుతూ.

"ఆహా! ఏమి ప్రతాపమండీ! బావగారు! నిజంగా యివాళ మీకు మేము వీరప్రతాప్ అని బిరుదిస్తున్నాం!" అన్నాడు మూడవ బావగారు.

"అయితే చిన్నప్పటి నాటకాలు ఇంకా మరిచిపోలేదన్నమాట అల్లుళ్లు!" అంది కాంతమ్మగారు.

"మీకీ కాకిగుడ్డలు యీ రివాల్వరు యిందుకు ఉపయోగించా యన్నమాట యివాళ్లి!" అంది స్వరాజ్యం.

"ఎంత నాటక మాడారు" అంది సామ్రాజ్యం.

"బాగానే ఉంది అల్లుళ్ల అఘాయిత్యం!" అంది రాజ్యం.

"బావగారి భడాయి బాగాలేదు?" అని అందుకున్నాడు పెద్దల్లుడు.

"దొంగలున్నారు జాగర్త!" అని ముగింపు చేశాడు తిలక్.

"భలే మేళాం! అందరు నాకు తగినవాళ్లే దొరికారు!" అని లోలోన అనుకుంటూ భీమయ్య మళ్లా నడుం వాల్చాడు.

అందరు నవ్వుకుంటూ ఎవరి స్థానాలకు వారువెళ్ళారు. రాత్రంతా యేవేవో దొంగల కబుర్లు, దొరల కబుర్లు చెప్పుకుంటూ, తెల్లవారుజామున మళ్ళా ఒళ్లు మరచి నిద్రపోయారు.



 న్యూఢిల్లీ లేఖ 

[7 వ పేజీ తరువాయి]

ధనం కాస్తన్నా ఉన్నంతకాలమూ దాని మీద ప్రభుత్వం అజమాయిషీ ఉండక తప్పదు. రాజ్యాంగం ప్రకారం భారత సమాహార నిధిపై పార్లమెంటు అజమాయిషీ ఉండాలి. ఆ నిధిలోంచి డబ్బు ఎవరు తీసి వాడినా వాళ్ళు పార్లమెంటుకు జవాబు దారులై ఉండాలి. ఈ విషయాన్ని విస్మరించటంవల్ల ఎలాంటి ప్రమాదాలు సంభవిస్తాయో జీవితభీమా కార్పొరేషనువిచారణ సందర్భంలో వెల్లడిఅయింది. సహకారోద్యమం తనపెట్టుబడిని తానే సమకూర్చుకుంటే ఎవరూ అభ్యంతరం చెప్పరు. అలాచేస్తే దాని మీద ప్రభుత్వాధికారం ఉండదు కూడాను. కాని ఇప్పటి రాజ్యాంగం అమల్లో ఉన్నంత కాలమూ, కేంద్ర సమాహారనిధి లోంచి డబ్బు తీసివాడుకునే సంస్థలు, సంఘాల మీద ప్రభుత్వ అధికారం ఉండక తప్పదు. అందుచేతనే సమాహారనిధి అధికారులు ప్రధాన మంత్రి ఉద్బోధనా అమలు చేయలేకుండా ఉన్నారు. దీనికి మార్గాంతరం ఏమిటంటే రాజ్యాంగాన్ని సవరించటం.

* * *

ఇంగ్లీషు స్టెనోగ్రాఫర్లకు, టైపిస్టులకు ఉన్న ప్రమోషన్ వగైరా సౌకర్యాలు హిందీ టైపిస్టులకూ, స్టెనోలకు ఉన్నాయా అని లోక్ సభలో వచ్చిన ప్రశ్నకు సమాధానంగా హోం శాఖలో మంత్రి శ్రీ బి. ఎన్. దతార్ ఇంగ్లీషు, హిందీ టైపిస్టులను లోయర్ డివిజన్ గుమాస్తాలుగా చేర్చుకుంటున్నామనీ, ఉద్యోగ సౌకర్యాలు ఉభయులకూ సమానమేనని చెప్పారు.

హిందీ స్టెనోగ్రాఫర్ల విషయం చెబుతూ వీరికి అట్టే గిరాకీ లేదనీ, అంచేత తాత్కాలిక ఉద్యోగాలే ఇస్తున్నామనీ చెప్పారు.

కేంద్ర ప్రభుత్వపు వివిధ శాఖల్లో హిందీ టైప్ రైటింగు, హిందీ షార్టుహాండు రెండూ వచ్చిన వాళ్లు 119 అనీ, హిందీ టైప్ రైటింగ్ మాత్రమే వచ్చినవాళ్లు 161 అనీ, హిందీ షార్టుహాండు మాత్రమే వచ్చిన వాళ్ళు 17 అనీ ఆయన చెప్పారు.

మరో ప్రశ్నకు సమాధానంగా రైల్వే డిప్యూటీ మంత్రి శ్రీ ఎస్. వి. రామస్వామి ఇలా అన్నారు :—

"రైల్వే బోర్డుకు ప్రజలనుంచి హిందీలో వచ్చిన ఉత్తరాలకు హిందీలోనే సమాధానాలిస్తున్నాము. రైల్వేల ప్రధానకార్యాలయాల్లోను, కొన్ని సందర్భాలలో డివిజనల్, డిస్ట్రిక్టు కార్యాలయాల్లోకూడా హిందీ ఉత్తరాలకు హిందీ జవాబులే ఇచ్చే పద్ధతిని ప్రవేశపెట్టాము. ఇతర కార్యాలయాలకుకూడా ఈ పద్ధతినే వర్తింప జెయ్యాలని చూస్తున్నాము.

పార్లమెంటుకు నివేదించిన బడ్జెట్ పత్రాలు, రైల్వే బోర్డువారి వార్షిక పరిపాలనా నివేదిక, దాని సంగ్రహ ప్రతి ఇంగ్లీషులోనే కాకుండా హిందీలో కూడా ప్రకటించారు. "భారతీయ రైల్వేలు-నూరేళ్ళ చరిత్ర" అనే పుస్తకాన్ని హిందీలో ప్రచురించారు.

రైల్వేకోడ్లు, మాన్యువల్‌లు, రేట్లు, ఫారాలు మొదలైన వాటన్నిటినీ హిందీలోకి తర్జుమా చేసేందుకు 1956 లో ఒక పథకం వేశారు. దీన్ని అమలుజరిపేందుకు ఆ ఏడే రైల్వేబోర్డు కార్యాలయంలో ఒక ప్రత్యేక హిందీ దళాన్ని ఏర్పాటు చేశారు. హిందీ తర్జుమా పని చురుకుగా జరుగుతోంది.

రైల్వే సిబ్బందికి రోజూ ఉపయోగకరంగా ఉండే కొన్ని పత్రాలు, నిబంధనలు మొదలైనవాటిని ముందుగా హిందీలోకి తర్జుమా చేయిస్తున్నాము. రైల్వే ఉద్యోగుల ప్రవర్తన నిబంధనలు, 'సేఫ్టీఫస్ట్' అనే పుస్తకం, గృహ నిర్మాణానికి బజానా నిబంధనలు తర్జుమా చేయించి రైల్వేలకు అందజేశాము. ప్రమాద పరిహార నిబంధనలు, రివైజ్డు సెలవు నిబంధనలు, ప్యాస్ నిబంధనలు, పి. టి. ఓ. నిబంధనలు, రైల్వే ఉద్యోగాలు అనే పుస్తకం, రైల్వేలలో సహకార ఉద్యమం గూర్చిన ఉపన్యాసాల పుస్తకం తర్జుమా చేయిస్తున్నాము.

రైల్వేబోర్డు కార్యాలయంలోని నాల్గవ తరగతి సిబ్బందికి పనికొచ్చే పత్రాలను ఇప్పుడు ఇంగ్లీషులోను, హిందీలోను కూడా అందజేస్తున్నాము. రైల్వే పరిపాలనా నివేదికలను, పరిపాలనా విధులను, పుస్తకాలను, ఇతర పత్రాలను సిబ్బందికి హిందిలో అందజేయటం ఎంతవరకూ సాధ్యంఅని అడిగి చూశాము. కొన్ని రైల్వేలలో వార్తాలేఖలు, ముఖ్యమైన ప్రకటనలు హిందిలో ప్రచురించటం అప్పుడే ప్రారంభమైంది."

పై సమాధానాల్ని చూస్తే హిందీపై వ్యతిరేకోద్యమం ఎందుకు చెలరేగిందీ బోధపడుతుంది. ఇతర భాషలవారికి లేకుండా ఒక్క హిందీభాషవారికే ఉద్యోగాలు ఎక్కువగా లభింపజేసేపద్ధతి మొదలైందని తెలుస్తుంది. ఈ హిందీవిధానంవల్ల ఎక్కువగా లాభం పొందేది ఉత్తరప్రదేశ్, బీహారు ప్రజలే.

* * *

సాయుధసేనల ప్రధాన కార్యాలయంలోని నాలుగవ తరగతి సిబ్బంది సంఘం సమర్పించిన పదికోరికల ప్రణాళికను రక్షణమంత్రి లోక్ సభకు నివేదించారు. ఈ ప్రణాళికలో రెండు కోరికలను వెంటనే నిరాకరించారు; ఒకటి—సంఘసభ్యులకు కేటాయించిన ఇళ్ళకు అద్దెను వసూలుచేయ గూడదు. రెండు—ఆఫీసుగదులను తెరవటానికి, మూయటానికి నౌకర్లను కాక వేరేదర్వాన్‌లను కూడా ఏర్పాటుచేయాలి.

ఈ రెండోది కొంచెం వింత కోరికే. ఆఫీసు గదులను మూసి తెరిచే పనిచేయటం చప్రాసీ బహద్దూర్లకు నామోషీగా ఉందట. అది వారి ఆత్మగౌరవానికి భంగమట. ఏవిషయంలో చూసినా ప్రమాణాలు పడిపోతున్నాయి. క్రమశిక్షణ, బ్రిటిష్ ప్రభుత్వమూ చెట్టాపట్టాలు వేసుకుని 1947 ఆగస్టు 15 నాడే న్యూఢిల్లీ నుంచి వెళిపోయాయి.

నాలుగవ తరగతి పనివారికి 'సేవానగర్' అనే పేట ఒకటి కట్టి ఇచ్చారు. ఆ పేటలో ఉండేపనివారు తమ ఇళ్లను ఎక్కువ మొత్తాలకు ఇతర్లకు అద్దెకిచ్చారు. ఈ పనివారెత్తరైనది ప్రభుత్వానికి తెలుసు. వీరంతా ప్రభుత్వంలో పనిచేసేవారే. అయినా 'మానవకారుణ్యం' పేరిట వీరిమీద ప్రభుత్వం చర్యలు తీసుకోవటం లేదు. జైహింద్.

* * *

మురికిపేటలను రూపుమాపటం పవిత్ర కర్తవ్యంగా తయారైంది. ప్రధానమంత్రి కాన్పూర్ లో చేసిన గంభీరోపన్యాసం అనంతరం కోట్ల కొలదిధనం మురికిపేటల నిర్మూలనకు వెచ్చింపబడుతోంది. అయితే ఈ నిర్మూలన వల్ల మురికిపేటలో నివసించేవారు బాధపడగూడదట. వారి ఇళ్ల పరిసరాలను మాత్రం శుభ్రంచేసి నవీన పారిశుద్ధ్య పద్ధతులు ప్రవేశపెడితే చాలునట. దీనివల్ల మురికిపేటలో ఉండేమనిషి మనస్తత్వం కించిత్తయినా మారదు. పరిసరాలు కొంతకాలం బాగానే ఉంటాయి. మళ్లీ ఎప్పటి ప్రకారం అపరిశుద్ధంగా మారిపోతాయి.

ఇది ఇలా ఉండగా కొత్త మురికిపేటలు లేస్తున్నాయి. న్యూఢిల్లీ, లిట్టన్‌రోడ్డులో చైనీస్ రాయబార కార్యాలయం ఎదురుగా ఒక మురికిపేట లేచింది. అసహ్యంగా ఉండే పూరిగుడిసెల్లో తినరాని తినుబండారాల అమ్మకం వ్యాపారం నిరంతరాయంగా సాగిపోతూ నేవుంది. ఇండియా గేట్ వద్ద మురికితనం వర్ధిల్లుతూ నే వుంది. మానవజీవితం కంటె మానవకారుణ్యం ముఖ్యంగనక ఇలా వ్యాధులు వ్యాపింప జేసే వ్యాపారస్థుల, అధికారులు సహించి ఊరుకుంటున్నారు. అలాటివారిని తొలగించటానికి పూనుకోవటం దైనందిన నగర పరిపాలనలో అక్రమంగా జోక్యంచేసుకోవటం అవుతుందని మంత్రులు భావించినంత కాలమూ ఈ అపరిశుభ్రతా పరిస్థితులు అలాగే ఉంటాయి. 

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



వేసవిలో కరుబూజాలు

ఫొటో. వి. తీతు — కర్నూలు.

Regd. No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.